# ఆంధ్రసచిత్రవారపత్రిక

విడి ప్రతి వెల రు. 4-00

సంపుటము 81 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 51

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు

(1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్‌లు 75667, 61247, 61248


## వీక్లీ పోస్ట్

### బహుమతి పొందిన లేఖ

**ఆంధ్రసచిత్రవారపత్రికమీద**

ఆంధ్రపత్రిక సదా నూతనత్వాన్ని ఆహ్వానించడంలో తొలిమెట్టు తానే ప్రారంభిస్తుంది గతంలో వారపత్రికలపై ముఖచిత్రం రంగులలో 'వినాయకుడి' చిత్రం వేసి పత్రికలపై రంగుల ముఖచిత్రాలకి నాందిపలికిన ఘనత ఆంధ్రపత్రికదే!

నవ్వు నాలుగు విధాల మంచిదని- ఆనందం ఆయుష్షని పెంచుతుంది అని పెద్దలంటారు ఎంతటి నిరాశా, నిస్పృహ, అలసటలో నైనా పత్రిక తిరగేస్తే-మనల్ని నవ్వుల పువ్వుల్లో ముంచేవి- మనసుకి ఆహ్లాదం చేకూర్చి- తేలిక పరిచేవి- పత్రికలోని కార్టూనులే

'తాజా కాలమ్'లో వీరాజీ 'గరమ్ గరమ్' వార్తలు యిచ్చి అవసరమైన చోట పాఠకుల్ని 'ఎలర్ట్' చేస్తున్నారు రాష్ట్ర రాజకీయాలు- అంతర్జాతీయ రాజకీయాలకి వేదిక తొలి నుండి ఆంధ్రపత్రికే! గతంలో వారం వారం కార్టూన్స్‌లో మొదటి పేజీల్లో సుతిమెత్తని చురక లు అంటించేవారు! ప్రస్తుతం ఆ పని సంపాదకీయం చేస్తున్నా- తిరిగి కార్టూన్స్ ప్రవేశపెట్టండి

కాలానుగుణమైన ట్రెండ్‌కి తగ్గ మార్పులు తేవడం నిజంగా ముదావహం ఈ ప్రయత్నాన్ని మనం 'సీరియల్స్'లో చూస్తాం

ముఖ్యంగా నూతన రచయితలని 'కూపన్'ల వర్క్‌షాప్ కథల్తో ప్రోత్సహిస్తూ, వర్ధమాన రచయితలవి ప్రచురిస్తూ- సీరియల్ రచయితలైన వారిని ఆహ్వానిస్తూ- ఆంధ్రపత్రిక- అన్ని తరాలవారిని ఆకర్షించి ఓ యుగసంధిలో వున్నట్టు అనిపిస్తున్నది

మాటల్లో చెబితే సరసం- చేతల్లో చూపిస్తే శృంగారం అంటారు నేడు చాలా పత్రికలు దిగజార్చిన విలువలు- రెండోది అయిన శృంగారాన్నే ప్రచురిస్తు వుంటే సమస్యా పూరణం-టిట్-ఫర్-టాట్ శీర్షికల్లో సునిశితమైన సరసోక్తులు మనల్ని గిలిగింతల పెడతాయి

-మంత్రిప్రగడ శకుంతలాకళ్యాణి
విశాఖపట్నం-2

(ఆవ పేజీ చూడండి)



ముఖచిత్రం:

గాజులంటే భలే మోజు అంటున్న జూహీచావ్లా
(ఫొటో జగ్‌మోహన్)

పై వారం·
లివర్ వ్యాధులపై ప్రత్యేక వ్యాసం

## ఈవారం ప్రత్యేకం:–



## కథలు :–



## సీరియల్ నవలలు :–



## వ్యాసాలు, శీర్షికలు

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

ఆంధ్రసచిత్రవారపత్రిక

విజయవాడ
11-8-1989

ఎడిటోరియల్ అడ్వయిజర్ శివలెంక రాధాకృష్ణ
ఎడిటర్ వీరాజీ
ముద్రాపకుడు, ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు

శకసం 1911
శ్రావణమాసం 20వ తేదీ

# పార్టీస్వామ్యమా? ప్రజాస్వామ్యమా?

మొండివాడు రాజు కన్నా బలవంతుడు అంటారు- మొండివాడే రాజైతే? ఆ సంగతి వేరే చెప్పాలా?- బోఫోర్సు వ్యవహారంలో సి అండ్ ఏ జి, నివేదికలో ఎత్తి చూపబడిన "లోపాలు" కూడా శ్రీ రాజీవ్‌గాంధీని నైతిక బాధ్యత స్వీకరించమని నిలదియ్యలేకపోయాయి! ప్రతిపక్షాలు యించుమించు గడిచిన మార్చి నుంచీ పార్లమెంటులో వ్యవహారాలను జరగనివ్వకుండా ప్రభుత్వం మీద - "జరిగిన తప్పిదా"లను అంగీకరించమని వొత్తిడి తేవటానికే వున్న సమయం అంతా వెచ్చిస్తూ వచ్చాయి! వానాకాల సమావేశాలలో శ్రీ రాజీవ్‌గాంధీ "పంచాయితీరాజ్ బిల్లు"ను చట్టం చెయ్యాలని చూస్తున్న తరుణంలో ప్రతిపక్షాలు "కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదికను ప్రయోగించి- ప్రభుత్వాన్ని రద్దు చేయించాలనుకున్నాయి అందులో వారిని తప్పు పట్టవలసిందేమీ లేదు! మొదటి మూడు రోజులు సమావేశాలను జరగనివ్వకుండా స్తంభింపజేశాయి ప్రతిపక్షాలు- కాని రాజీవ్ గాంధీ యీ "నివేదికను" పార్లమెంటులో చర్చకు పెడతామనేసరికి- తమ వ్యూహ రచనను మార్చుకోవలసిన స్థితిలో పడిపోయాయి ఆ సమయంలో యీ బోఫోర్సు "కుంభకోణం"లోకి- అప్పటి ఆర్థిక మంత్రిగా, అప్పటి రక్షణ మంత్రిగా వున్న యిప్పటి ప్రతిపక్ష ఫ్రంట్ నాయకుడు శ్రీ వి పి సింగ్‌ను కూడా యీడ్చి "యాగీ" చెయ్యాలనుకుంటున్న కాంగ్రెసు (ఐ) పార్టీ వ్యూహాన్ని ఎదుర్కొనడానికి- రాజీనామాల "ఎత్తుగడ"ని- చివరి చర్యగా- లోక్‌సభలోని అన్ని రకాల ప్రతిపక్షాలు నిర్ణయించుకోవలసి వచ్చింది!- ఈ ప్రతిపాదన వి పి సింగ్, దేవీలాల్ ప్రభృతి నాయకుల నుంచి గాక ఫ్రంటు ఛైయిర్మన్ శ్రీ ఎన్ టి రామారావు నుంచి రావడం వల్ల- ఫ్రంట్‌లోను ఫ్రంట్ వెలుపలా వున్న ప్రతిపక్షాల మధ్య అంతర్గత వైరాలను ప్రక్కకు నెట్టి 106 మంది లోక్‌సభ ప్రతిపక్ష సభ్యులు తమ పార్లమెంటు సభ్యత్వానికి "తిలోదకాలు" యివ్వడానికి తీర్మానించుకున్నారు- ఇది ఒక చరిత్రాత్మక- అపురూప అనూహ్య ఘట్టం!- ఏడాది చివర ఎన్నికలు పొంచి వున్న సమయంలో దీన్ని రాజకీయ పన్నాగంలో మేలైన వ్యూహంగా పరిశీలకులు అభివర్ణించారు!- కాని ప్రతిపక్షాలు యీ విధంగా నిష్క్రమించిన తరుణంలో- లోక్‌సభలో ప్రత్యక్షమైన శ్రీ రాజీవ్‌గాంధీ- చలనం లేనట్లు- యింత పిసరు "చలించనట్లు" కనపడ్డారు లోక్‌సభలో తనకున్న మంద బలంతో- బోఫోర్సు ఉదంతం మీద ఏకపక్ష చర్చను కొనసాగిస్తూ- ప్రతిపక్షాలను నిస్సహాయ స్థితికి త్రోసివేస్తూ- యీ వానాకాల సమావేశాలను యిట్లాగే కొనసాగిస్తామని- ఎన్నికలు అనుకున్నట్లే నిర్వహిస్తామని- శీతాకాల సమావేశాలు వుండబోవని ప్రకటించారు! ఇదంతా చూడగా సామాన్యుడుకి యీ దేశంలో "పార్లమెంటరీ డెమోక్రసీ" లేదని, ఉన్నది పార్లమెంటరీ "పార్టీ" స్వామ్యమేనని అర్థమైపోయింది! "బోఫోర్స్" ఫార్స్ యివ్వాళ జగద్విదితం- అతి రహస్యం బట్టబయలుగా వున్న యీ వ్యవహారం అట్లా వుండనివ్వండి! ప్రధానమంత్రి హోదాలో వున్న శ్రీ రాజీవ్‌గాంధీ నైతిక సూత్రాలను గాలికి వదలివేసిన విషయం యిప్పుడు చర్చించి ప్రయోజనంలేదు కాగా యిప్పటికి ఎనిమిదిసార్లు సార్వత్రిక ఎన్నికలు జరిగినా "లోక్‌సభలో" ప్రభుత్వపక్షం "బ్రూట్ మెజారిటీ"తోనే వస్తూండటం- ప్రతిపక్షాలు కప్పల తక్కెడ మేళంగా ఒకసారి "కలివిడిగా" మరొకసారి విడివిడిగా నిస్సహాయ పోరాటం సాగించటం తప్ప మరేమిటి జరుగుతున్నది? అన్న ప్రశ్నకు- ప్రతిపక్షాలు చరమాంకంలో రాజీనామాలు చేసి బయటపడటమొక్కటే అతి నూతనంగా కనపడుతున్నది- వానలొచ్చినా గాలివానలొచ్చినా జనం కడగండ్ల మధ్య యీ వ్యవహారాలని గమనిస్తూనే వున్నారు! ఎన్నికల కురుక్షేత్రం రానే వస్తున్నది. ఈ తరుణంలో "రాజీనామాస్త్రాలు" దళసరి చర్మం గల ప్రభుత్వ పక్షం మీద యింత పిసరు "నాటుకోక"పోవడంతో ప్రతిపక్షాలు "నానా గోత్రస్య" కలిసి- వీధి పోరాటానికి సన్నద్ధం అవుతున్నాయి! ఆగస్ట్ 9న- సంకల్పించిన- "దేశ్‌కో బచావో" కాని, ఆగస్ట్ 30న తలపెట్టిన "బంద్" కాని- పాలకపక్షం మీద యెటువంటి ప్రభావాన్ని చూపెట్టవు! ఆస్తి నష్టం జననష్టం- అశాంతి- అల్లర్లు జరగటం, ప్రజలు యిబ్బందిపడటం- చట్టసభలలో జరుగవల్సినది రోడ్ల మీద జరుగదు అన్న నగ్న సత్యం రక్తపాతయుతంగా అందరికి తెలిసిరావడం తప్ప వీటివల్ల ఎన్నికల ముందు ప్రయోజనం వుండదని ప్రతిపక్ష నాయకులకు విజ్ఞులు హితవు చెప్పవలసి వుంది! ప్రభుత్వ అవినీతిని గాని- నిరంకుశ ధోరణిని గాని ఎవ్వరూ సమర్థించరు- అది రేపటి ఎన్నికలలో ప్రతిపక్షాలు నిరక్షరాస్యులైన అమాయక ప్రజలకు విడమర్చి చెప్పవలసిందే! కాని యీలోగా "అత్తమీద కోపం దుత్త"మీదఅన్నచందాన- ప్రజలను బంద్‌ల ద్వారా, ఆందోళనల ద్వారా మరింత దుఃఖపెట్టడం సముచితమైన చర్య కాదని మాత్రమే మేము ప్రజల తరపున విజ్ఞప్తి చేయదలిచాము అదే సమయంలో శ్రీ రాజీవ్‌గాంధీ అనుయాయులను కొత్త వోటర్‌లు వారి మొండి వైఖరిని వెయ్యి కళ్లతో గమనిస్తున్నారు సుమా! అని కూడా హెచ్చరించదలిచాము. ●

(గత సంచిక తరువాయి)

ధర్మరాజు తల వంచుకుని కూర్చున్నాడు

'ఏమి చెయ్యలేని నిస్సహాయ స్థితి'

తన మీద తనకే అసహ్యం. తన సామ్రాజ్యం, ఆధిపత్యం అంతా కౌరవులకు సంక్రమించింది

రాజసూయం చేయగా వచ్చిన విలువైన కానుకలు, ధన కనక వస్తు వాహనాలు అన్నీ పోయాయి

పాండవ రాజ్యలక్ష్మి తన మీద కినుక వహించింది

ఇది తన బలహీనతా? చేతగాని తనమా?

రెప్పల్ని తోసుకుని వస్తున్న కన్నీళ్ళను బలవంతంగా ఆపుకున్నాడు

ఇంతకంటే మరణమే మేలనిపించింది

జీవితంలో అన్నిటికన్నా పెద్ద ఓటమి చావును కోరుకునే దుస్థితి రావడం

శకుని. ధర్మరాజు మనో భావాన్ని పసిగట్టాడు

'ధర్మరాజా! అప్పుడే అంత నిరుత్సాహ పడాల్సిందేముంది? నీ తమ్ముళ్ళని పందెంగా పెట్టి చూడు గెలవగలవేమో అన్నాడు

ధర్మరాజులో ఆశ చిగురించింది

యుక్తా యుక్త వివేక జ్ఞానం లేకుండా ఆదిత్య తేజులూ, శత్రుంజయులూ అయిన నకుల సహదేవులను పందెంగా పెట్టాడు

ఆ యిద్దరినీ వాళ్ళ ఆయుధాలతో సహా గెలుచుకున్నాడు శకుని

అది చూసి సభాసదులు విస్తుబోయారు

అసలిది సాధ్యమేనా అనిపించింది భీమార్జునులకు

'ఎలా అయితేనేం మాద్రి పిల్లల్ని తేలికగానే వదిలించుకున్నావు' అని శకుని వికృతంగా నవ్వుతూ అనే సరికి ధర్మరాజుకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

మా మధ్య లేనిపోని అరమరికలు సృష్టిస్తున్నావు అన్నాడు.

'కాకపోతే భీమార్జునులను ఎందుకు వదిలేశావు? పందేనికి కూడా పనికి రాని అయోగ్యులా వాళ్ళు!'

'మామా! పెద్దవాడివి నోటికొచ్చినట్టు మాట్లాడటం తగదు' అన్నాడు ధర్మరాజు మనసు కష్టపెట్టుకుంటూ

ఎందుకు?'

మమ్మల్ని విభజించి పాలిస్తున్నందుకు



సీరియల్

# ద్రౌపది

ప్రయాగ రామకృష్ణ



అన్నాడు దర్మరాజు

శకునిలో ఎంత కుత్సితముందో ఆయనకు ఆ రోజే బాగా తెలిసింది

'వీడు పన్నగం లాంటి వాడు పాముకు తలలో నే విషం శకునికి నిలువెల్లా విషమే అనుకుంటుండగా శకుని దగ్గరగా వచ్చి దర్మరాజు భుజం మీద చెయ్యివేసి

'ఎంతయినా ఒక తల్లి బిడ్డలు కదా! భీమార్జునుల మీద నీకు ప్రేమే వుంటుంది వుండాలి కూడా మాద్రి పిల్లలకన్నా నీ తమ్ములు ప్రయోజకులనే నువ్వు వాళ్ళని పణంగా పెట్టేందుకు సందేహిస్తున్నావు అవునా?' అన్నాడు

## మాయా జూదం

శకునీ! నువ్వెంత నీచుడివిరా' అనుకున్నాడు దర్మరాజు మనస్సులో అర్జునుడ్ని దగ్గరకు రమ్మని పిలిచాడు అతను వచ్చాడు దర్మరాజు శకుని వైపు తిరిగి

'వీడు పాండవ మధ్యముడు- అర్జునుడు అస్త్ర విద్యా నిపుణుడు నిజంగానే నువ్వన్నట్టు వీడు నాకే కాదు మా అందరికీ చాలా ఇష్టుడు వీడితో సమానమైన వాడు ఈ భూమి మీదే లేదు వీడూ ఈ సారి నా పందెం' అన్నాడు

శకుని నవ్వుకున్నాడు

పాచికలు వేశాడు

గవ్వ తిప్పుడూ అతని వేపే!

'గెల్చుకున్నాం' అని పెద్దగా అరిచాడు శకుని

'చాలా పెద్ద పందెం కాసేవు నువ్వు మెచ్చుకోవల్సిందే- కాని నువ్వు చేసిన తప్పల్లా శకుని మామ తెలివి తేటల్ని తక్కువగా అంచనా వెయ్యడమే' అన్నాడు దుర్యోధనుడు

ఆ మాటలకు ధృతరాష్ట్ర సంతతంతా క్రీడా మందిరం దద్దరిల్లేటట్టు వికటాట్టహాసాలు చేసింది

ధర్మరాజు మొహం తెల్లగా పాలిపోయింది

వెనక్కి తిరిగి చూసాడు

భీముడు ఒక్కడే నిలబడి వున్నాడు

అన్నగారు పిలవ కుండానే దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు

నీళ్ళు నిండిన కళ్ళు పైకెత్తి ధర్మరాజు తమ్ముడ్ని నిస్సహాయంగా చూసాడు అర్జునుణ్ని పందెంలో పోగొట్టు కోవడాన్ని ధర్మరాజు ఇంకా జీర్ణించుకోలేదు తడి ఆరిన గొంతుతో 'భీముణ్ని పందెంగా పెడు తున్నాను' అన్నాడు

శకుని నవ్వేడు

ఇద్దరూ పాచికలు వేశారు

పందెం వేస్తున్నప్పుడు ధర్మరాజు చేతులు కంపించాయి మనిషి వణికాడు పందెం పడలేదు శకుని గవ్వలు దొర్లించి దిక్కులు పిక్కటిల్లేలా 'గెలుపు నాదే అని అరిచాడు

లేదు ఇది మోసం అని అరిచాడు దర్మరాజు అతని కంఠం క్రీడా మందిరం గది గోడల మధ్య ప్రతిధ్వనించింది అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి

'నా ద్యూత వ్యసనంతో ఎంతమందిని బలి తీసుకున్నాను' అనుకుని వాపోయాడు

ఏమిటి మోసం? ఆటలో ఎత్తుకు పై ఎత్తు లేకుండా వుంటుందా?'

దర్మరాజు మాట్లాడలేదు

'ఓడానని ఒప్పుకో లేదా నీ దగ్గర ఇంకేమైనా వుంటే పందెం కాయి అన్నాడు శకుని

'ఏం మిగిల్చావు కనుక ఈ సారి నన్ను నేనే పందెంగా పెట్టుకుంటున్నాను ఇష్టమేనా? అన్నాడు దర్మరాజు

'భలే వాడివే! తమ్ముల సాయంతో దిక్కులన్నీ జయించి రాజసూయం చేసిన వాడివి, పాంచాల రాజుకి పెద్దల్లుడివి నీ మాట మెత్తన, నీ మనసు మెత్తన| అని ప్రజలందరూ అనుకుంటుంటారు నీ లాంటి ధర్మాత్ముణ్ని వదులు కుంటామా శకుని ఈ మాట అన్నాక ఆట సాగింది.

దర్మరాజు మళ్ళీ ఓడి పోయాడు

తనే నడుచుకుంటూ వెళ్ళి దుర్యోధనాదుల వెనకగా నిలబడ బోయాడు

'అంత ఖర్మ మేమొచ్చింది నీకు నీ దగ్గరింకా కోట్ల విలువ చేసే సొత్తు వుంది రా ఆటాడు' అన్నాడు శకుని

దర్మరాజుకు అర్థం కాలేదు తనకు తెలియకుండా తన దగ్గరున్న ఆస్తేమిటి?

కన్నార్పకుండా శకుని వైపు చూసాడు

'ఏమిటది?

'చెప్పనా'

శకుని పెదవులమీద నవ్వు వెలసింది 'పాంచాలి' అన్నాడు పళ్ళు బిగబట్టి

ధర్మరాజు ఉలిక్కిపడి ఏమిటి నువ్వంటోంది?"

**ఇంతవరకూ సాగిన కథ- 13 :** పాంచాల దేశాధీశుడు ద్రుపదుడు వ్యాస మహర్షి ఆదేశంపై పాండవు లయిదుగురికి ద్రౌపది నిచ్చి వివాహం జరిపిస్తాడు పట్టాభిషేకానంతరం ధర్మరాజు- ద్రౌపదిని మిగిలిన సోదరులను తీసుకొని ఖాండవప్రస్థం చేరతాడు నారదుడు సలహాపై రాజసూయయాగం పూర్తి చేసిన ధర్మరాజు అర్ఘ్యం యిచ్చే విషయంలో అడ్డుపడిన శిశుపాలుడిని కృష్ణుడు వధిస్తాడు మయసభలో తనకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా పాండవుల సంపదను హరించే నెపంతో జూదానికి ధర్మరాజును ఆహ్వానిస్తాడు దుర్యోధనుడు. జూదంలో పణంగాపెట్టి ధన కనక వస్తువులను, రత్న భాండాగారాలను ధర్మరాజు కోల్పోవటం సహించలేని విదురుడు జూదం ఆపేందుకు విఫలయత్నం చేస్తాడు



## సిద్ధూ హంతకుడు కాదు!

భారత క్రికెట్ క్రీడాకారులలో దూకుడుగా ఆడే బ్యాట్స్‌మన్ నవజ్యోత్‌సింగ్ సిద్ధూ ఒక హత్యకేసు నుంచి ఎట్టకేలకు బయటపడ్డాడు.

గుర్నామ్‌సింగ్ అనే వ్యక్తిని హత్య చేశాడన్న ఆరోపణపై సిద్ధూమీద, అతని స్నేహితుడు రూపేందర్ సింగ్‌మీద హత్యకేసు దాఖలైన విషయం పాఠకులకు తెలిసినదే.

గత ఏడాది డిసెంబరులో పాటియాలలో ట్రాఫిక్ ఎక్కువగా వున్న ఒక రోడ్డులో తన కారును ఢీకొన్న మరో కారు ఆసామీ గుర్నామ్‌సింగ్‌ను సిద్ధూ చితకబాదేసి పరారీ అయ్యాడు. గుర్నామ్ అక్కడికక్కడే మరణించటం, ఆ కారులోనే వున్న ఆయన బంధువులు సరాసరి పోలీసుస్టేషన్‌కు వెళ్లి రిపోర్టు యివ్వటం జరిగిపోయాయి. పోలీసులు యిద్దర్నీ ఆ తర్వాత అరెస్టు చేశారు.

సిద్ధూ తండ్రి మాజీ అటార్నీ జనరల్ కావటమే కాకుండా, కాంగ్రెస్ (ఐ) మద్దతుదారుడు కూడా కావటంతో పలుకుబడి నుపయోగించి సిద్ధుకు బెయిల్ యిప్పించుకున్నాడు.

ఈ కేసు నడుస్తున్న సమయంలోనే సిద్ధూ వెస్టిండీస్ టూర్‌కి వెళ్లి వచ్చాడు. ఈ హత్యకేసు మోపబడటంతో సిద్ధూ క్రికెట్ జీవితం ముగిసిపోయిందని అనేక మంది భావించారు. కాని ఎట్టకేలకు తండ్రి పలుకుబడివల్లనైతేనేమి, యితర విధాల చేసిన ప్రయత్నాలవల్లనైతేనేమి కోర్టు సిద్ధూను నిర్దోషిగాను, అతని స్నేహితుడు రూపేందర్ సింగ్ నిందితుడుగాను పేర్కొంటూ తీర్పు యిచ్చింది. మొత్తంమీద కేసునుంచి బయటపడి సిద్ధూ హాయిగా ఊపిరి పీల్చుకుంటున్నాడు.

అన్నాడు. శకుని అదేమీ పట్టించుకోకుండా 'ఆమె అదృష్టంవల్ల మళ్ళీ నీరాజ్యం నీకు వస్తుందేమె పరీక్షించుకో' అన్నాడు.

అదీ నిజమే అనిపించింది ధర్మరాజుకు.

ద్యూత వ్యసనంలో మంచి చెడ్డలు మైమరిచి కుల ధర్మపత్ని అనైనా తలచకుండా పాంచాలిని పణంగా పెట్టాడు.

శకుని దుర్యోధనుడ్ని క్రీగంట చూశాడు. మందిరంలో సూదిపడితే వినబడేటంత నిశ్శబ్దం ఆవరించింది.

వరుసగా ఎప్పుడైతే పందెం నెగ్గక ఓడిపోతూ వుంటావో నిజానికి అప్పుడు ఆట ఆపెయ్యాలి. కాని ద్యూతంలో అలా కుదరదు. అది వ్యసనం. ఓడిపోతున్నకొద్దీ పౌరుషం పెరుగుతుంది. పట్టుదల ఎక్కువవుతుంది. ఆడేందుకు నీ దగ్గర డబ్బులు లేకపోతే అప్పు జేసైనా ఆడతావు. ఆట యిచ్చే నిషా అలాంటిది. సప్త వ్యసనాలలో జూదాన్ని చేర్చింది అందుకే. ధర్మరాజూ వెళ్ళి అదే వలలోచిక్కుకున్నాడు.

తనతో పాటు ద్రౌపదిని కూడా కోల్పోయాడు. ధర్మరాజు దీన వదనం చూసి ద్రోణ, కృప, భీష్ములూ, మిగిలిన పెద్ద వాళ్ళూ మొహాలు చింతాకంత చేసుకున్నారు. విదురుడు పెద్దగానే ఏడ్చాడు.

ధర్మరాజు అప్రతిభుడై నిలబడ్డాడు. కాని అతనికే ఆశ్చర్యంగా వుంది. పందెం కాస్తున్నప్పుడూ, ఆట ఓడిపోతున్నా ననుకున్నప్పుడూ కలిగినంత వ్యధ తీరా పూర్తిగా ఓడిపోయాక కలగడం లేదు.

రాజ్యం లేదు.

సార్వభౌమాధికారం లేదు.

సామంతుల్లేరు.

ప్రజల్లేరు.

ప్రజా రక్షణ లేదు.

అర చేతుల్లో ముఖాన్ని దాచుకున్నాడు ధర్మరాజు.

సభంతా గందరగోళమైపోయింది.

దుర్యోధనుడు, శకుని, కర్ణుడు, సైంధవుడు, దుశ్శాసనుడు అట్టహాసం చేశారు.

'విదురా! పాండవులు ద్రౌపదీతో సహా ఇక మాకు దాసులు. మా దాసీలతో కలిసి మా భవనాలు తుడుస్తుంది పాంచాల పుత్రిని తీసుకురా' అన్నాడు దుర్యోధనుడు గర్వంగా మీసాలు తిప్పుతూ.

ఛీ! నీచుడా! శకుని సాంగత్యంతో పూర్తిగా నాశనమయ్యావు. అన్యాయంగా దోచిన పరుల సొమ్ము నీకెంతకాలం నిలుస్తుందో నేను చూడకపోను. పాండవ ధర్మపత్నిని అవమానించిన పాపం నిన్ను పూర్తిగా దహిస్తుంది. తెలిసి కూడా కోడె త్రాచులను రెచ్చగొట్టావు. ఇక నీకు నాశనం తప్పదు' అన్నాడు విదురుడు.

'ప్రాతికామీ! ఇలా రా! ఈ విదురుడికి పాండవులంటే మొదటినుంచీ భయం. మన తిండి తింటూ వాళ్ళని పెద్ద చేసి మాట్లాడతాడు. అయినా ఇంకా భయమెందుకో! నువెళ్ళి ద్రౌపదిని పిలుచుకురా' అని దుర్యోధనుడు విదురుణ్ని హేళన చేస్తూ, ప్రాతికామిని ఆజ్ఞాపించాడు.

ప్రభువు ఆజ్ఞ మేరకు ప్రాతికామి పాండవ పత్ని సమక్షానికి వెళ్ళి 'అమ్మా! ధన సంపదలనూ, ధరణీ రాజ్యాన్నీ, తమ్ములనూ, తననూ, చివరికి నిన్ను కూడా ధర్మరాజు జూదంలో ఓడిపోయాడు. దుర్యోధన మహారాజు ఆజ్ఞ ప్రకారం నిన్ను సభా భవనానికి తీసుకు వెళ్ళాలని వచ్చాను' అన్నాడు.

## ద్రౌపది వస్త్రాపహరణం

ద్రౌపది నిర్ఘాంతపోయింది.

ఆపైన కాసేపటికి తేరుకుని 'ఎంత దుర్వ్యసనంతో మతి చెడిన జూదరైనా భార్యను పందెంగా పెట్టి ఓడిపోయే భర్త వుంటాడా! అందులోనూ ధర్మరాజు ఇలాంటి పని చేశాడంటే నమ్మలేకుండా వున్నాను. కొంతమంది వ్యక్తుల మంచితనంవల్ల వాళ్ళను నమ్ముకున్న వాళ్ళ జీవితాలు హృద్యంగా, మనోజ్ఞంగా తయారవుతాయి. ధర్మనందనుడి మంచితనంవల్ల మా బ్రతుకు లిలా...' దుఃఖంతో ఆమె గొంతు పూడుకుపోయింది. తరువాత మాట పెగల్లేదు.

'అమ్మా ఇలాంటివి ఏ యుగంలో వినకపోయినా ఇప్పుడు కళ్ళారా చూశాంగా! దయచెయ్యండమ్మా ఆలస్యమైతే దుర్యోధనుడు ఏం చేస్తాడో నన్న భయంతో ప్రాతికామి తొందరపెట్టాడు.

'నాయనా! అజాతశత్రుడే ఇలా చేస్తే ఇంక అనడానికేముంది! అయినా ఒక సందేహం! ధర్మపుత్రుడు ముందు తను ఓడి నన్నోడిపోయాడా లేక నన్నోడి తరువాత తను ఓడిపోయాడా?'

'ఏమో నాకా సంగతి తెలీదు'

'అయితే ఆ సంగతి ఆ జూదరినే ముందు అడిగి తెల్సుకో. అవసరమైతే అప్పుడు నన్ను తీసుకు వెళ్దువు గాని' యాజ్ఞసేని ఆజ్ఞను శిరసావహించి ప్రాతికామి వెళ్ళిపోయాడు.

ద్రౌపది అక్కడే కుప్పకూలిపోయింది

కళ్ళు అశ్రుదారలు వర్షిస్తున్నాయి

అలా ఏడుస్తూ ఎంతసేపు కూర్చుందో - వెళ్ళిన ప్రాతికామి మళ్ళీ తిరిగి వచ్చాడు

'పాంచాలపుత్రీ' శోకంవల్ల గుండె తూట్లు పడి నువ్వడిగిన ప్రశ్నకు దర్మరాజేమి సమాదానం చెప్పలేదు సందిగ్ధమైన అర్థాన్ని అందరి సమక్షంలో వివరిస్తామనీ మిమ్మల్ని తీసుకురమ్మనీ దుర్యోదన మహారాజుగారు శెలవిచ్చారు అన్నాడు

ఆ మాటలకు కలకంఠి దుఃఖోత్కంఠి అయింది

కన్నీళ్ళతో వక్షమంతా తడిసిపోయింది

అసలే రజస్వల - దానికితోడు పొద్దుటినుంచీ గుండెల్లో వణుకు ఆయాసంతో రొప్పుతోంది అడుగు తీసి అడుగు వెయ్యలేకపోతోంది

చేసేదిలేక అలాగే బయలు దేరింది

ముందు ద్రౌపది

ఆ వెనక ప్రాతికామి

వెళ్ళి దృతరాష్ట్రుడి వెనుకగా తల వంచుకుని నిలబడింది

కొంచెం దూరంలో పాండవులు నిలబడి వున్నారు వాళ్ళు ద్రౌపదిని చూడలేక సిగ్గుతో చితికిపోతూ అంతకంతకూ ఎక్కువవుతున్న దుఃఖావేశాన్ని అతి ప్రయత్నంతో అణుచుకుంటున్నారు

దుర్యోదనుడ్ని సంతోషానికి పట్టపగ్గాల్లేకుండా వున్నాయి

'దుశ్శాసనా' పెద్దల చాటున ఒద్దికగా నిలబడ్డ ఆ హరిణాక్షిని ఇలా మా సమక్షానికి తీసుకురా అన్నాడు

దుశ్శాసనుడు నిర్దయగా తన వైపు రావడం చూసి పాంచాలి బయపడి గాందారి దగ్గరకు పరుగెత్తింది దుశ్శాసనుడు కూడా ఆమె వెనుకే పరుగెత్తాడు

ఆగు ఎక్కడికి పారిపోతావు? శకుని మామ ఆడిన జూదంలో నిన్ను మేము గెల్చుకున్నాం ఇంక నువ్వు మా దానివు రాజ్యంతో పాటు నీ బర్తలు నిన్ను కూడా మా ప్రభువుకు అప్పగించారు వృదా ప్రయత్నాలు చెయ్యకు మానుంచి ఎక్కడికీ పారిపోలేవు అంటూ ద్రౌపదిని సమీపించాడు

ద్రౌపది అతనిని హీనంగా చూసింది

నీచుడా! నీవంటివాడు పుట డం పురుష జాతి పౌరుషానికే కళంకం నేను రజస్వలను వరుసకు నీకు వదినను తల్లిలాంటిదాన్ని నన్ను ముట్టకు ఎక వస్త్ర అయిన నేను గురు బందు జనులతో నిండిన సబా బవనంలోకి రాలేను నువ్వెళ్ళు అని దుశ్శాసనుడ్ని వారించింది

దుశ్శాసనుడు వికటాట్టహాసం చేస్తూ నువ్వు ఏక వస్త్ర వైతేనేం విగత వస్త్ర వైతేనేం' నీ కల్లబొల్లి మాటలకు కరిగిపోతాననుకోకు రా ముందు అని పులిలా గాండ్రించాడు

ద్రౌపది ఆ అరుపులకి బయపడిపోయి నాలు గడుగులు వెనక్కి వేసింది

దుశ్శాసనుడు ఒక్క అడుగులో ముందుకు దూకి ఆమె శిరోజాలు ఒడిసి పట్టుకున్నాడు

రాజసూయ యాగంలో మహర్షులు మంత్ర జల దారలతో పవిత్రమైన పాంచాల పుత్రి కురుల్ని పట్టుకుని దుశ్శాసనుడు ఆమెను ఈడ్చుకు పోయేందుకు ప్రయత్నించాడు ఆమె చాలాసేపు పెనుగులాడింది అయినా దుశ్శాసనుడు ఆమె జుట్టు విడిచిపెట్టలేదు

ద్రౌపది గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి తలెత్తి బర్తల వైపు చూసింది పాండవులు నిస్సహాయులై నిలబడి వున్నారు బీముడు మాత్రం పగతో మండిపోతున్నాడు తన బుజ బలమంతా అన్న చేతకానితనానికి అమ్ముడు బోయినట్టు విలవిల్లాడిపోతున్నాడు

తలెత్తి ద్రౌపది వంక చూశాడు

నల్లటి జుట్టు మొహంమీద పరుచుకుని ఆమె రాహుగ్రస్తమైన చంద్రబింబంలా వుంది సుడి గాలిలో సైతం పడిపోకుండా నిలబడిన విజయ పతాకంలాగ ఆ దుర్మదాందుల సబలో నిలబడిం దామె

(ఇంకా ఉంది)

# వరుణదేవుడి ఆగ్రహం!



ఊరూ-వాడా ఏకమైనాయ్!

ఏరు పొంగినట్టు- అంటారు. అలాగే ఏరు తీసినట్టు అని కూడా అంటారు. అంతలో మెరుపులా పొంగి తరుముకొచ్చి- జర్రున వచ్చిన ఏటి పొంగు- బుస్సున తీసేస్తుంది. బురదపాములా వుండే వాగు,త్రాచు పామై కాటేస్తుంది. ఇది నీళ్ల మీద ఆధారపడి బ్రతికే మనిషికి నీళ్లు కొట్టే సీజనల్ దెబ్బ కాని- ఏరు "తీసిన" తరువాత-

మన రోడ్లు వంతెనలు చిందరవందరై పోయి- రైళ్లూ బస్సులూ ఆగిపోయి- జన జీవితం అస్తవ్యస్తమైపోవడం యిరవై శతాబ్దం చివర జరగటమే దారుణం వేల సంవత్సరాల క్రితం నదులకి, వాగులకి ఏరుకి, సరస్సుకీ కూడా అడ్డకట్టలు, ఆనకట్టలు లేని పురాతన కాలంలో - నీటి దెబ్బకి చెక్కు చెదరక వుండే కోటలు,



ముసకొట్టిన బుడమేరు!

మునిగిన యింట్లోంచి యీత రానివాడి బ్రతుకు ఎలాంటిది?- జల దిగ్బంధనం మహా దారుణం

కడపజిల్లా నుంచి శ్రీకాకుళం జిల్లాదాకా - ఎడతెరపి లేకుండా కురిసిన ఘోర భయంకర వాన అంతా ఒక ఎత్తు- హైదరాబాద్ నుంచి, మదరాసు నుంచి విశాఖపట్నం నుంచి రైళ్ళు, బస్సులు, బండ్లూ వరద ప్రాంతాలకు చేరకుండా రైలు మార్గాలకి, రాదారుల మధ్య పడ్డ దారుణమైన గండ్లు కలిగించిన యిబ్బంది మరొక ఎత్తు- వరదలు తీసిన దెబ్బకి పుల్లి నాకి విడిచినట్లు వున్న ప్రాంతాలలో జన జీవనం యధాపూర్వ

గుళ్ళూ, గోపురాలు, సత్రాలూ, శాలలూ వుండేవి కదా- యివాళ సిమెంట్ కాంక్రీటు యుగంలో ఎందుకని చారెడు నీళ్ల ముంపుకే రోడ్లు "కాంట్రాక్టర్" పేరు చెప్పకుండా కొట్టుకు పోతున్నాయి? రైలు వంతెనలు రాజకీయాలను పెరెట్టి తిడుతున్నట్లు ఫెళా పెళా విరిగి కూలిపోతున్నాయి !- ఈసారి ఉత్తరాదిన మహారాష్ట్ర మీద దక్షిణాది కేరళ మీద- మన మీదా ఒక్కలాగే వరుణదేవుడు ఆగ్రహించి- కుండపోతగా కురిసి ప్రాణనష్టం, ఆస్తినష్టం యిచ్చాడు - తమ్మిలేరు, బుడమేరు, మునేరులాంటి ఉగ్రవాద ఏరులనేగాక చిన్న చిన్న వాగులను వంకలను కూడా బుసలు కొట్టే త్రాచులుగా మార్చి మనిషిమీద పడి కసి తీర్చుకునేలాగ తన ప్రతాపాన్ని ప్రదర్శించాడు వరుణదేవుడు

పట్టణవాసులకు, పల్లెవాసులకి తేడా లేకుండా యింతింతై అంతై అన్నట్లుగా మురుగుకాల్వలు కూడా పొంగిపోయి పల్లపు ప్రాంతాల వారి కన్నీటి ధారలతో మరింత ఉధృతమై పోయాయి! ఓదార్చడానికి, ప్రభుత్వం-


నీటి పాలైన ఒక గ్రామం!

గట్టున వున్న సోదర సమాజం వున్నప్పటికీ, యాతి బాదలలో అతి దారుణమైనది యీ "కడగండ్ల" బాధ! మళ్ళీ

ఏటికి కూడా మరుపురాదు నిప్పంటుకున్న యింట్లో నుంచి పరిగెత్తి ప్రాణాలు కాపాడుకోవచ్చును నీట

స్థితికి రావాలీ అంటే- రైలు వంతెనలు, రోడ్డు మార్గాలూ బాగుపడాలి- వీటిని యీ ఆదునిక యంత్ర యుగంలో పట్టుకుంటే పగడం, ముట్టుకుంటే ముత్యం అన్నంత "నాసిగా", "తేలికగా" నిర్మించిన ప్రజా శత్రువులు వారు కాంట్రాక్టర్లయినా, రాజకీయ నాయకులయినాసరే- వారెవ్వరయినా సరే- వారిని అభిశంసించాల్సిందే! "సామాజిక స్పృహ" అన్నది కేవలం రచయితలకి వుండాల్సిన బ్రహ్మ పదార్థం

దేశంలో పలు రాష్ట్రాలలో పడ్డ రాక్షస వానలు, దొంగ దెబ్బ తీసిన వరదలు మహారాష్ట్రను తాకి చివరి దెబ్బ కొట్టి పోయిన తుఫాను - వెయ్యి మందికిపైగా పొట్టను బెట్టుకున్నాయి - మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా, కర్నాటక, కేరళ, ఆంధ్ర రాష్ట్రాలు నీటి దెబ్బతో నోటిమాట రాక అవాక్కయిపోయాయి ఆపదలనుంచి తప్పుకున్నవారు మిగిలిన కొంపా గోడూ సర్దుకుంటున్నారు ఆంధ్రలో నే 5 లక్షల ఎకరాలలో పంట ఏటిపాలైంది 120 మంది జల సమాధి పొందారు - ఈ హృదయ విదారక స్థితిలో - "బోఫోర్సు ఉదంతం"మీద రాజీనామాలు చేసి కూడా ఎం పీ లు అయినవారు ఎం పీ ల హోదాలో - తమ తమ నియోజక వర్గాలలో వుండలేకపోయినందుకు విచారిస్తున్నారో, సంతోషిస్తున్నారో పట్టించుకునేవాడు లేకపోయాడు

కాదు- రోడ్లు, వంతెనలూ, నిర్మించే వారందరికీ వుండాలి! ప్రకృతి కన్నెర్ర చేసినప్పుడు తలదాచుకోడానికి- సహాయ సదుపాయాలు అవసరమైన చోటికి చేర్చుకోవడానికి ఉపయోగించని ఆధునిక వ్యవస్థ- అతి ప్రాచీన వ్యవస్థ కన్నా హీనమైనది పక్కా రోడ్లు, గట్టి వంతెనలు నిర్మించలేని మన నాగరికత, సాంకేతిక శాస్త్ర పురోగతి వృధా వృధా!- పొలాలు మునగడం అర్థం చేసుకోగలం కాని పల్లెలు పట్టణాలు మునిగిపోవడం ఏమిటి? ప్రణాళికా ప్రగతి యిదేనా? ప్రభుత్వ యంత్రాంగంలో నిలో పాలు యిప్పుడందరూ గ్రహిస్తారు కాని వారం రోజులలో - నష్టపరిహారం 'రాళ్లు' నాలుగు తెచ్చుకుని ''కర్మ సిద్ధాంతాని''కి తలవొగ్గి మళ్లీ వానాకాలం దాకా అంతా మరిచిపోతారు! ''టెండర్''లు సంపాదించుకున్న కాంట్రాక్టర్లు ''టెండర్''గా వంతెనలు, రోడ్లు నిర్మించినంత కాలం యీ కథ యింతే!!

# రెండు రకాలుగా ఎం. పీ. ల త్యాగం... త్యాగం

రాజీవ్ గాంధీగారు సి ఏ జి నివేదికమీద చర్చకే పట్టు చూపాడుకాని - రాజీనామాకి ససేమిరా అన్నాడు - దీంతో మూడు రోజులు సభను స్తంభింపజేసిన ప్రతిపక్షాల వారికి సోమవారంనాడు - చర్చలో పాల్గొనటానికి తల వొగ్గే స్థితి వచ్చింది ప్రతిష్ట కోసం - ప్రజలలో సానుభూతి కోసం - ఏమి చెయ్యాలన్న వ్యూహరచన సమస్య కు - ఎన్ టి ఆర్ చెప్పిన- రాజీనామాల మాట ఒక పరిష్కారమై పోయింది 106 మంది నానా గోత్రస్య పార్టీలకు చెందిన –(చివరికి బి జె పి జెండా ఎర్ర జెండా కూడా యీ అంశంమీద ఒకేసారి ఎగిరి)– 106 మంది ఎం పీ లు తలకాయలు తీసి పళ్లెంలో పెట్టి తమ తమ పార్టీల నాయకులకి అప్పగించారు - ఇది గొప్ప త్యాగం ఒకరకంగా పదవీ త్యాగం - మరొక రకంగా ఆదాయం త్యాగం! ఎం పీ అయిన పెద్ద మనిషికి నెలకో పదివేల ఆదాయం నేరుగా వుంటుంది సదుపాయాలు ప్రత్యేక ప్రతిపత్తి - షైరవీలకి పలుకుబడికి అవకాశాలు సరేసరి

ఇది రాస్తున్నప్పటికి 96 మంది మాత్రం మాజీ ఎం పీ లైనారు వీరిలో చాలామందికి పెన్షన్ కూడా రాదు లోకసభ సభ్యుడు ఆదాయం యిలా వుంటుంది (అంతా తెలుపు) జీతం 1500 మూడు వేలు నెలసరి నియోజకవర్గ భత్యం ఆఫీసు నిర్వహణకి మరో వెయ్యి రూపాయలు అధికారికంగా డిల్లీలో వుంటే (సభా సమావేశాల కాలంలో) రోజుకి 150 రూ ల దినభత్యం ఉచిత వసతి సౌకర్యం డిల్లీలో అన్ని రకాల సదుపాయాలతో తగుమాత్రపు చార్జీలకి ఇల్లు కూడా వుంటుంది - అక్కడా సొంత వూళ్లోను ఉచిత టెలిఫోన్ సదుపాయం తప్పదుకదా! తనకీ కుటుంబానికి వైద్య సదుపాయం వగైరా ఎన్నో సదుపాయాలు అంతేనా? సొంత మోటారు కారు కొనుక్కోడానికి 50 వేల రూపాయల అప్పు కూడా యిస్తారు ఇవన్నీ యిప్పుడు నెల తిరక్కుండా వదులుకోవాలి!

ఇంతా అయినా రాజీవ్ గాంధీ నిమ్మకు నీరెత్తినట్లు వుండటం అందరికీ ఆశ్చర్యం కల్గిస్తోంది పైగా వానాకాల సమావేశాలు యదామాదిరిగా కొనసాగుతాయి - ఎన్నికలు మామూలు సమయంలో నే వస్తాయి అంటున్నాడాయన! కాంగ్రెసేతర ప్రతిపక్షాల వారికి యిప్పుడు త్యాగం చేసిన ఎం పి లకు రేపు ఎన్నికలలో టిక్కెట్లు యివ్వక తప్పదు - ఈ మేరకు కొత్త వారికి ఆశలు చూపించి - నిదులు వసూలు చేసుకొనే చాన్సు లేదు ఆ నష్టం కూడా తప్పదు అయినా యివన్నీ ప్రక్కన బెట్టి మనం యీ ఎం పీ లను అభినందించి తీరాలి! (27-7-'89)

# క్షణ మాత్రంలో...



## ఐటెక్స్
### కాజల్ సుప్రీం

మీ కళ్ళ అందాన్ని ఇనుమడించే కాజల్ సుప్రీం. ఆధునిక వనితల కళ్ళను చక్కగా అలంకరించ డానికి, ఆరోగ్య సూత్రాలనను సరించి తయారుచేయబడిన కాజల్ సుప్రీం మీ చేతిలో సులభంగా ఇమిడేది.

అరవింద్ లాబొరేటరీస్ కళ్ళను సంరక్షించే శ్రేష్ఠ వస్తువుల తయారీలో దాదాపు **50** సంవత్సరా లకు పైగా అనుభవం వున్నవారు.

EYETEX KAJAL SUPREME




గరిష్ఠ వెల (MRP)
రూ. **6.00**
(స్థానిక పన్నులు అదనం)

అరవింద్ లాబొరేటరీస్ మదరాసు **600 033.**

Imageads 2788 - Tel

# కౌలాలంపూర్

## అచ్చి రఘురామరెడ్డి



కోస్టర్ మార్కెట్ ఆవరణలో ఆగింది. బిలబిలమంటూ ఒక్కొక్కరు దిగసాగారు. అందరూ దిగాక, సిరాజ్ టక్ సవరించుకొంటూ నెమ్మదిగా దిగాడు. కొందరు గవర్నమెంట్ షాప్‌కేసి నడవగా, మిగిలినవాళ్ళు వివిధ కోణాల్లో తమకు కావలసిన సామాన్లు కొనుక్కోడానికి తలా ఒకవైపు చెదిరిపోయారు.

గ్రీటింగ్స్ కొనుక్కుందామని సిరాజ్ ఆ షాపువేపు నెమ్మదిగా నడవసాగాడు.

"హల్లో! రఫిక్! (విదేశ మిత్రుడా!)" వెనుకనుండి అతన్ని ఏదో పరిచయమైన కంఠం పిలిచింది. వెనక్కి తిరిగి చూశాడు

కొద్ది దూరంలో ఆలీ చేయి వూపుతూ కనిపించాడు. తాను కూడ చేయి -పి నిలబడిపోయాడు సిరాజ్.

ఆలీకి సుమారు అరవై యేళ్ళు వుంటాయి చూడ్డానికి ఏభైఐదు యేళ్ళ వ్యక్తిలా కనిపిస్తాడు సిరాజ్‌కి, కొత్తగా వచ్చినప్పుడే పరిచయమయ్యాడు చాలా మంచివాడు నెమ్మదస్తుడు ఎప్పుడూ సరదాగా మాట్లాడుతూ వుంటాడు అతనికి యింగ్లీషు కొద్దిగా వచ్చు. సెకెండ్ వరల్డు వార్‌లో పనిచేయడం వల్ల అతనికి వచ్చు సాధారణంగా యిరాకియన్లకి వారి మాతృభాష తప్ప, యితర భాషలు రావు వాళ్ళు చెప్పేది మనకు అర్థంకాదు - మనం చెప్పేది వారికి అర్థం కాదు! అందువలన అలీతో మాట్లాడడమంటే అందరికీ సరదాగా వుంటుంది. దేశంకాని దేశంలో ఆత్మీయుడు కనిపించినట్టు ఫీలవుతారు

అలీ దగ్గరకి వస్తూనే సిరాజ్ భుజం మీద చేయివేసి, పక్కనేవున్న కొట్టుదగ్గరికి లాక్కుపోయాడు పెప్సీకోలాలు రెండు తీసికొని, సిరాజ్ కొకటి అందించాడు. పెప్సీ తాగిన వెంటనే సూపర్‌కింగ్ సైజ్ బ్లాక్ సుమీర్ ఫిల్టర్ సిగరెట్ అఫర్ చేశాడు. అలీకి సిరాజ్ అంటే వల్లమాలిన అభిమానం.

"ఏం కావలసి వచ్చావ్?" అన్నాడు గుప్పున పొగ వదులుతూ

వచ్చిన కారణం చెప్పాడు సిరాజ్. ఆఫళంగా స్టేషనరీ షాపుకేసి యిద్దరూ నడిచారు. కావలసిన గ్రీటింగులు, కవర్లూ తీసికొని బయటికి వచ్చారు

"సిరాజ్! చాలా రోజుల నుండి నిన్ను మా యింటికి పిలుద్దాం అనుకొంటున్నాను మా యిల్లు అదిగో! ఆ వీధి చివర వుంది రా! చూద్దువుగాని" అన్నాడు ఆప్యాయంగా.

సిరాజ్ మొగమాటపడ్డాడు "మరొక సారి వస్తాను" అని తప్పించుకోబోయాడు

"ఎలాగూ ఈవేళ హాలిడే కదా! కొలనిలో కూర్చుని ఏం చేస్తావ్? ప్లీజ్ కమ్! నిన్ను నేను డ్రాప్ చేస్తానులే" అని జబ్బపట్టుకొని బలవంతం చేశాడు

తప్పినట్టు లేదని అలీని అనుసరించాడు సిరాజ్ పికప్ అలీ యింటివేపు పరుగుతీసింది * * * *

సిరాజ్ పాతికేళ్ళ యువకుడు స్ఫురద్రూపి చూపరులను యిట్టే ఆకట్టుకొనే ఆకారం పెళ్ళికాని కుర్రాడు చాలా వుషారుగా వుంటాడు ఎక్కడో వైజాగ్ లో పుట్టి, అక్కడే రైల్వేలో వుద్యోగం చేస్తూ, అతి తక్కువ సర్వీస్ లో - ఇరాక్ వెళ్ళే ఛాన్సు సంపాదించుకొన్నాడు ఆ రోజుల్లో ఇరాక్, ఇరాన్ వార్ జరుగుతుందేమో చాలామంది ఉద్యోగులు రైట్సుకి డిప్యుటేషన్ మీద ఇరాక్ వెళ్ళడానికి భయపడేవాళ్ళు కాబట్టి అతనికి బార్ ప్రాజెక్టులో పనిచేసే ఛాన్సు దొరికింది

తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు మొదట్లో తల్లిదండ్రులు అతను ఇరాక్ వెళ్ళడానికి ఎంతమాత్రం ఒప్పుకోలేదు అయితే - సిరాజ్ వాళ్ళను నెమ్మదిగా ఒప్పించాడు రైల్వే వుద్యోగిగా తానుఫారిన్ చూడ్డం, అందులోనూ విమానయాన యోగం దొరికే అదృష్టం అందరికీ రాదనీ - అక్కడ వసతులు బాగుంటాయని వెంటనే డబ్బు వస్తుందనీ, ఒప్పించి ఎలాగో బయలుదేరాడు.

ఇరాక్ లో అడుగు పెట్టిన వెంటనే, సిరాజ్ ని బార్ ప్రాజెక్ట్ లో కీలకస్థానమైన అల్ - ఐయ్యాం స్టేషన్ లో పోస్ట్ చేశారు. వచ్చిన దగ్గరనుండి అక్కడే పనిచేస్తూ వస్తున్నాడు.

అల్ -ఐయ్యాం స్టేషన్ కి నలభై ఐదు కిలోమీటర్ల దూరంలో 'హాసైభా' అనే వూరు వుంది. అది సిరియా బోర్డర్ ని ఆనుకొనివుంది. అక్కడ స్టాఫ్ కి కొలనీ కట్టారు దానికి నాలుగు కిలోమీటర్ల దూరంలో మార్కెట్ వుంది రోజూ వుద్యోగులు 'వర్క్ మెన్ స్పెషల్' ట్రెయిన్ లో వుద్యోగానికి వస్తూ పోతూ వుంటారు

సిరాజ్ ఇరాక్ లో అడుగుపెట్టిన నాలుగు నెలలకి వార్ ఆగిపోయింది అందు వలన ముఖ్యంగా అతనికి మనశ్శాంతిగా వుంది ఎందుకంటే - అతను ఇరాక్ లో అడుగుపెట్టినది మొదలు, తల్లిదండ్రులు - రోజూ టీ వీ లో వార్ వుధృతం చూస్తున్నట్లు చూపిస్తున్నారనీ, తమకు భయంగా వుందనీ, వెంటనే వచ్చివేయమనీ వుత్తరంమీద వుత్తరం దంచేస్తున్నారు వార్ ఆగిపోగానే వాళ్ళు కొంచెం శాంతించారు

పోతే - అలీ కూడ బార్ ప్రాజెక్టులో వెహికల్ డ్రయివర్ గా పనిచేస్తున్నాడు వచ్చిన కొత్తలోనే సిరాజ్ కు అతనితో పరిచయమయింది పరిచయం స్నేహంగా మారింది వయస్సుల్లో అంతరం ఎక్కువైనా వాళ్ళు మంచి స్నేహితులయ్యారు

అలీకి ఎందువలనో సిరాజ్ అంటే మంచి అభిమానం ఏర్పడింది ఆ అభిమానం అతని మనస్సులో ఒక వింత కోరికకు దారితీసింది ఆ కోరిక మరేమీ కాదు! తన అమ్మాయిని సిరాజ్ కి యిచ్చి పెళ్ళిచేయాలని!

సాధారణంగా యిరాకీయన్లలో ఏకపత్నీవ్రతులు చాలా తక్కువ ఒక్కొక్కరికీ ఇద్దరు - ముగ్గురు భార్యలు వుంటారు అయితే అలీ మాత్రం ఒకే భార్యతో సరిపెట్టుకొన్నాడు! అతనికి ఏకపత్నీవ్రతం

అంటే చాలా ఇష్టం అయితే తన ఏకైక కుమార్తెకి కాబోయే భర్త కూడ తనలాగే ఏకపత్నీవ్రతుడు కావాలని అతని కోరిక! అయితే, పెళ్ళి అయిన తర్వాత ఆ వచ్చేవాడు బహు భార్యాలోలుడు కాడని గ్యారంటీ ఏమిటి?

అందుకే ఆలీ కన్ను సిరాజ్ మీద పడింది! అతను భారతీయుడే కావచ్చు - కాని, ముస్లీమే కదా! పోతే - అతనైతే తన చెప్పుచేతల్లో వుంచుకోవచ్చు అనుకొన్నాడు

అయితే చిక్కంతా - అతడు ఇరాక్‌లో వుండిపోడానికి ఒప్పుకోవాలి కదా?!

ఇరాక్ రూల్సు ప్రకారం, ఎవరైనా ఇరాకీ యువతిని పెళ్ళాడితే, వాళ్ళ పాస్‌పోర్టు 'సరండర్' చేస్తారు వారికి ఇరాకీ సిటిజన్‌షిప్ యిచ్చి, శాశ్వతంగా మరి ఎటూ కదలనివ్వరు!

ఆలీ ఒకసారి మాటల సందర్భంలో "సిరాజ్, నాకు యూఫ్రటిస్ నది పక్కన పెద్ద ఖర్జూరపు తోట వుంది పంటపొలం కూడ బాగానేవుంది బేంకులో ఏభై వేల దీనార్ల 'కేష్' వుంది. పోతే నాకు ఒక పికప్ కార్, పెద్ద బిల్డింగ్ వుంది లేక లేక ఒక కుమార్తె వుంది ఆమె అంటే నాకు ప్రాణం చక్కని చుక్క నిన్ను చూస్తే ఆత్మీయుడ వనిపిస్తోంది! నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను నా అల్లుడుగా చేసుకుందాం అనుకొంటున్నాను! ఏమంటావ్?" అని అడిగాడు

సిరాజ్ అందుకు చిరుదరహాసం చేశాడు.

"మిష్టర్ ఆలీ! నేను మా తల్లిదండ్రులకు ఒక్కడినే సంతానం మావాళ్ళు అతి కష్టంమీద నన్ను యిక్కడికి రానిచ్చారు మీ అమ్మాయిని చేసుకోవాలి అంటే నేను యిక్కడే వుండిపోవాలి! అది తెలిస్తే మా తల్లి దండ్రులు గుండె పగిలి చస్తారు కాబట్టి, నీ కోరిక మన్నించనందుకు క్షమించు" అనాలి అనుకున్నాడు కాని అనలేదు! అతను బాధపడతాడనో లేక యిక ఏ కారణంవలనో అతడు అనలేదు మరి! అందువలన అతని చిరుదరహాసమే సమ్మతంగా నిర్ధారణ చేసుకొన్నాడు ఆలీ!

* * * * *

కారు ఆలీ యింటి ముందు ఆగింది అది ఒక పెద్ద భవంతిలా వుంది సాదరంగా సిరాజ్‌ను డ్రాయింగ్‌రూమ్‌లోనికి ఆహ్వానించాడు ఆలీ. సోఫాలో కూర్చొని చుట్టూ చూశాడు సిరాజ్ డ్రాయింగ్ రూమ్ గొప్ప డాబుగావుంది మాంచి సోఫా సెట్, టీపాయ్, ఫ్రిజ్, టి వి, వి సి ఆర్‌లు రూమ్‌కి డాబును చేకూర్చాయి ఎదురుగా సద్దాం హుస్సేన్ చిత్రం చూడముచ్చటగా వుంది

ఈలోగా ఆలీ లోనికి వెళ్ళాడు కొద్దినిమిషాల తర్వాత తనవెంట భార్యను, కుమార్తెను తీసుకువచ్చాడు వాళ్ళను చూడగానే సిరాజ్ గౌరవభావంతో నిలబడి, ఆలీ భార్యకు "సలాం ఆలేకుం" అని విష్ చేశాడు. అందుకు ప్రతిగా ఆమె "ఆలేకుం సలాం" అన్నది.

తర్వాత ఆలీ ఇరాకీ భాషలో (అరబ్బీ) తన కుమార్తెకు సిరాజ్‌ను పరిచయం చేశాడు.

"మీట్ మై డాటర్ నాదియా!" అన్నాడు

"హల్లో! అయాం సిరాజ్!" అనబోయి, అకస్మాత్తుగా అవాక్కయిపోయాడు. కారణం - నాదియా అందం మెరపుతీగలాగ జిగేల్‌మంది. ఆ సౌందర్య కాంతిలో అతడు వుక్కిరిబిక్కిరి అయ్యాడు

'అబ్బ! ఎంత అందంగా వుంది!' అనుకున్నాడు స్వగతంగా. కనులద్వారా ఆమె అందం హృదయాంతరాల్లోనికి చొచ్చుకుపోయింది

'ఈ జగదేక సుందరినా ఆలీ తనకు యిస్తానంటే నోరు విప్పక వూరుకొన్నది! ఔరా! ఈమె అందాన్ని ఎవరితో పోల్చను?! తెల్లని మేని చ్ఛాయ, చక్కని కేశసంపద, గులాబీ చెక్కిళ్ళు, ఎర్రని పెదవులు, ముద్దుపెట్టుకోవాలీ అనిపించే ముక్కు, సువిశాల నేత్రాలు, తామర కాడల లాంటి చేతులు వగైరా వగైరా -ఓహ్! ఏమని వర్ణించను?' ఆమె సౌందర్య సాగరంలో మునిగి వుక్కిరిబిక్కిరి ఐపోతున్నాడు.

ఈలోగా నాదియా "హల్లో!" అని తన కుసుమ కోమల సుకుమారమైన చేతిని చాచింది అసంకల్పితంగా సిరాజ్ చేయి ఆమె చేతిలోనికి చేరిపోయింది! అంతే! అతని శరీరం అంతా తీయని విద్యుద్ఘాతానికి గురి అయింది మేను పులకించింది. ఆక్షణంలో అతనిలో ఒక విధమైన తెగింపు ఉప్పెనలా పుట్టుకొచ్చింది ఆమెను పెళ్ళిచేసికొని, ఇరాక్‌లోనే వుండిపోవాలని ఒక నిశ్చయానికి 'యిన్‌స్టాంట్'గా వచ్చేశాడు!

పరిచయాలు అయ్యాక ఆలీ భార్య ట్రేలో బ్లాక్ టీ తెచ్చి టీపాయిమీద పెట్టింది. టీ తాగుతూనే, నాదియా సోయగ తేనెలను కనులతో జుర్రుకుంటున్నాడు ఆ క్షణంలో ఆలీ, అతని భార్య సిరాజ్ దృక్పథం నుండి చాలా దూరం విసిరివేయబడ్డారనే చెప్పాలి

నాదియాకు కూడ సిరాజ్ నచ్చాడు



ఆ సంగతి ఆమె శృంగారభరిత వీక్షణాల నుండి తేటతెల్లమౌతోంది

కొంతసేపు వారిమధ్య గడిపి, సిరాజ్ వారివద్ద శలవు తీసికోలేక, తీసికోలేక తీసికొని బయటికి నడిచాడు ఆలీ తన కారులో అతన్ని దిగబెట్టాడు

సిరాజ్ మనసు చలించి, ప్రేమజాలంలో తగులుకొనిపోయినట్టేనా?

* * * * *

అది యుఫ్రటిస్ నదీ తీరము నదికి ఆవలిగట్టున ఎత్తైన కొండ భలే తమాషాగా వుంది నీలిరంగు అలలతో వింత సోయాగాలు యీనుతున్నది నది. ఒడ్డున పెద్ద ఖర్జూరపు తోటలు, పంటపొలాలు కనుచూపుమేర కనిపిస్తున్నాయి వసంతకాల ఆగమనానికి చిహ్నంగా దూరంగా ఒక కోయిల సుమధురగానం వీనుల విందుగా వినిపిస్తోంది

కర్జూరపు తోట ప్రక్కన పికప్ ఆగింది డ్రయివింగ్ సీటులో నాదియా హుందాగా కూర్చొనివున్నది ప్రక్కన సిరాజ్ సినీ హీరోలా వెలిగిపోతున్నాడు అతని మనసంతా ఆమె సోయగశ్రీతో నిండిపోయి భారంగావుంది నాదియాను రెప్ప వేయకుండా చూస్తూవుండిపోయాడు

నాదియా చిరు దరహాసంతో అతను ఈ లోకంలోనికి వచ్చాడు ఆమె కారు నుండి దిగింది ఆమెను అనుసరించాడు సిరాజ్ ఇద్దరూ ఖర్జూరపు తోటలోనికి వెళ్ళారు నిండు గర్భిణీలా చెట్లన్నీ గుత్తుల గుత్తుల కాయలతో వున్నాయ్ దూరంగా పంట పొలాల్లో రైతులు పనులు చేసుకొంటున్నారు

ఆ ప్రకృతి సౌందర్యం సిరాజ్‌ని ఏమీ ఆకర్షించలేదు! అతన్ని నాదియా సౌందర్యం అయస్కాంతంలా ఆకర్షించింది. ఇప్పుడు ప్రపంచమంతా తా మిద్దరేవున్నట్టు అనిపిస్తోంది! తన దేశంలో తనకోసం ఎదురుచూసే తల్లి దండ్రులు జ్ఞప్తికివచ్చే సూచనలు అతనిలో మృగ్యమయ్యాయి.

అనుకోకుండా సిరాజ్ నాదియా చేతిని తన చేతిలోకి తీసికొని, సున్నితంగా నొక్కి, మృదువుగా తన పెదాలతో ఆ చేతిని ముద్దుపెట్టుకొన్నాడు. నాదియా పరవశమై అతనిపై వాలిపోయింది. కనుచూపుమేరలో అప్పుడు ఎవరూ లేరేమో - వాళ్ళు ఆనందపరవశంలో మునిగిపోయారు

సిరాజ్ మేను ఆమె పరిష్వంగంలో పులకించి పట్టుతప్పింది!

నాదియా మేను శృంగార జ్వాలతో ప్రజ్వరిల్లింది!

అలా వాళ్ళు ఎంతసేపు కౌగిలి ఖైదులో వుండిపోయారో ఆ మన్మథుడికే తెలియాలి! ఆ అమర సుఖం కవు లెవ్వరూ వర్ణింపలేనిది!

వారి శృంగార అవస్థను భంగపరుస్తూ ఈగలు వారిని చుట్టుముట్టాయి. ఇరాక్‌లో వసంతకాలంలో ఈగలబాధ వర్ణనాతీతం!

అఫళంగా వారు భంగపరులై, తిరిగి గబగబ కారులోనికి వచ్చి తలుపులు వేసుకొన్నారు నాదియా ఏ.సి. ఆన్ చేసింది చల్లని ఏ.సి. గాలిలో వారిద్దరూ తిరిగి పులకించిపోయారు. మన్మథుడు అవకాశం కోసం చూస్తూ - వారిపై తన సుందర సుమధుర మృదు మోహనాస్త్రం సంధించాడు!

నాదియా అతని ఒడిలో సోలిపోయి, తన నునులేత హస్తాలతో చంద్రబింబంలాంటి సిరాజ్ ముఖాన్ని తడిమింది. అతను ఆమెను తనపైకి లాక్కుని ముద్దులవర్షం కురిపించాడు.

అలా కొంతకాలం తీయగా గడిచింది!

తనివితీరని తనివితో వారు తిరిగి గృహోన్ముఖులైనారు.

ఇప్పుడు సిరాజ్ కంటికి ఏమీ కనిపించడంలేదు తిండి తినాలి అనిపించడంలేదు ఎక్కడ చూసినా నాదియా రూపమే! ఊహలో, హృదయంలో, మునుగులో - ఇక్కడ అక్కడ అనకుండా ప్రపంచమంతా ఆమెయే అనిపించింది!

ఇటువంటి మధురావస్థలో సిరాజ్ వుండగా -

ఆలీ అతని రూమ్‌కి సడన్‌గా వచ్చి పిడుగులాంటి వార్త ఒకటి చెప్పాడు

నాదియా నెల తప్పింది!

వెంటనే పెళ్ళికి సిద్ధంకమ్మని చెప్పాడు!

అంతే! అతని ప్రేమ జ్వరం పటాపంచలయింది. ఒళ్ళు భయంతో కంపించిపోయింది. పూర్వపు అవస్థకు అతని మనసు వచ్చేసింది!

'అమ్మబాబోయ్! కొంప మునిగింది! తను యిప్పుడు తిరిగి ఇండియా వెళ్ళలేడు. తన తల్లిదండ్రులు గుండె ఆగి ఛస్తారు!

ఇప్పుడు ఏది మార్గం???'

ఒళ్ళంతా చెమటలు పట్టాయి!

"ఆలీ! నన్ను మన్నించు. నా పొరపాటు ఏమీలేదు. వద్దంటే ఆమె నన్ను కారులో తీసుకువెళ్ళింది. నన్ను రెచ్చగొట్టింది. ఆమె ప్రేరణ వల్లనే ఈ పరిస్థితి వచ్చింది....నేను ఆమెను పెళ్ళి చేసికోలేను! చేసికొంటే యిక్కడే శాశ్వతంగా వుండి పోవాలి! కనీసం మా తల్లిదండ్రుల్ని అప్పుడప్పుడు చూడ్డానికి కూడా వెళ్ళనివ్వరు. వాళ్ళు గుండె ఆగి ఛస్తారు. ప్లీజ్! నన్ను అర్థంచేసికో!" అంటూ ఆలీ

## ఆదిత్య ఆవేశం



పూజాబేడీతో ఆదిత్యపాంచోలికి వున్న 'సంబంధం' యిటీవల బాగా ప్రచారంలోకివచ్చి సద్దుమణిగింది. కాని "జల్వా" దర్శకుడితో తగాదా పెట్టుకోవటంతో తిరిగి ఆదిత్య వార్తల్లో కెక్కాడు

బేడీతో వున్న 'ఆ' సంబంధం విషయమై దర్శకుడు పంకజ్ పరాశర్ ప్రస్తావించటంతో చిర్రెత్తుకొచ్చిన ఆదిత్య ఆయనతో వాగ్వివాదానికి దిగాడట.

తిరిగితే లేదుకాని అంటే వచ్చిందా అంటూ దర్శకుడు వాదించగా, ఆ వ్యవహారం ఎప్పుడో ముగిసింది. మళ్ళీ దాన్ని కెలకట మెందుకు అని ఆదిత్య గొడవపడ్డాడు. వీళ్ళిద్దరికి మధ్య శక్తికపూర్ మధ్యవర్తిత్వం వహించి ఆదిత్య ఆవేశాన్ని అణిచాడటకాని దర్శకుడిమీద కారాలు, మిరియాలు నూరుతున్నాడట.

## 32
## పాఠకులకో సవాల్!
# టిట్ ఫర్ టాట్

**గుళ్లోకి చొక్కా లేకుండా రావాలి తెలుసా?**

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఆ 'రిపార్టీ' గుచ్చుకోవాలేగాని బాధించకూడదు రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్టవచ్చినట్టుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం

**18-8-'89 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!**

చాలా మంది వెంటనే "రిపార్టీ'ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం బహుమతులు పొందిన రెండూకాక- మరికొన్ని యిక్కడ వేశాము తతిమ్మా వారి "వాగ్బాణాలు స్థలాభావం చేత వేయలేకపోయాం లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం' ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్లీ ప్రయత్నించండి!

-ఎడిటర్

"ఇవాళ వుంటుంది రేపు పోతుంది - దీనిగురించి 'వర్రీ' ఎందుకు?"

*రు. 25 బహుమతి పొందిన రిపార్టీ :

**"అందుకే....డోంట్ 'వర్రీ' బీ 'హేపీ'!"**

- షేక్ నజిముద్దీన్ (మాచర్ల)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

**"ఇప్పుడే అందిన వార్త! మీకు మంత్రి పదవి వూడిపోయింది!"**

- పి. ఆంజనేయులు (కడప)

### మరికొన్ని వాగ్బాణాలు

"కాని పుట్టింది అమ్మాయికదా....? వూరికే పోదే!"

- నివాస్ (కొత్తగూడెం)

"నాకున్నది "గోచీ" ముక్కేనయ్యా స్వామీ!"

- కొత్త పాతూరయ్య (ఎనికేపాడు)

"నా వర్రీ అంతా నా గురించి కాదు నాయనా! ఆరుకోట్ల ఆంధ్రుల గురించి .."

- మోహన్‌రావు (తామరకొల్లు)

### లక్కీ పేర్లు

డి పున్నయ్య (విశాఖపట్నం), జి. పద్మజ (పామూరు), ఆర్. శైలజ (గుంటూరు), బి. గంగాధరరావు (వేగాయమ్మపేట), ఎన్. శివానంద్ (బెల్లంపల్లి), ఎస్ సత్యశ్రీ (దువ్వ), కె. సరోజ (హైదరాబాద్), కె పార్థసారథి (బాపట్ల), ఎ హరిబాబు (గుంటూరు), డి. సూర్యనారాయణ (నందిగామ), ఎం అరుణకుమారి (గుడివాడ), పి. వి. ఎన్. స్వరూపిణి (హైదరాబాద్).

## కాలా బూన్

చేతులు రెండూ పట్టుకొన్నాడు

ఆ మాటలు విన్న అలీకి విపరీతమైన కోపం వచ్చింది. అతడు ప్రళయకాలరుద్రుడే అయ్యాడు సిరాజ్ కాలర్ పట్టుకొని, బరబర ఈడ్చి పికప్‌లోనికి విసిరేసినంత పనిచేసి - కారు స్టార్ట్‌చేసి, శరవేగంతో పోనిచ్చాడు.

కారు పోలీసుస్టేషన్ ముందు ఆగింది

అలీ, సిరాజ్‌ను కారు నుండి బయటికి లాగి, స్టేషన్‌లోనికి ఈడ్చుకుపోయాడు

ఇరాకీ పోలీస్ యిన్స్‌పెక్టర్‌కి అరబ్బీలో జరిగినదంతా చెప్పాడు ఇన్స్‌పెక్టర్ వుగ్రుడై "యూ కాలాబూన్!" అని సిరాజ్‌ని అరబ్బీలో తిట్టి, అమాంతంగా పట్టుకొని 'సెల్'లోనికి బస్తాను విసిరేసినట్టు విసిరేశాడు

సిరాజ్ నేలమీద దబ్బున పడ్డాడు. కళ్ళు చీకట్లుకమ్మాయి.

* * * * *

నేలమీద పడిన సిరాజ్ గభుక్కున లేచాడు కళ్ళు తెరచి చుట్టూ చూశాడు! - ఔనా? కాదా? అని చేతిమీద గిల్లుకొని ఔనని నిర్ధారణ చేసుకొన్నాడు.

ఔను! తను పోలీస్‌స్టేషన్‌లో..

లేదు! తన రూమ్‌లోనే మంచంమీద నుండి గచ్చుమీద పడివున్నాడు! - అంటే తాను కాలాబూన్ కాలేదన్నమాట!. ఒంటికి పట్టిన చెమట ఒకసారి తుడుచుకొన్నాడు!

మరోసారి తాను 'కాలాబూన్' (అరెస్టు) కాలేదని రూఢి చేసుకొన్నాడు తను ఆ అమ్మాయితో తిరిగిందీ, జరిగిందీ - అలీ తన్ను పోలీసుస్టేషన్‌కి తీసుకుపోయిందీ - కేవలం కలలో అన్నమాట!

థాంక్ గాడ్! - ఈ కల నిజమైతే యింకేమయినావుందా? తనపని యింతే సంగతులు!

'భగవంతుడా! నాకు ముందే హెచ్చరిక చేశావన్నమాట! నీకు నా సలాం!" అని అనుకొని - అమాంతంగా నాదియాను హృదయకుహరం నుండి బహిష్కరించాడు!!

ఎందుకైనా మంచిదని ఆ రోజు నుండి అలీకి దూరంగా వుండడం మొదలుపెట్టాడు! ●







# నాలుగు విధాలుగా భవిష్యత్‌ని చూడండి ఆనందించండి









## రాశి ఫైనాన్స్ 4 పథకాలను ప్రవేశపెడుతోంది. వీటితోమీ రొక్కం దినదినాభివృద్ధి చెందుతుంది.

**రాశి క్యుములేటివ్ డిపాజిట్ పథకం.** సంవత్సరానికి ఊహించవంత వడ్డీ 17 26/ 3 సంవత్సరాల డిపాజిట్లపై

**రాశి ఫిక్స్‌డ్ డిపాజిట్ పథకం·** మీరు ఆదా చేసుకొన్న సొమ్ముపై నెలవారి ఆదాయం అతి స్వల్పమైన రూ 1,000/- గాని వాటి గుణాంకాలను కాని డిపాజిట్ చేస్తే ఆకర్షణీయమైన 14/ వడ్డీ

**రాశి రికరింగ్ డిపాజిట్ పథకం:** సులభంగా ఆదా చేసుకొని మీ డబ్బును సక్రమంగా అభివృద్ధి చేసుకోవడానికి అనువైనది

**రాశి నగదు సర్టిఫికేట్ పథకం:** చిన్న చిన్న చిల్లర మొత్తాలను 2 లేదా 3 సంవత్సరాలు ఆదా చేసుకొని చూడండి పెద్ద పెద్ద మొత్తాలు గడువు దాటేక మీ చేతికి వస్తాయి



## రాశి ఫైనాన్స్ & ఇన్‌వెస్ట్‌మెంట్ లిమిటెడ్.

మీ అభివృద్ధిలో భాగస్వాములు

రిజిస్టర్డ్ ఆఫీస్ 8-2-248/1/7/1 & 2
రోడ్ నం 1 బంజారాహిల్స్ పంజాగుట్ట
హైదరాబాద్-500 482 ఫోను 229058

బ్రాంచీలు

విజయవాడ, రాజమండ్రి, గుంటూరు
భీమవరం, మద్రాసు మరియు విశాఖపట్నం

మా ప్రతినిదిని మీరు ఫోన్ చేసి పిలిచిన
మీ దగ్గరకు వచ్చి ఇతర వివరములు తెలుపును




హాస్య నవలికల పోటీలో ద్వితీయబహుమతి నవల్క.

"హిమ్మత్‌వాలే నౌ జవాన్-" అంటూ కిశోర్‌కుమార్ పాట పాడుకుంటూ బస్ ఎక్కి, నాలుగు ప్రక్కలా చూశాడు డ్రైవర్ కరీం.

మురికిపట్టిన కాకీ గుడ్డలు తీసేసి, తల స్నానం చేసి, ముఖానికి దట్టంగా పౌడర్ అద్ది టెరికాట్ దుస్తులతో తయారయ్యాడు. ప్రయాణీకులంతా తన గ్లామర్ చూసి మెచ్చుకోవాలనేది అతని కోరిక

"అందరూ వచ్చినట్లేనా- " గంభీరంగా అడిగి, మరోసారి వారివంక చూశాడు

"ఆ, వచ్చేశారు- తమరు పోనివ్వండి " అంటూ అరిచాడు ఆచారి

కరీం కూలింగ్ గ్లాసెస్ తగిలించుకొని షోగ్గా మరోసారి వారి వంక చూసి, 'ప్యార్ కియాతో డర్నాక్యా ' అంటూ మరొక ట్యూన్ అందుకొని, డ్రైవింగ్ సీట్లో కూర్చుని, బండి స్టార్ట్ చేశాడు తన తల కెదురుగా వున్న 'వ్యూ - మిర్రర్' సరిచేసి, బస్‌లో వారు స్పష్టంగా కన్పించే ఏర్పాటు చేసుకొని, తనలో తనే నవ్వుకొన్నాడు బస్ బయల్దేరింది

అది పెళ్ళివారి బస్. విజయవాడలో జరిగే పెళ్ళికి మగ పెళ్ళివారు తరలి వెళ్తున్నారు. బస్‌లో మూడొంతులు స్త్రీలే పట్టు చీరల రెపరెపల్లో చూడ ముచ్చటగా వున్నారు

గుంటూరు బ్రాడీపేటలో అందమైన డాబాలో ఉండే 'చిట్టిబాబు'కి పెళ్ళి ఆ రోజు

చిట్టిబాబు స్థూలకాయుడు. వయస్సు ముప్పై నాలుగేకాని, మూటపాతిక కిలోల బరువుంటాడు

గ్లాస్కో బేబీ ముఖం- యింకా ఎదగని మీస కట్టు, సీరియస్‌గా చూస్తున్నా నవ్వుకొంటున్నాడేమోనని భ్రమ కల్గించే ముఖం!

చిట్టిబాబులో వుండే సుగుణం ఒక్కటే- ఎవరైనా పొగిడితే చాలు బెలూన్‌లా ఉబ్బిపోతాడు వారి కోసం ఫడామడా ఖర్చుచేస్తాడు ఆ కారణం వల్లనే కొందరు స్నేహితులు కూడా పోగయ్యారు వారిలో ముఖ్యులు శ్రీరాం, సారధి, సాయి, సుబ్బారావు ప్రస్తుతం అదే బస్‌లో వున్నారు

"ఇంతకీ కట్నంబాపతు అడ్వాన్స్ అందినట్లేనా" అన్నాడు ఆచారి

"గొడవ చెయ్యకు- ఎవరైనా వింటారు. ఒక వంతు అందింది మిగతా డబ్బు యీ రోజే యిస్తారు నాతో వ్యవహారం అంటేనే 'కత్తిమీద సాము' లాంటిదని వియ్యంకుడికి తెలుసు " అన్నాడు లింగోజీ, చిట్టిబాబు తండ్రి అతనికి చాలా బిరుదులున్నాయి 'గుంటనక్క- పీనాసి- చుంచుముఖం" యిత్యాదులు అవన్నీ చిట్టిబాబు స్నేహితులిచ్చిన బిరుదులే

ఆచారిని 'లిటిగేషన్ ఆచారి' అంటారు లింగోజీ దగ్గర బంధువు

చిట్టిబాబుకి ఒక్కర్తే చెల్లెలు పేరు వీణ! అందంగా, సుకుమారంగా వుంటుంది ఆమెతో సహా యిద్దరు నేస్తాలు కూడా పెళ్ళికి ప్రయాణమై బయల్దేరారు పేర్లు చిత్రంగానే వుంటాయి మరి, ఒకామె వాహిని, మరొకరు వారుణి మధ్య తరగతి స్త్రీలే అయినా అంద చందాలకు లోటులేదు

ఎవరికి వారు-మహా ఉత్సాహంగా వున్నారు నవ్వులూ, ఛలోక్తులూ కేరింతలతో ఆనందంగా వున్నారు

"డియర్ ఫ్రెండ్స్! విజయవాడ చేరుకోవాలంటే కనీసం ఫార్టీఫైవ్ మినిట్స్ పడుతుంది ఈ కొద్ది కాలంలో నేనొక పందెం పెడతాను పందెం గెలిచిన వారికి చిట్టిబాబు మాట పడహోర్లిచ్చి సత్కరిస్తాడు అవునా?" అని చిట్టిబాబు వంక చూశాడు శ్రీరామ్

కిచ కిచమంటూ నవ్వి తన అంగీకారం తెల్పాడు చిట్టిబాబు

"ఏమిటో ఆ పందెం?" అన్నారు మిత్రులు ఒకేసారి

"కండక్టర్ సీటులో కూర్చున్న వ్యక్తిని చూడండి" అన్నాడు చూశారందరూ!

దాదాపు నలభై ఏళ్ళుంటాయి బట్టతలా నల్లటి ఆకారం చాలా సీరియస్‌గా కూర్చుని ఆలోచిస్తున్నాడు

"వాడి పేరు పానకాలు జీవితంలో బహుశా, నవ్విన క్షణాలు లేవనే నా అభిప్రాయం లింగోజీగారి ముఖ్యమైన స్నేహితుడు వాడ్ని ఎవరైనాసరే- విజయవాడలో మన మకాం చేరే లోపున నవ్వించాలి " అన్నాడు శ్రీరామ్ "ఓ కే" అన్నారంతా. ఈ సంగతి క్రమంగా బస్సులో అందరికీ తెలిసిపోయింది అంతా ఉత్సాహంగా చూశారు

పానకాలు వడ్డీ వ్యాపారం చేస్తూంటాడు డబ్బు అప్పుగా యిచ్చి, వసూలు చేసుకోవడానికి నిత్యం శ్రమిస్తూ, బాధపడుతూ, దిగులుతో సత మత మవుతుంటాడు అప్పు ఇచ్చాక యిది తిరిగి సక్రమంగా వస్తుందా అనే ఆందోళన- లేదా బాకీ వసూలయ్యాక, ఆ డబ్బు ఇంట్లో వుంటే- 'అయ్యో, వడ్డీ నష్టమై పోతూంది, ఎవరికి యివ్వాలా' అనే దిగులుతో నిద్రాహారాలు సరిగా లేక బాధపడుతుంటాడు

తన కష్టమర్స్ డబ్బు అప్పు తీసుకోక పోతే కోపం, తీసుకొన్నాక బాకీ చెల్లించినా కోపమే! నెలా నెలా సక్రమంగా వడ్డీ వస్తే సంతృప్తి

అంతేకాదు లింగోజీని చూసి 'పొదుపరితనం' అంటే యింకా బాగా తెలుసుకొన్నాడు పానకాలు వారిద్దరి స్నేహమూ అదే!

దానినే చాలా మంది 'పీనాసితనం' అని కూడా అంటారు

"ముందు నేను ప్రయత్నిస్తాను" అంటూ లేచాడు సారధి. బస్‌లో జనాన్ని ఒకసారి గర్వంగా చూసి పానకాలు దగ్గరకు నడిచాడు.

పానకాలు చూపులు శూన్యంలోకి గురి పెట్టి వున్నాయి

"సార్! ఈ వార్త విన్నారా? అమెరికా మన దేశానికి కోట్ల రూపాయలు అప్పు ఇస్తోంది వడ్డీ ఎంతో తెలుసా? " అన్నాడు రహస్యంగా

"మొండి బాకీల గురించి నాకు చెప్పకయ్యా కోపం వస్తుంది " అన్నాడు.

"అదికాదు మహాప్రభో - అమెరికా ప్రెసిడెంట్ పేపర్లో స్టేట్‌మెంటిచ్చాడు దేశ నాయకులకిస్తే 'అసలు' తీరడమే కష్టంగా వుంది, ప్రత్యేకంగా ఒక కమిటీవేసి ప్రైవేట్ వడ్డీ వ్యాపారస్తుల ద్వారా ప్రభుత్వానికి అందే ఏర్పాటు చేస్తారట వడ్డీ వసూలు ఖచ్చితంగా చేస్తారనీ -" అంటూ నవ్వేడు సారధి పానకాలు మాట్లాడలేదు

"ఇంత మంచి వార్త చెప్పాను కనీసం ఒక్క చిరునవ్వు పారేయకూడదా?" అంటూ ప్రాధేయ[illegible] నటించాడు సారధి

"చూద్దాంలే! డబ్బు అవసరమైతే యీ డొంకతిరుగుడు అంతా దేనికి? నగో, నట్రో తెచ్చి తీసుకెళ్ళు" అన్నాడు సీరియస్‌గా

సారధి బుర్ర గోక్కుంటూ తిరిగివచ్చేశాడు అందరూ అతన్ని చూసి పకపకా నవ్వేరు ఈసారి సాయి లేచి నిల్చున్నాడు

"పానకాలస్వామిగారూ, ఒక చిన్న వడ్డీ లెక్క చెప్పండి నెలకు నూటికి నూరు రూపాయల చొప్పున మీకు పది రూపాయలు అప్పిచ్చాననుకోండి. రెండు నెల్ల తర్వాత మీరు పది రూపాయలు యిచ్చేశారు. ఇంకా మీ రెంత యివ్వాల్సివుంటుంది" అన్నాడు తమాషాగా.



"నేను బ్రతికుంటే నీమీద పోలీసు కంప్లెయింట్ యివ్వాల్సివుంటుంది" అన్నాడు తాపీగా పానకాలు సాయి వింతగా చూశాడు

"అబ్బాయీ! పది రూపాయలు నువ్వు చెప్పిన వడ్డీకి నేను తీసుకోవడమే జరిగితే, ఆ పని చేసేముందే నేను ఛస్తాను తెలుసా? ఇకపై యిటువంటి చచ్చుకబుర్లు చెప్పకు" అన్నాడు సీరియస్‌గా

"భలేవారే - జోక్ వేశాను నవ్వొచ్చుగా!" అన్నాడు సాయి దిగులుగానే

"ఎందుకు నవ్వాలి? నవ్వను" అన్నాడు కోపంగా చూస్తూ

సాయి పిల్లిలా వచ్చి తన సీట్లో కూర్చున్నాడు

సుబ్బారావు ధీమాగా రంగప్రవేశం చేశాడు

"సార్! బాకీ వసూలుకోసం మీ రొక యింటికి వెళ్ళి, బయటనుండి ఆ వ్యక్తిని పిలుస్తూ కేకేస్తారు 'వారు యింట్లో లేరండీ' అనే ఆడగొంతు వినిపిస్తుంది అయితే, గుమ్మం ప్రక్కగా నిల్చుని ఆడగొంతుతో మాట్లాడిన వ్యక్తి మీ బాకీదారే అని గ్రహించినపుడు మీ రేంచేస్తారు?" అన్నాడు

"అటువంటి బాకీదార్లు నాకు లేరయ్యా!" అన్నాడు తాపీగా

"ఒకవేళ వుంటే - " అన్నాడు సుబ్బారావు

"నీబోటివాడ్ని వెంటేసుకువెళ్ళి, వాడితో ఆడగొంతు మార్చి బయటకు రమ్మని పిలుస్తాను ఇక తప్పేది లేదని బైటికొస్తాడు" అన్నాడు

"పొరపాటు ఇదేవిధంగా చేసిన అప్పుల వాడిమీద ఓ అప్పారావు కోర్టులో కేసుపెట్టాడు - తనింట్లో లేని సమయంలో ఆడాళ్ళను అల్లరిచేశాడనీ - "

"ఆ భయం నాకు లేదు పెళ్ళి - పెటాకులూ మానేసి నేనెందుకిలా వున్నాననుకొంటున్నావ్? ఆడాళ్ళకు పనికిరానని డాక్టర్ సర్టిఫికెట్ యిచ్చి మేలుచేశాడు" అన్నాడు పానకాలు

చాలామంది యీ మాటకు నవ్వుకొన్నారు

"పిచ్చోడా, నిజమనుకొన్నావా ఏమిటి? వడ్డీవ్యాపారంలో ముందుజాగ్రత్త చర్యగా యిటువంటి సర్టిఫికెట్లు తీసుకోవడం ఆనవాయితీ" అన్నాడు

అంతా గొల్లుమని నవ్వారు

పానకాలు ముఖంలో కనీసం అటువంటి ఛాయలే లేవు సుబ్బారావు దిగాలుగా వచ్చి తన సీట్లో కూర్చున్నాడు

బస్ మంగళగిరి దాటేసి, మహాజోరుగా పోతూంది లింగోజీ కళ్ళు మూసుకొని 'గురక' పెడుతున్నాడు ఇక చివరిసారిగా శ్రీరామ్ వంతువచ్చింది

"బ్రదర్! ఎందుకొచ్చిన ప్రయాస! వా డో మొండిఘటం వాడిగురించి పందెం కాయడమే బుద్ధితక్కువ" అన్నారు మిత్రులు శ్రీరామ్ వారినిచూసి నవ్వాడు "నా ప్రయత్నం కూడా చెయ్యనివ్వండి" అని, పానకాలు కేసి నడిచాడు పానకాలు ఎటో చూస్తున్నాడు

"సార్! ఒక చిన్న ప్రశ్న వడ్డీ డబ్బులు చేతికొచ్చినప్పుడు మీ రెలా భావిస్తారు? మీ మనసు ఆనందిస్తుందా, విచారిస్తుందా?" అన్నాడు

"ఒక్కక్షణం ఆనందిస్తుంది వెంటనే విచారం వేస్తుంది - తిరిగి ఆ డబ్బును ఎవరికో యిస్తే గాని వడ్డీ రాదుగా" అన్నాడు.

'అమ్మ దొంగముండాకొడుకా -' అనుకొన్నాడు శ్రీరామ్ మనసులో

"ఆయాచితంగా మీ కో రూపాయి రోడ్డుమీద దొరికిందనుకోండి అప్పు డెలా భావిస్తారు?" అన్నాడు మళ్ళీ

"సంబరంగా వుంటుంది - అసలు లేకుండానే వడ్డీ వస్తున్నట్లుంటుంది"

"పది రూపాయలు దొరికితే - "

"హుషారుగా వుంటుంది"

"అదే - ఆ హుషారు మీ ముఖంలో ఎలా చూపిస్తారు?" అన్నాడు

"ఎలాగోలా - ఎందుకు?" అన్నాడు పానకాలు అనుమానంగా

"ఊరికే అడిగాను నాకుమాత్రం పది రూపాయలు దొరికితే మౌనంగానే వుండిపోతాను హోటల్‌కి పోయి టిఫిన్ చేస్తాను" అన్నాడు శ్రీరామ్

"వెర్రితనం! డబ్బు విలువ తెలియని కుర్రతనం పదిరూపాయలు ఊరికే దొరికితే ఎంత ఆనందంగా వుంటుందో తెలుసా?" అన్నాడు పానకాలు

"ఎంత ఆనందంగా వుంటుంది?" అన్నాడు శ్రీరామ్ ఆసక్తిగా

"దొరికినప్పుడుగా - చెప్పేది?" అన్నాడు పానకాలు

"క్షమించండి మీ పాదాల దగ్గర యీ డబ్బు చూశాకనే అడిగాను ఇది న్యాయంగా మీకే చెందాలి" అని పదిరూపాయలు తీసి ఇచ్చాడు అది అందుకోగానే పానకాలు ముఖం వికసించింది అప్రయత్నంగానే అతని ముఖంలో చిరునవ్వు కన్పించింది

"మీరు మళ్ళీ మన్నించాలి - ప్రక్కనే యీ ఐదురూపాయల నోటు కూడా వుంది ఇది కూడా మీకే చెందాలి" అని వినయంగా యిచ్చేశాడు

అంతే! పానకాలు ముఖంలో ఆనందం తొంగిచూసింది

ముఖమంతా కప్పలా చేసి, పకపకా నవ్వి, ఆ డబ్బు జేబులో పెట్టుకున్నాడు, "ఏమిటో యీ కాలం కుర్రాళ్ళు - డబ్బు విలువ తెలియదు" అనుకొంటూ మిత్రబృందం చప్పట్లుకొట్టారు

చిట్టిబాబు కిచకిచమని నవ్వుతూ "భలే, భలేవుంది ట్రిక్! ఇదిగో నూట పదహారు రూపాయలు - జాగ్రత్త మా నాన్న చూస్తే వీపు చీరేస్తాడు" అంటూ రహస్యంగా అందించాడు



"ఫ్రెండ్స్ - ఏ పనికైనా కొంత పెట్టుబడి అవసరం. ఈ పందెంలో పెట్టుబడి పోగా నా లాభం నూటొక్క రూపాయలు" అంటూ వాటిని దర్జాగా జేబులో పెట్టుకొన్నాడు శ్రీరామ్

"వీణా! ఆ అబ్బాయి భలే తెలివైన వాడే!" అంది వారుణి

"క్షణంలో తేలిగ్గా డబ్బు సంపాదించాడు" అంది వాహిని

వీణ తనలో తనే నవ్వుకొంది

బస్ కృష్ణాబ్యారేజి దాటుతూంటే లింగోజీకి మెలకువ వచ్చింది హడావిడిగా చూసి, అన్నాడు, "మన బస శ్రీముఖ హోటల్‌లో ఏర్పాటుచేస్తున్నట్లు వియ్యాలవారు చెప్పారు బస్‌ని అక్కడే ఆపమని చెప్పు ఆచారీ" అన్నాడు.

డ్రైవర్ కరీం కూడా తొందరపడుతున్నాడు డ్రైవ్ చేస్తూ వెనుక నున్న ఆడాళ్ళను చూడటం కష్టంగావుంది త్వరగా వారిని బసకు చేరిస్తే కళ్ళ విందు చేసుకోవచ్చును

"కరీంగారూ! 'శ్రీముఖ' హోటల్ ఎక్కడ?" అన్నాడు ఆచారి ముందుకెళ్ళి

"ఎందుకూ?" అని సిగరెట్ అంటించాడు కరీం

"ఆడపెళ్ళివారు మనకు బస అక్కడే ఏర్పాటుచేశారు మనకోసం పది, పన్నెండు రూములు బుక్‌చేసినట్లు కూడా చెప్పారు సరాసరి అక్కడికే లాగించండి" అన్నాడు

"ఆల్‌రైట్" అన్నాడు కరీం

"చిట్టీ! పెళ్ళికూతురు ఎలావుంటుందో చెప్పావుకాదు" అన్నాడు శ్రీరామ్

చిట్టిబాబు సిగ్గుతో తల వంచుకొన్నాడు

"అర్థమయ్యింది ఇక వేరే చెప్పేపనిలేదు నా జాగ్రత్తలో నేనుంటాను ఈరోజు నువ్వు హీరో ధర్మేంద్రలా ఫోజులివ్వాలి టెక్కుగా వుండాలి ఆడపెళ్ళివార్ని ఊపు ఊపేయాలి" అన్నాడు శ్రీరామ్

ఒక్క కుదుపుతో బస్ ఆగింది

ఒక్క గెంతు గెంతి బస్ దిగి, అటుప్రక్కగా వచ్చి గుమ్మందగ్గరే నిలబడ్డాడు కరీం! తలుపు తీసుకొని దిగే స్త్రీలను ఆనందంగా చూడసాగేడు. అతని మనసులో భావం తెలుసుకుంటే తల వాచేలా చివాట్లు తినేవాడే కాని, అటువంటి అవకాశం భగవంతుడు మనుషుల కివ్వలేదు

హోటల్ మేనేజర్ వారందరికీ రూమ్స్ చూపించమని, బోయ్‌తో చెప్పి, తన పనిలో మునిగిపోయాడు

బస్ దిగి నడిచివస్తున్న చిట్టిబాబుని చూసి హోటల్ సిబ్బంది నోరెళ్ళబెట్టి చూశారు. ఘటోత్కచుడి మాదిరి వారి కళ్లకు కన్పించాడు. "అరేయ్, ఆ మనిషికి డబల్ రూమ్ యివ్వండి ఏదీ ఆ చివరిగది! అప్పుడు జనం తిరగడానికి యిబ్బంది వుండదు" అన్నాడు మేనేజర్ స్వరం తగ్గించి

మిత్రబృందం ఒక డబుల్ రూమ్‌లో చేరిపోయారు

"సాయీ! పడకకి యిబ్బందేమో - మంచాలు రెండే వున్నాయి" అన్నాడు సారధి

"ఏడిశావు రాత్రి పెళ్ళి జరగ్గానే వెంటనే తిరిగి వెళ్ళిపోతాం మనం వచ్చింది నిద్రపోవడానికి కాదు - కాసేపు రిలాక్స్ అవడానికీ రూమ్ చాలు" అన్నాడు శ్రీరామ్

అంతా 'సరే'ననుకొని విశ్రాంతిగా కూర్చున్నారు

రూమ్‌బోయ్ వచ్చాడు

"సార్! కాఫీ, కూల్‌డ్రింక్స్ యింకా ఏవైనా కావాలా?" అడిగాడు వినయంగా

"ఇంకా ఏవున్నాయి - వాటి పేర్లు చెప్పు" అన్నాడు సుబ్బారావు

"ఇడ్లీ - వడ - దోశె - పూరీ " అంటూ తన్మయంగా చెప్పుకుపోయాడు

సుబ్బారావు మొత్తం ఆర్డర్ యిచ్చేశాడు తిండి విషయానికొస్తే రెచ్చిపోవడం అతనికి అలవాటు రూమ్‌లో ఛానెల్ - మ్యూజిక్ వింటూ కాసేపు మైమరిచిపోయారందరూ

మరో గదిలో వీణ, ఆమె మిత్రురాళ్ళూ వున్నారు

"లోగడ విడిది ఏర్పాట్లు చేసి ఏదో ఒక యింట్లో మొగపెళ్ళివారిని మకాంచేయించేవారు బ్యాండ్ మేళంతో ఎదురొచ్చి, తీసుకెళ్ళేవారు ఇప్పుడు రోజులే మారిపోయాయి అంతా ఖరీదైన హోటల్సే భరిస్తున్నాయి." అని చెప్పి, చెదిరిన మేకప్ సరిచూసుకొంది వారుణి

"చెప్పానుగా ఆడపెళ్ళివారికి డబ్బుకు లోటులేదు ఎవరూ శ్రమపడేపని లేకుండా, ఎంతమంది జనాభా వచ్చినా, వారందరికీ హోటల్లో గదులు బుక్‌చేయమని చెప్పేశారు ముహూర్తం వేళకు 'కళ్యాణమండపం' చేరుకోవడమే మన పని అంతవరకూ రెస్ట్" అంది వీణ

"ఇంతకీ మీ అన్నయ్య మామగారేంచేస్తాడే?" అంది వాహిని

"జిల్లా మొత్తం అంతా సారాయి దుకాణాలు పాడేశాడు లక్షలకు లక్షలు గడించాడు చాలదా?" అంది వీణ

"నిజమే! ఈనాడు లాభసాటి వ్యాపారం అదేగా!" అంది వారుణి

మరో గదిలో పెళ్ళికొడుకు చిట్టిబాబు హాయిగా మంచంమీద పడుకొని, ఒక ప్లేట్లో జిలేబీలు పెట్టుకొని తింటున్నాడు తల్లి వీరమ్మ అతనివంక ఆప్యాయంగా చూస్తూ ఎదురుగా కుర్చీలో కూర్చుంది. లింగోజీ సీరియస్‌గా కాగితంమీద ఏవో లెక్కలు వేస్తున్నాడు

## రేఖాని ఎత్తుకు పోవాలని....



ప్రముఖ హిందీ నటి రేఖను కిడ్నాప్ చేసేందుకు ప్రయత్నించిన యిద్దరిని పోలీసులు అరెస్టు చేశారు

కార్ల దొంగతనాలు చేయటంలో పేరు మోసిన దేవ్‌మాలాసింగ్, అతని అనుచరుడు రేఖను కిడ్నాప్ చేయాలనుకున్నట్లు తెలియజేశారుట

ఆమె నివసించే రోడ్డు సమీపంలో కాపుకాచి ఆమె రాగానే ఎత్తుకెళ్లి డబ్బు గుంజాలనిఎత్తు వేశారట ఆమెను కిడ్నాప్ చేసేందుకుగాను వారు దొంగిలించిన కారుతో సహా వీరిద్దరినీ అరెస్టు చేసినప్పుడు ఈ కిడ్నాప్ ఉదంతం బయటపడింది మొత్తానికి పోలీసుల పుణ్యమా అని రేఖ వాళ్ల వలలో పడకుండా రక్షింపబడింది



## శవాలమీద వ్యాపారం!

జకార్తాకి 1800కిలోమీటర్ల దూరంలోగల మ మాసా అనే ద్వీపంలో "శవాలను" త్రవ్వి ఎత్తుకుపోయి అమ్ముకునే దొంగలు ఎక్కువయ్యారు ఈ శవాల దొంగలు సమాధులు త్రవ్వి బాగా తాజాగా వున్న శవాల్ని ఒక్కోటి 3వేల పౌండ్ల ఖరీదుకి అమ్మేశారని- యిటువంటి వారిలో 18మంది పోలీసులకి దొరికారని జకార్తాలో మంచి పేరున్న కోలపాస్ అనే పత్రిక వెల్లడించింది- ఈ శవాల ద్వారా- కొన్ని వారికేవో మంత్ర శక్తులొస్తాయన్న నమ్మకం వున్నదట! మమాసా దీవిలో శవాలను- చెడిపోకుండా వుండే ద్రవాలతో పూరబెట్టి మరీ పాతి పెడతారు అవి చాలా కాలం దాకా చెడిపోవుట!

ఇంతలో ఫోన్ మ్రోగింది

"హల్లో నేనే - లింగోజీని మాట్లాడుతున్నాను" అంటూ ఫోన్ అందుకున్నాడు

"బావగారూ! నమస్కారం మీ రాక గురించి యిప్పుడే విన్నాను ప్రయాణం బాగా జరిగిందా?" వియ్యంకుడి కంఠం విన్పించింది

"ఆ ఆ! అంతా క్షేమంగా చేరాం! రాత్రి ముహూర్తంకదూ! అంతా ఎవరి గదుల్లో వాళ్ళు విశ్రాంతి తీసుకొంటున్నారు ఎటూ సాయంకాల మయ్యింది గంటలు క్షణాల్లా గడిచిపోతాయి తమ రాకసారి రాకూడదూ - లెక్కలు చూసుకొందాం" అన్నాడు లింగోజీ

అతని భావం అర్ధంచేసుకొని నవ్వుకొన్నాడు వియ్యంకుడు

"మీరేం వర్రీ కాకండి - ఇప్పుడు ఐదు గంటలయ్యింది నేను సరిగ్గా ఆరు కొట్టగానే వచ్చేస్తాను డబ్బు రెడీగానే వుంది" అన్నాడు

"అబ్బే - మాటవరసకి చెప్పాను ఇంతకీ మేమంతా ఎన్నిగంటలకు బయల్దేరాలి?"

"ఏడు గంటలకు హోటల్ దగ్గరకు ఒక అరడజను కార్లు వస్తాయి ఈలోగా ఆడంగులు స్నానాలూ, ముస్తాబులూ పూర్తిచేసుకొంటేచాలు సరాసరి 'కళ్యాణమండపం' చేరుస్తాయి ఇక మగాళ్ళంటారా, వారి వీలు నుబట్టి ఎప్పుడొచ్చినా అభ్యంతరం లేదు

పోతే డిన్నర్ యిక్కడే ఏర్పాటుచేశాం భోజనాలు కాగానే మిగతా తంతు పూర్తవుతుంది లగ్నం రాత్రి ఒంటిగంటకు కదా! నిదానంగానే అన్నీ జరుగుతాయిలెండి ఊరికే శరీరం హైరానపడేలా మనమంతా ఖంగారు పడే పనేముంది?" అన్నాడు

"ఫోన్ పెట్టేస్తున్నా - మీకోసం ఎదురుచూస్తాను" అని పెట్టేశాడు లింగోజీ

వీరమ్మ అడిగింది

"పెళ్ళికూతు రెలావుందీ, ఏం చేస్తోందో?"

"పెళ్ళి చూసిరా -. అయినా పెద్దమనుష్యులు ఫోన్లో మాట్లాడుకొనే విషయమా యిది? ఆమెకేం గుండ్రాయిలా వుంటుంది చిట్టిగాడికేం తీసిపోదు" అన్నాడు లింగోజీ

ఎక్కడో కిచకిచమనే శబ్దం విన్పించింది

"ఎలకలుగానీ వున్నాయో ఏమిటోపాడు" అంది వీరమ్మ.

"ఎలకలూ కాదూ - నీ ముఖమూ కాదు నీ సుపుత్రుడు చిద్విలాసంగా నవ్వేడు" అంటూ లింగోజీ బాత్‌రూమ్‌లోకి దూరేడు

"అమ్మా! నువు కాసేపు వేరే గదిలోకి పోవే - నేను స్నేహితులతో చాలా మాట్లాడాలి" అన్నాడు చిట్టిబాబు

"అయ్యో అంతకన్నానా - కాసిని జంతికలు, చేగోడీలూ యివ్వనా?" అంది

"అవే కాదు కాస్త మిరాయి, మైసూర్‌పాకం కూడా యిచ్చి వెళ్ళవే మరో విషయం! స్నేహితులొస్తే బాగుండదు కొంత డబ్బు కూడా కావాలి" అన్నాడు

ఆమె తన పర్సు తీసి కొన్ని వంద కాగితాలు యిచ్చింది

"చిట్టిగా జాగ్రత్తరోయ్! నాన్నతో చెప్పమాకు నే వెల్తాను" అంటూ గదిలో నుండి వెళ్ళిపోయింది

చిట్టిబాబు కాలింగ్‌బెల్ కొట్టాడు బేరర్ వినయంగా లోపలికి అడుగుపెట్టి, అక్కడున్న ఫలహారాలు చూసి ఆశ్చర్యపోయాడు

"ఏమిటిసార్, ఈ మొత్తం గదులకు నేనే సప్లై కదా- నాకు తెలియకుండా యివన్నీ ఎవరు తెచ్చారు?" అంటూ అడిగాడు

"ఇవి మా సొంతం లేవోయ్" అన్నాడు దర్జాగా చిట్టిబాబు

"ఎవరికైనా పంచిపెడుతున్నారా?" ఆశగా మళ్ళీ అడిగాడు

"కాదు నాకే- సరదాగా తింటే బాగుంటాయనీ-" అన్నాడు చిట్టిబాబు

అతని ఆకారంమీదే కాదు, తిండి పుష్టి మీద కూడా నమ్మకం కలిగింది ఇంతకీ తన్నెందుకు పిలిచినట్లూ? అడిగాడు బేరర్

"చెప్పడం మరిచాను "202"లో నా స్నేహితులున్నారు ఇక్కడికి రమ్మని చెప్పు" అన్నాడు బేరర్ వెళ్లిపోయాడు

కాసేపట్లో అందరూ ఆ గదిలో చేరిపోయారు

"చిట్టీ! యింకా గెటప్ మార్చలేదే?" అడిగాడు శ్రీరాం

"అందుకేగా పిలిచింది, మీ అందరినీ-" కిచకిచా నవ్వేడు మరో నాలుగు జిలేబిలు మాయమయ్యాయి

"బ్రదర్, 'ఈటింగ్'లో అమ్జాద్‌ఖాన్‌తో పోల్చదగ్గ వ్యక్తివి నువ్వు ప్రస్తుతం కథానాయకుడివి కనుక నీ వేషం, భాష కూడా మార్చి మాడ్రన్‌గా మార్చేద్దామనుకొంటున్నాం"

"స్నానం ముగించి సఫారీ డ్రెస్ వేసుకో, సెంట్ పులుముకో నవ్వడం కూడా స్టైల్‌గా వుండాలి- అచ్చం ధర్మేంద్రలా-" అన్నాడు శ్రీరామ్ సాయి మరో సందేహం వెలిబుచ్చాడు

"ధర్మేంద్రే అనుకొని హేమ్మాలిని వచ్చేస్తే-?"

"రాదు ఆమె బొంబాయిలో వుంది రావాలంటే చాలా టైమ్‌పడుతుంది ఈలోగా చిట్టిగాడి పెళ్ళయి, పెళ్లాం వచ్చేస్తుంది" అన్నాడు శ్రీరామ్

"ఇదీ పాయింటే-" అన్నాడు సుబ్బారావు జంతికలు పరపరా నములూ

"నీకో లాభం వుంది ఫైటింగ్‌లాగట్రా చేయక్కర్లేదు ప్రస్తుతం పెళ్లికొడుకు గెటప్‌లో వున్నావు కనుక-" సారధి అన్నాడు

"అటువంటి గొడవల్లో నన్ను యిరికించకండి ఎవరైనా నా ఒంటిమీద చెయ్యేస్తే చాలు భయంతో గుండాగి పోతుంది" అన్నాడు చిట్టిబాబు

"ఆ ధైర్యం ఎవరికుంటుంది, మిత్రమా! నీ శ్రీమతికి తప్ప- ఇంతకీ మీరిద్దరూ ఒకరినొకరు బాగా చూసుకొన్నారా?" ప్రశ్నించాడు సాయి చిట్టిబాబు కిచకిచా నవ్వేడు

"అదిగో, ఆ నవ్వే మా కొంప తీస్తోంది హుందాగా రాక్‌హడ్సన్‌లా నవ్వాలి లేదా,

గ్రెగరీ పెక్ స్టైయిల్లో నవ్వేసెయ్" అన్నాడు శ్రీరాం

"ఇన్ని రకాలుగా మారిస్తే నేను ఒప్పు కోను ధర్మేంద్రే బావుంటాడు." అన్నాడు చిట్టిబాబు

"ఓ కే వెంటనే వెళ్లి పన్నీటి స్నానం చేసెయ్" అన్నాడు శ్రీరాం

చిట్టిబాబు కులుక్కుంటూ బాత్‌రూం లో దూరాడు

"ఏమిటో- చిట్టిగాడిలాటివాళ్లు కూడా పెళ్లిళ్లు చేసేసుకొంటున్నారు మనమూ వున్నాం- ఎందుకూ?" అన్నాడు సాయి

"ముందు మెడిసన్ పూర్తిచేయండ్రా సన్నాసుల్లారా! అప్పుడు పెళ్లి గురించి కలలు కనొచ్చును" అన్నాడు శ్రీరాం

"నీకేం గురూ- డిగ్రీ చేతికొచ్చింది ప్రాక్టీస్ పెట్టేస్తావ్ మేమే బుద్ధి తక్కువై ఒక సంవత్సరం "డింకీ" కొట్టించి, యింకా చదువుతూనే వున్నాం" అన్నాడు సారధి నీరసంగా

"పిచ్చోడా, మనకింకా అనుభవం పెరుగుతుంది వచ్చే ఏడు మనం కూడా డాక్టర్ డిగ్రీ తీసుకొంటాం శ్రీరాం కన్నా సీనియర్స్‌గా వృత్తిలో పేరు తెచ్చుకొంటాం" అన్నాడు సుబ్బారావు

"ముందు కబుర్లు మాని, మేకప్పులు కానివ్వండి అమ్మాయిలు చూస్తే ఝడుసుకొనేలా వున్నారు," అన్నాడు శ్రీరాం

సాయి, సుబ్బారావు క్షణంలో మాయమయ్యారు.

"బ్రదర్, చిట్టిగాడి చెల్లెలు చాలా అందంగా వుంటుంది కదూ?" అని ప్రశ్నించాడు సారధి

"అయ్యింది- అనుకొంటూనే వున్నాను పెళ్ళికొచ్చిన పెద్ద మనుషుల్లా ప్రవర్తించి బైటపడండి లేదా, దేహశుద్దే!" అన్నాడు శ్రీరామ్

అంతే సారధి నోరుమూసుకొన్నాడు

కాసేపట్లో చిట్టిబాబు డ్రెస్ చేసుకొని వచ్చాడు

"ఏమో అనుకొన్నాం కానీ, మనవాడ్ని చూస్తే ధర్మేంద్ర సినిమాఫీల్డ్ వదలి పారిపోతాడేమో" అన్నాడు సారధి

చిట్టిబాబు ఛాతి పొంగింది

శరీరం అమాంతంగా ఉబ్బిపోయింది

"సారధీ, మనవాడు అల్ప సంతోషి ఇలా పొగిడితే బెలూన్ పెరిగి, ఇక్కడ నుండి కదలడం కష్టమవుతుంది నిజాన్ని మనసులోనే వుంచుకోవాలి ఎప్పుడు పడితే అప్పుడు బయటకు కక్కేస్తే ప్రమాదం" అన్నాడు శ్రీరామ్.

"సారీ బ్రదర్, నోరు జారింది" తమాషాగా అన్నాడు సారధి

హోటల్ క్రింద పాన్‌షాప్ దగ్గర నిలబడి, సిగరెట్ మీద సిగరెట్ వెలిగిస్తూ, అదోరకమైన బాధలో వున్నాడు కరీం!

అతని మనసును పన్నెండున్నర మంది అమ్మాయిలు దోచుకొన్నారు ఈ పెళ్లిళ్ల సీజన్ పూర్తి అయ్యేలోపున వందల సంఖ్యలో అతని మనసును దోచుకొన్న అమ్మాయిలు, నిత్యం కలల్లో కన్పిస్తూ, వేధిస్తూంటారు అది అతని మానసిక బలహీనత

ఇంతలో అక్కడ ఆటో ఆగింది

అందులో నుండి ఒక చక్కటి జంట దిగారు అబ్బాయి ఎర్రగా బుర్రగా వున్నాడు అమ్మాయి వెర్రెక్కించేలా వుంది

కరీం మనసు ఖరాబయ్యింది నుదురు బాదుకున్నాడు

"అబ్బబ్బ, ఇప్పటికే ఖాళీలేక చస్తూంటే, మరో కొత్త పాసింజరా! ఓవర్ లోడ్ చేయడానికి ఓనర్ ఒప్పుకోడు-" అన్నాడు స్వగతంగా

"ధర్మం బాబయ్యా!" అంటూ కరీం ముఖం మీద చెయ్యి పెట్టాడో వ్యక్తి

ఈలోగా ఆ జంట రిసెప్షన్ కౌంటర్ దగ్గరకు పోయారు

"మధ్యలో నీ గొడవేంటి, ఆగవయ్యా!" అంటూ నాలుగడుగులు వేసి, వారు కన్పించేలా నిల్చున్నాడు కరీం

"బాబూ, ధర్మం- ప్లీజ్ " అన్నాడు ఆ వ్యక్తి మళ్లీ ఈ సారి కరీం ఆ వ్యక్తిని పరిశీలనగా చూశాడు చక్కటి దుస్తులు ధరించి, చేతికి వాచీ పెట్టుకొన్నాడు కాస్త గడ్డం మాసింది

"అడుక్కోవడం నీ హాబీనా?" వ్యంగ్యంగా అడిగాడు కరీం

"అది పవిత్ర భారతీయుడిగా నా జన్మ హక్కు " అన్నాడు ఆ వ్యక్తి కరీం మండిపోయాడు

"సరే! ఇలా మనుషుల ప్రాణాలు తీయడం దేనికి? ఇచ్చే దాతలు వుంటే తీస్కోపో " అన్నాడు విసుగ్గా

"భలే అంటున్నారే- మీకేసు పూర్తి అయ్యాక మరొకటి " అన్నాడు

"ఇవ్వనయ్యా- ఇవ్వను 'సందట్లో సడేమియా'లా నువ్వేమిటి?"

"మీ బాధ నాకర్థం అయ్యింది ఆ పిల్ల గురించి వివరాలు కావాలా? చెప్పండి " అన్నాడు నవ్వుతూ కరీం ఆత్రంగా చూశాడు

"నే వెళ్లాలి త్వరగా తేల్చి చెప్పండి " అంటూ చెయ్యి చాచేడు కరీం విసుక్కొంటూ ఒక అర్ధ రూపాయి యిచ్చాడు

"సరే ఆ పిల్ల యీ హోటల్‌కు రావడం యిదే మొదటిసారి వారిద్దరూ భార్యాభర్తలు మరీ తినేసేలా చూస్తే, ఒళ్లు హూనమవుతుంది వస్తా " అంటూ అక్కడ నుండి వెళ్లిపోయాడు

కరీం కోపంతో సిగరెట్ నేల కేసి కొట్టాడు

అదే సమయంలో ఒక కారు వచ్చి ఆగింది పొందూరు ఖద్దరు దుస్తులలో వున్న వ్యక్తి బ్రీఫ్‌కేస్ పట్టుకొని కారు దిగాడు వెంట మరో యిద్దరు వ్యక్తులున్నారు అప్పుడే రెండు ఖూనీలు చేసి, సరదాగా బీర్ త్రాగి వచ్చినట్లున్నాయి వారి ముఖాలు

కౌంటర్ దగ్గర వ్యక్తి ఆదరంతో ఆహ్వానించాడు

"రండి సార్, పెళ్లి వారందరికీ ఏ లోపం లేకుండా ఎకామడేషన్ ఏర్పాటు చేశాం కూర్చోండి, కాఫీ త్రాగుతారా " అన్నాడు వినయంగా

"అబ్బే అటువంటి అలవాటు లేదు " అన్నాడు ఆ వ్యక్తి

"అయ్యగారికి యిలాటివి గిట్టవు " అంటూ కోపంగా చూశాడు ప్రక్కనున్న వారిలో ఒకడు

"సారీ- ఇంతకీ మీ వాళ్లకు కనెక్షన్ యిచ్చి పిలిపించనా" అంటూ ఫోన్ ఎత్తాడు రిసెప్షనిస్ట్

"ఎందుకూ- నేనే వెళ్తాను " అంటూ ఆయాస పడుతూ లేచి, లిఫ్ట్‌లో పైకి పోయాడా వ్యక్తి

ఇద్దరూ బీడీలు వెలిగించుకొని బైటకొచ్చారు

"ఎవరండీ ఆయన?" అడిగాడు కరీం ఆసక్తితో

"ఎవరా? భలే ప్రశ్న అడిగావు, సారా సాంబయ్యగారి పేరు తెలియని వారీ వూళ్లో నే లేరు." అన్నాడొకడు

"సారా త్రాగుతారా?" అన్నాడు కరీం నవ్వి

"కళ్లు పోతాయి. సారా అమ్ముతారు ఇంతకీ నువ్వెవరోయ్ బచ్చా!" అన్నాడు అందులో ఒకడు

"పెళ్లి వారి బస్‌కి డ్రైవర్ని- గుంటూరు నుండి వచ్చాను " అన్నాడు కరీం. నిజానికి వారి మీద కోపంగా వున్నా, వారి ఆకారాలు చూస్తే ఎదురు తిరగడానికి భయం వేసింది

"చెప్పావు కాదేం, మొగ పెళ్లి వారన్న మాట మేం ఆడ పెళ్లివారం పద పద, నీకు మర్యాదలు చేయకపోతే బాస్ ఊరుకోరు " అంటూ రెండు సిగరెట్ ప్యాకెట్స్ కొని, కరీమ్‌ని దగ్గర్లో వున్న బార్లోకి తీసుకుపోయారు కరీం తన అదృష్టానికి మురిసిపోయి, వారి వెంట పిల్లిలా జారుకొన్నాడు

సాంబయ్యను చూడగానే చాటంత ముఖం చేసికొని ఎదురెళ్లాడు లింగోజీ ప్రక్క-

## 70 ఏళ్లకు పెళ్లి



70 సంవత్సరాల వయస్సులో-వున్న భార్యకు విడాకులిచ్చి ఒలింపిక్ విమాన యాన సంస్థలో ఎయిర్ హోస్టెస్‌గా పని చేసి మానేసిన డిమిత్రా నియానిని పెండ్లి చేసుకున్నాడట గ్రీకు మాజీ ప్రధానమంత్రి ఆండ్రి యాస్ పపాండ్రో

38 ఏళ్ల క్రితం వివాహమాడిన అమెరికన్ మహిళ మార్గరెట్‌పై మోజు తగ్గి డిమిత్రా నియాని మోజులో పడ్డాడట పపాండ్రో ఈ వయసులో మరి ఆ మోజేమిటో! ఇటీవల జరిగిన ఎన్నికలలో ఈయన అక్రమ సంబంధం విషయం బాగా వ్యాప్తిలోకి వచ్చి ఈయన పార్టీ ఘోరపరాజయం కూడా చవి చూసింది పార్టీ పోతే పోయింది ఈ 'పార్టీ' పోతే మళ్లీ దొరకదనుకున్నాడు కాబోలు దభ-లున పెళ్లి చేసేసుకున్నాడట మరి మార్గరెట్ గతేమిటో?



అంత ఆరోగ్యంగా వున్న మీ కుక్క ఎలా చనిపోయింది ఆశ్చర్యంగా అడిగాడు యాదవ్

నిన్న పొరపాటున అది మా ఆవిడ్ని కరిచింది' చెప్పాడు కిరణ్

– బి కుమారస్వామి



"మాయావిడకు పెన్సిలిన్ ఇంజక్షన్ వేయండి డాక్టర్"

"అదావిడకు పడదయ్యా"

"అందుకేగా వెయ్యమంటోంది"

-పద్మశ్రీ




సారీ శాంతీ న్యూస్ పేపర్ దర పెరిగినందువల్ల అరరావుతో నే ప్రేమలేఖ ముగించాను అన్నాడు లోబికుమార్

అలాగా ఒకవేళ చీర దర పెరిగితే నాకు సగం చీర కొనిచ్చి కట్టుకోమంటావేమో సారీ– నీ ప్రేమకు నేటితో గుడ్‌బై అంటూ ముందుకు దారితీసింది శాంతి

– వేసారపు మాధవయ్య



బిచ్చగాడు. బాబూ! ధర్మ పెబువులు తిండి తిని మూడ్రోజులైంది ఒక్క పావలా బిళ్లదానం చేయండి బాబూ!

పెద్దమనిషి పావలాబిళ్లతో ఏం కడుపు నిండుతుందోయ్?



బిచ్చగాడు తిండికోసం కాదు బాబయ్యా ఈ మూడ్రోజుల్లో ఎంత బరువు తగ్గానో చూసుకునేందుకు

పెద్దమనిషి. ఆ !?

-ఎస్. శ్రీనివాసమూర్తి

నున్న ఆచారి దండం పెట్టాడు

"బావగారూ! అన్న టైమ్‌కి వచ్చేశారు. చాలా సంతోషం" అన్నాడు

"అది నా అలవాటండీ ఈ డబ్బుంది చూశారూ, ఇవ్వాల్సినాళ్లకు యిచ్చేస్తే కాని గుండెల మీద భారం తీరదు." అంటూ బ్రీఫ్‌కేస్ తెరిచాడు ఆచారి ఒక్క గంతులో వెళ్లి తలుపులు మూశాడు

"ఓరి నీ అసాధ్యం కూలా! ఎందుకా ఖంగారు మనమేం తప్పుడు పన్లు చెయ్యడం లేదుగా" అన్నాడు నవ్వుతూ, సాంబయ్య

"అమ్మమ్మ ఎంత మాట! లక్ష్మీదేవికి దిష్టి తగలకూడదు," అన్నాడు ఆచారి

బ్రీఫ్‌కేస్‌లో కన్పించిన నోట్ల కట్టల్ని ఆప్యాయంగా చూస్తూ, లెక్కెట్టుకోవడం ప్రారంభించాడు లింగోజీ ఆచారి కళ్ళు పెద్దవి చేస్తూ, నోరు తెరచి వుండిపోయాడు

సాంబయ్య విలాసంగా కాళ్ళెగరేస్తూ, కుర్చీలో వాలి పోయాడు నోట్ల లెక్కింపు పూర్తిచేసి, తృప్తిగా నవ్వేడు లింగోజీ.

"బావగారు మాట తప్పరని తెలుసు- అయినా వ్యవహారంలో నేను ఖచ్చితంగా పోయే వ్యక్తిని కనుక, ఏదైనా పనిలో వుండి మర్చిపోతారేమోనని ఫోన్‌లో గుర్తు చేశాను" అంటూ నవ్వేడు

"నేనూ అంతేగా మరి-" వంత పాడేడు సాంబయ్య

"అయ్యా, లాంఛనాల విషయం" అంటూ గొణిగేడు ఆచారి

"నీవెక్కడ దొరికావయ్యా మగడా- మధ్యలో నీ గోల ఎక్కువయింది అన్నీ సక్రమంగానే జరుగుతాయి సరేనా!" అన్నాడు సాంబయ్య

"నిజానికి ఆచారికి బాగా 'కీ' యిచ్చి వదిలేశాడు లింగోజీ" ప్రక్కనుండి గొడవ చేస్తేగానీ, రాబట్టుకొనేవన్నీ సక్రమంగా చేతికి రావని అతని భావం

"ఇంతకీ వరుడు ఏమంటున్నాడు?" అన్నాడు సాంబయ్య

"బావగారూ, ఇంకా వరుడేమిటి- మీ సొంత అల్లుడు." అన్నాడు లింగోజీ. "అంతేగా మరి- కట్నం వచ్చేసిందిగా" అన్నాడు ఆచారి

"పానకంలో పుడకలా నువ్వేమిటయ్యా కాస్త, మా ఇద్దర్నీ ప్రశాంతంగా మాట్లాడుకోనివ్వు" అన్నాడు సాంబయ్య.

"వాడికి నోటి దురద జాస్తిలెండి-" సర్ది చెప్పాడు లింగోజీ.

వియ్యంకులిద్దరూ కులాసాగా మాట్లాడుకొన్నారు.

అర్ధ గంట గడిచాక సాంబయ్య లేచాడు

"మరి నే వెళ్తాను కాసేపట్లో మీకు కార్లు పంపుతాను వచ్చేయండి అక్కడ నాకు చాలా పనులున్నాయి" అన్నాడు.

"మరే- అదే బాగుంటుంది" అంటూ సాగనంపేడు లింగోజీ

సాంబయ్య వెళ్ళిపోయాక ఆచారి మీద విరుచుకు పడ్డాడు.

"చిలక్కి చెప్పినట్లు చెప్పాను లాంఛనాలు కూడా ముక్కు పిండి మరీ వసూలు చెయ్యాలని- లిటిగేషన్ గాడివని నీతో చెప్పాను. బావగారి వెంట ముందుగానే వెళ్ళి, ఆ పని చూస్తే పోయేదిగా. ఇంకా ఇక్కడ దేనికి- నా శ్రాద్ధం." అన్నాడు కోపంగా

"అన్నిటికీ తొందరే! ఆయనసలే పెద్ద రౌడీ. మరీ రెచ్చిపోతే, కీళ్ళు విరిచేసినా యీ వూళ్ళో దిక్కులేదు." అన్నాడు ఆచారి

(ఇంకావుంది)

# విద్యార్థుల్లో అశాంతి ఎందుకు?

## ప్రభుత్వమే కారణం

విద్యార్థులలో అశాంతికి మూలకారణం ప్రభుత్వమే నేడున్న విద్యావిధానంలోని లోపాలే విద్యార్థుల అశాంతికి నిలయమైంది. దీనికి తోడు నిరుద్యోగ సమస్యకూడా ఉత్పన్నం కావడం అశాంతికి మరింత దోహదమవుతోంది మరో విషయమేమంటే చదువు'కొనే'వారికి కాకుండా చదువుకునేవారికి ప్రభుత్వం ఎప్పుడైతే ప్రాధాన్యతనిస్తుందో అప్పుడు ఈ అశాంతిచోటు చేసుకోదు

ఉపాధ్యాయుల బోధన సరిగా లేకపోవుట, కష్టపడి చదివే విద్యార్థులకు గుర్తింపు లేకపోవుటకూడా అశాంతికి మూలకారణాలవుతున్నాయి

సకాలంలో పుస్తకాలు, నోట్సు అందకపోవటం, పరీక్షల సమయానికి పోర్షన్ లు కాక తికమక యివన్నీ విద్యార్థుల్లో అశాంతికి దోహదిస్తున్నాయనటంలో సందేహంలేదు

- పి. వెంకటాచారి
(హైదరాబాద్)

## భద్రతలేని జీవితం

తమ భవిష్యత్ జీవితానికి భద్రతలేదనే భావమే విద్యార్థులలో అశాంతికి ప్రధాన కారణమవుతున్నది ఈ భావంవల్లే వారు విద్యమీద దృష్టిని కేంద్రీకరించలేకపోతున్నారు ప్రస్తుత మన విద్యా వ్యవస్థలో కుల ప్రాతిపదికకు లభిస్తున్న ప్రోత్సాహం, అవకాశాలు - ప్రతిభావంతులకు, పేద విద్యార్థులకు లభించడంలేదు పోటీ పరీక్షలు ఇంగ్లీషులో నిర్వహిస్తుండటం వల్ల యింగ్లీషు చదివినవారితో వీరు పోటీ పడలేకపోతున్నారు విద్యార్థులలో ఇంగ్లీషు పరిజ్ఞానాన్ని పెంచే అవకాశాలు ప్రభుత్వం కల్పించకపోవడం దురదృష్టకరమనే చెప్పాలి దీనితో, విద్యార్థులకు ప్రభుత్వం పైన ప్రభుత్వ విధానాలపైన ఏవగింపుగలిగి తిరుగుబాటు ధోరణి అలవడుతోంది అంతేగాక విద్యార్థులలో ఆత్మవిశ్వాసాన్ని సన్నగిల్లేలాచేసి, వారిని పిరికివారుగాను, స్థిరచిత్తం లేనివారుగాను తయారుచేస్తూ విద్యార్థుల జీవితాల్ని అశాంతిపాలు చేస్తున్నాయి

- వడ్లమూడి దుర్గాంబ
(శ్రీశైలం ప్రాజెక్టు)

## పథకాల అమలులో లోపం

నిధుల దుర్వినియోగం, పథకాలను సరిగా అమలుచేయలేకపోవడం, ఉపాధ్యాయులకు సరైన శిక్షణ లేకపోవడం, ఫలితంగా విద్యార్థులకు విద్యరాకపోవడం - అశాంతికి కారణాలవుతున్నాయన్న నిజాన్ని ఎవ్వరూ కాదనలేరు

వీధి వీధికో ప్రైవేటు పాఠశాల పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చి విద్యను వ్యాపారంగా మార్చి విద్యార్థుల్లో అశాంతికి కారణమవుతున్నాయి విద్యలో సత్తావున్నవాడికి ప్రోత్సాహముంటే ముందుకు రాగలడు దీనికి ప్రభుత్వం సరైన విధంగా పథకాలు అమలుచేయాలి, నిరుద్యోగ సమస్య ఉత్పన్నం కాకుండా చూడాలి అప్పుడే విద్యార్థుల్లో అశాంతి దూరమైపోతుంది.

-పోలోజు ధనలక్ష్మి
(హైదరాబాద్)

## కాలేజీ సీట్లు దొరకక....

స్కూళ్లు, కాలేజీలు ప్రారంభమయ్యాయి ప్రారంభం మొదలు విద్యార్థులకు కష్టాలే ఫీజులు కట్టలేక, పుస్తకాలు కొనుక్కోలేక, స్కూలు యూనిఫారాలు కుట్టించుకోలేక బాధలు ఈ రోజుల్లో స్కూల్లో కాని, కాలేజీలోకాని చేరడానికి ముందు కావలసింది డబ్బు డబ్బుంటే సీటు వచ్చేసినట్లే

వీధికొక ప్రైవేటు స్కూలు వెలుస్తోంది. ప్రభుత్వ కళాశాలల్లో సీట్లు దొరకని స్థితి తెలిసిన విషయమే మరి చదువుకొని కూడా సీట్లు రాకపోతే అశాంతికాక మరేముంటుంది చెప్పండి

-యల్లపు శ్రీనివాస్
(అనకాపల్లి)

తట్టెడు పేడ ముందేసుకుని, దాంట్లో ఊక, బొగ్గుల పొడి కలిపి, పిడకలు కొడుతోంది విశాలాక్షి..

"అమ్మా" అనబోయి ఆగిపోయాడు సూర్యం. తల్లినే తదేకంగా చూస్తూ నిలబడ్డాడతను . చిక్కి పోయి, నల్లగా అయిపోయిన విశాలాక్షి మెడ దగ్గర ఎముక పొడుచు కొస్తోంది

పొదవాటి పుల్లలకు చర్మం తగిలించినట్లున్నాయి చేతులు ఆ చేతులు నిర్విరామంగా పని చేస్తూనే ఉంటాయా సంసారాన్ని నిలబెట్టటానికి వెలిసిపోయి, చిరుగుపట్టిన కల నేత చీర మెడలో మాసిపోయిన పసుపుతాడు చెవులకు నీరు దిగి రాళ్లు ఊడిపోయిన కమ్మలు ముక్కుకు బేసరి కాంతి కోల్పోయిన కళ్లు దిగులు గూడు కట్టుకుని ఉన్న మొహం

కళ్లల్లో నీళ్లు తిరిగాయి సూర్యానికి

ఒకప్పుడు ఈ ఇంట్లో పరిస్థితులింత హీనంగా ఉండేవి కావు ఎక్కువగా ఏం లేకపోయినా కనీసం తిండికీ బట్టకీ లోటుండేది కాదు తనూ చెల్లీ చదువుకుంటూ ఉండేవారు తండ్రి జీతం తక్కువే అయినా తమ కుటుంబ సభ్యులు నలుగురే అవటం దీనికితోడు తల్లి దొడ్లో కాయించే కాయా కసరూ ఒక గేదె పాడి వీటితో తమ సంసారం ప్రశాంతమైన గోదారిలో నెమ్మదిగా సాగే చిన్ని పడవలా ఉండేది

ఆ రోజు

హఠాత్తుగా ముంచుకొచ్చిన కెరటాల తాకిడికి ఆ పడవ దాదాపుగా తలక్రిందులైన రోజది

విశాలా! ఇహ రేపట్నుంచీ నేను గుడికి వెళ్లక్కర్లేదు నీతో పాటు ఇంట్లోనే వుంటాను రోజంతా నవ్వుతూ అనబోయిన నారాయణాచార్లు ప్రయత్నం ఫలించలేదు దుఃఖం ఆయన గొంతులో గురగురలాడుతోంది కారు మేఘాచ్ఛాదిత గగనతలంలా ఉందాయన మొహం నిర్ఘాంతపోయినట్లుగా భర్తనే చూస్తోంది విశాలాక్షి కొన్ని నెలలుగా పేపర్లో దీని గురించి వివాదాలు వింటూనే ఉందామె అయినా ఎక్కడో ఏదో అడ్డుపడి అలా జరగదనే ఆశతో నెట్టుకొచ్చారిన్నాళ్ళూ

వెనకటికెవడో ఏడేళ్లు కర్రసాము కత్తిసాము నేర్చుకునొచ్చి తన ప్రతాపాన్ని చూపించటానికి మూలనున్న ముసలమ్మను చంపాట్ట'

అచ్చం అలాగే ఉందిది!

గుళ్లో పూజారులవి ఓ గొప్ప ఉద్యోగాలా? వాళ్ళకిచ్చేవి గొప్ప జీతాలా? వాళ్ళ



ఆదూరి సావిత్రి

మిదెందుకీ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించటం?

కొన్నాళ్ళ క్రితం జరిగిన 'కరిణీకాల రద్దు' ప్రభంజనంలో తన తండ్రి సంసారం ఇలాగే నేల కూలిపోయింది

ఇప్పుడు తనూ '

దేముడి ఆ[illegible]ని దో[illegible]చుకుంటూ పూజారులు ఊరివాళ్ళను దో[illegible]చుకుంటూ కరణాలు బాగా బలిసి పోయారు అం[illegible] వాళ్ళను ఊడబెరికాం మేం అభ్యుదయ పథంలోకి పయనిస్తున్నాం అని దొరతనంవారు గర్వంగా వెన్ను విరుచుకోవటం వందిమాగదులు మెచ్చుకుంటూ స్తోత్ర పారాలు చదవటం

కొన్ని డిపార్టుమెంట్లలో కొందరు లంచం తీసుకుంటున్నారని మొత్తం ఆ డిపార్టుమెంట్లనే రద్దు చెయ్యాలనుకోటం మూర్ఖత్వం!

శరీరంలో ఒక బాగం చెడిపోతే నేర్పుగా దాన్ని బాగు చేసుకోటానికో అది వీలవకపోతే ఆ బాగాన్ని తొలగించి అయినా మిగతా శరీరాన్ని పదిలంగా కాపాడుకోటానికి ప్రయత్నిస్తాం అంతేగానీ మొత్తం శరీరాన్నే నాశనం చెయ్యాలనుకోం గదా

పాలకుల ఇనప పాదాల కింద తమలాంటి దీనుల కుటుంబాలిలా నలిగి నశించిపోవాల్సిందేనా'?

వంశపారంపర్య హక్కు రద్దు చేస్తారు గానీ ఇప్పుడున్న పూజారులు మాత్రం కొనసాగు తారన్నారు కదండీ మరి మిమ్మల్నెందు కిలా హఠాత్తుగా తీసేశారు?' ఆక్రోశంగా అడిగింది విశాలాక్షి

నేను ట్రైనింగ్ అవలేదట మంత్రపుష్పం కూడా సరిగ్గా చెప్పలేకపోయానట ఇంకా చాలా అన్నారులే చివరికి నేను ఆ గుడిలో పూజారి పదవిలో కొనసాగటానికి అనర్హుడిని అని తీర్మానించి నన్ను ఇంటికి పంపేశారు నిస్త్రాణగా అన్నాడు నారాయణాచార్యులు

మీరు ట్రైనింగవలేదా! మీకు మంత్రపుష్పం రాదా? నమ్మే విషయమేనా ఇది? మీ తండ్రి పూజారి పండితుడు చిన్నతనం నుంచే మీకు తన పాండిత్యాన్ని ఆయన నూరిపోశాడు తెల్లవారు ఝామున చలిలో నీటి తడిలో మీరు ఆయన దగ్గర పొందింది ట్రైనింగ్ కాదా? మీరు గుడిలో మంత్రాలు చదువుతుంటే మీ వాక్శుద్ధికి ఎందరు భక్తులు పరవశించలేదు?

ఇది అన్యాయమని ఎవరూ నిలదియ్యలేదా వాళ్ళని?'

ఎవరు నిలదీస్తారు విశాలా? ప్రభుత్వం కొన్ని చట్టాలు చేస్తుంది వాటికి కొన్ని కన్నాలుంటాయి కొందరు అధికారులు ఆ కంతల్లో దూరి ఆ చట్టాన్ని తాము ఆక్రమించుకుంటారు

తాగుడు నిషేదిస్తారు అందువల్ల తాగుబోతు తాగటం మానడు ఆ చట్టాన్నుపయోగించుకుని పై వాళ్ళు జేబులు నింపుకుంటారు

ఇంతటి తెలివితేటలు గల వ్యవస్థ మనది ఈ తెలివితేటల గురించి ప్రశ్నించే అధికారం మనలాంటి సామాన్యులకి లేదు

రేపెలా అనే దిగులు ఆ దంపతుల మొహాల్లో గూడుకట్టుకోవటం ప్రారంభించింది

హఠాత్తుగా జరిగిన ఈ సంఘటన నారాయణాచార్యుల్ని బాగా దెబ్బతీసింది తనిహ అసమర్థుడు ఈ సంసారాన్ని తను పోషించలేడు అనే బావం ఆయనను దిరంపంలా కోస్తోంది

అనారోగ్యంతో దిగులుతో మంచం పట్టాడాయన కుటుంబ బారం విశాలాక్షి మీద పడింది

అప్పడాలొత్తి వడియాలు పెట్టి విడకలు కొట్టి మిషను కుట్టి ఆమె చేతులు విరామమెరుగని పని చేస్తున్నా ఆ సంసారం పూర్వపు కనీస స్థితికి చేరుకోలేకపోయింది సూర్యం బి ఎ ఫస్టుక్లాస్‌లో పాసయ్యాడు అతనీ సంసారాన్ని చేతుల్లోకి తీసుకొని విశాలాక్షికి కాస్త విశ్రాంతి కల్పిస్తాడని కొండంత ఆశతో ఎదురు చూస్తున్నాడు నారాయణాచార్యులు

కానీ ఉన్న ఉద్యోగం ఊడగొట్టి వాడి నోటి దగ్గర కూడు లాగటం చాలా తేలిక అదో సెన్సేషనల్ న్యూస్ దానికో అభ్యుదయపు ముసుగు

ఇంత తేలిక కాదు ఒక వ్యక్తికి ఉద్యోగాన్ని కల్పించి ఇచ్చి ఆ సంసారాన్ని నిలబెట్టటం

అందుకే సూర్యానికి ఉద్యోగం రాలేదు

చెయ్యి వెనక్కి తిప్పి నుదుటికి పట్టిన చెమటను తుడుచుకుంటూ తల తిప్పి చూసింది విశాలాక్షి

అదేమిట్రా? అలాగే నిలబడిపోయి కొత్తగా చూస్తున్నావు? అన్నదామె చిరునవ్వుతో

ఏం లేదమ్మా '' తడబడుతూ అన్నాడు సూర్యం

* * * *

ఎన్ జి ఓ లు స్ట్రైక్ చేస్తున్నారు

పోడితే! మీరు సమ్మె చేస్తే మేం




బెదురుతామనా? మీ స్థానాల్లో నిరుద్యోగ పట్టభద్రుల్ని నియమిస్తాం చావండి అన్నారు ప్రభుత్వంవారు ఉత్సాహంగా అప్పుడే అక్కడక్కడ కొందర్ని నియమించేశారు కూడా

సూర్యానికి ఉద్యోగం దొరికింది

నిజం! నిజంగానా సూర్యం! నిజమేనా'? సంభ్రమంగా అడిగింది విశాలాక్షి

నిజమేనమ్మా మ్లానమైన మొహంతో అన్నాడు సూర్యం

జీతమెంత?

రోజుకు ఇరవై రూపాయలు

అదేమిటి రోజు కూలీలాగా? నెలకింత జీతమని కాదా?

కాదు రోజు కూలీనే '

నాకర్థం కావటల్లేదు రా

అంతేనమ్మా నెల జీతం ఎలా ఇస్తారు? ఈ ఉద్యోగం కనీసం ఓ నెల రోజులన్నా ఉంటుందనే గ్యారంటీ ఏం లేదుగా?

అంటే?

స్ట్రైక్ చేస్తున్న కొందరు ఎన్ జి ఓ ల స్థానంలో నాలాంటి కొందర్ని నియమించారు వాళ్ళ స్ట్రైక్ కాలాఫ్ అవగానే మమ్మల్ని పీకేస్తారు అది రెండు రోజుల్లో జరగొచ్చు పది రోజుల్లో జరగొచ్చు లేదా ఇంకొన్నాళ్ళు పట్టొచ్చు అందుకే మమ్మల్ని రోజు కూలీ పద్ధతిలో తీసుకున్నారు అవసరాన్ని బట్టి ఎంత రేటు ఇస్తామన్నా చచ్చినట్లు ఒప్పుకుంటాం మేము

దినదినగండంగా ఈ ఎన్ జి ఓ ల సమ్మె గొడవ ఎంతకీ పరిష్కారం కాకూడదు ప్రభుత్వం వాళ్ళ కోరికల్ని మన్నించకూడదు ప్రభుత్వానికీ వాళ్ళకీ మధ్య ఏర్పడ్డ బిగింపు అలాగే కొనసాగాలి అని వెయ్యి దేముళ్ళకి మొక్కుకుంటూ ఈ ఉద్యోగాలలో తాత్కాలికంగా కొనసాగుతూ ఉంటాం మేము వాళ్ళు తిరిగి తమ తమ ఉద్యోగాలలో చేరగానే వాళ్ళని తిట్టుకుంటూ శాపనార్థాలు పెట్టుకుంటూ మొహం వేలాడేసుకొని మేం బయటకొచ్చేస్తాం''

ఇదన్యాయం కాదురా సూర్యం? ఇలా నిరుద్యోగుల అవసరం మీద దెబ్బకొట్టి వాళ్ళ జీవితాలతో చెలగాటాలాడడం

ఇది అన్యాయం కాదూ? అని ప్రశ్నించటం మానెయ్యాలమ్మా మనం ఎందుకంటే దీనికి జవాబు చెప్పేంత తీరిక ఓపిక ఎవరికీ లేదిప్పుడు ఆ రోజు నాన్న విషయంలో కూడా ఇలాగే ఆక్రోశించావు నువ్వు

ఈ రోజు నా విషయంలోనూ అంతే

ఇది శేష ప్రశ్న!

దీనికి జవాబు లేదు

దీనికి సరయిన జవాబు దొరికిననాడు ఈ వ్యవస్థ ఇలా ఉండదు

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**FIRST & FOREMOST CHOICE OF TELUGU READERS FOR OVER 81 YEARS NOW.**

Presents

# సూపర్ హీరో

By

మన్నెం శారద





తెరపై అతను యావదాంధ్రుల హృదయ విజేత. కానీ తెర వెనుక అతను జీవితంలో పడ్డ ఘర్షణలూ, పోరాటాలూ తెలుసుకోవాలంటే...

"సూపర్ హీరో" అంతరంగాన్ని చదవండి!

త్వరలో విడుదల!

# వైద్యో నారాయణో హరి!

గౌతమ్


















# పాపం మరో మార్లిన్ మన్రో!

'మోడల్ గర్ల్' గా పేరు తెచ్చుకొని మార్లిన్ మన్రో అబిమానుల బెదిరింపులకు బయపడి తన నిండు నూరేళ్ల జీవితాన్ని మొగ్గలోనే తుంచేసుకున్నది అందాల అపరంజి కే కెన్స్

సినిమాల్లో ఎక్స్ట్రా వేషాల కోసం వెంపర్లాడి నిర్మాతలను తన అందంతో ఆకర్షించి సినిమా చాన్సులు సంపాదించి ఆనక తారాపథంలో అత్యుత్తమ తారయై అంతులేని వ్యధలలో చిక్కుకున్నది అందాల మన్రో ఆ తర్వాత బ్రతకలేక ఆత్మహత్య చేసుకున్న సెక్సీ తార మార్లిన్ మన్రో అడుగు జాడల్లోనే నడిచిన యీ మిమిక్రీ తారను అందరూ మన్రోతో పోల్చుతుంటే సంబరపడి తానే మన్రోనని అనుకుంటుండేదట

మన్రోకిలాగే అందంగా వుండాలని గొప్ప నటి కావాలని కలలు కనేది ఈ ఇంగ్లండ్ అమ్మాయి కలలు కనట మేమిటి తూ చా తప్పకుండా ఆచరణలో పెట్టేదట

గోదుమ రంగులోవున్న తన తల వెంట్రుకలను ఒకరోజు కాల్చుకున్నదట కూడా మన్రో జుట్టు మాదిరి వుండాలని ఇదేం ఆనందమంటారేమో! మరి అందరూ తనను మార్లిన్‌తో పోలుస్తుంటే భూమ్మీద నిలుస్తుందా?

## అద్దంలో "తానే మన్రో"

మన్రో హావభావాలను గంటల తరబడి అద్దం ముందు కూర్చుని ప్రాక్టీసు చేసేదట అనుకరిస్తుండేదట కెన్స్

మన్రో వక్షోజాలు ఎంత ఎత్తు వున్నాయో అదేమాదిరి తాను కూడా వుంచుకోవాలని శస్త్ర చికిత్స కూడా చేయించుకున్నదట ఈ చికిత్స కోసం తన బ్యాంకు ఖాతా వున్న బ్యాంకు మేనేజరునుంచి రుణం కూడా పొందింది కుమారి కెన్స్

## మన్రో 'డూప్'

అనేక వ్యాపార ప్రకటనల్లో మన్రోకు బదులుగా మోడల్‌గా కూడా వ్యవహరించేది! మన్రో మాదిరి దిగంబరంగా పోజు పెట్టి ఫొటో కూడా తీయించుకుందట మేకప్ కోసమే గంటన్నరపైగా కేటాయించేది ఒక సినిమా కోసం తానిచ్చిన పోజుతో అబిమానుల సంఖ్య పెరిగిపోయిందట కెన్స్‌కు దానితో ప్రతి రోజు తెల్లవారి లేచేసరికి తన యింటి గుమ్మం ముందు అబిమానులు పంపిన గులాబీలు ఎదురు చూస్తుండేవట మార్లిన్‌కు యిష్టమైన గులాబీ పూలు తన యింటి ముందు దర్శనం యివ్వడంతో తనను కూడా వారు మన్రోలా అబిమానిస్తున్నారని సంబరపడిపోయేదట

కాని ఈ ఆనందం ఎంతోకాలం నిలవలేదు కొన్నాళ్ల తర్వాత ఒక సందేశంతో పుష్పగుచ్ఛం ఒకటి వాకిలి ముందు దర్శన మిచ్చిందట

ప్రపంచంలో మార్లిన్ మన్రో ఒక్కతే మరో మన్రో లేదు దయచేసి ఆమె ఆత్మని శాంతికి దూరం చేయకండి మన్రోలా నటించటానికి ప్రయత్నించకండి అంటూ ఆ సందేశం తెలియజేసిందట మన్రోను చులకన చేస్తున్నావంటూ మరోరోజు యింకో బెదిరింపు లేఖ అందింది కెన్స్‌కు

రోజూ గులాబీలు పంపి తనను ఆదరిస్తూ, అబిమానిస్తున్నారనుకున్న వారే యిలాంటి బెదిరింపులు పంపటంతో కెన్స్ మనోవ్యధకు గురైంది మన్రో మార్గంలో నడుస్తున్న తనకు బ్రహ్మరథం పడతారనుకున్న అబిమానులే ఈ విధంగా వ్యతిరేకత తెలియజేయటం కెన్స్‌కు అశనిపాతమైంది

## డబ్బు ఒక్కటే చాలదు

ఈ తరుణంలోనే తల్లి క్యాన్సర్‌తో కన్ను మూయటం యిక తనను అబిమానించే వారే కరువయ్యారన్న బాధ, మన్రోలా నటిస్తున్న తనకు బద్రత లేదన్న విషయం- యివన్నీ కెన్స్‌కు ప్రాణ సంకటంగా తోచాయి

దీనికి చావు కంటే పరిష్కార మార్గం లేదనుకుంది కాబోలు ఒకనాటి కాళరాత్రి- అదే కెన్స్ తుది రాత్రి- నిద్ర మాత్రలు సేవించి తన జీవితాన్ని ముగించేసుకుంది మన్రోలానే పడక గదిలో దిగంబరంగా పడి వున్న కెన్స్ మృతదేహం 'చనిపోతూ కూడా మన్రోనే అనుకరించాను చూశావా' అంటూ ఆమె 77 ఏళ్ల మేనమామను వెక్కిరిస్తూ కనబడిందట

మన్రోగా నటించకుండా తనకంటూ ఒక వ్యక్తిత్వాన్ని గుర్తింపును నిలుపుకుంటూ కొన్నాళ్ళు మోడల్‌గానే వుండి వుంటే ఏ నిర్మాతల కళ్లలో నోపడి సినిమా ఛాన్సులు కొట్టే అవకాశాన్ని చేజేతులా పోగొట్టుకున్న కెన్స్ కథ విని జాలి పడతారో ఏవగించుకుంటారో పాఠకులే తేల్చుకోవాలి మరి వెలుగులోకి రాని యిలాంటి కథలు ఎన్నో ఎన్నెన్నో!

(తిలక్)

# జనరేషన్ స్వాప్

హైదరాబాదు వెళ్లే సూపర్‌డీలక్స్ బస్ వేగంగా పోతోంది. విండోసీటు దగ్గర సామాను సర్దుకుంటున్న దివ్య కండక్టరు మాటలకు తలెత్తింది "బెజవాడలో ఎక్కారు కదూ, మీరు రిజర్వేషన్ చేయించారా? ఇవి రిజర్వుడు సీట్లు" అంటున్న కండక్టరుతో "రిజర్వేషన్ లేదండి. రేపు ఇంటర్వ్యూకి ఎలాగైనా హైదరాబాద్ చేరాలి. కొంచెం అడ్జస్ట్ చెయ్యండి, ప్లీజ్" బతిమాలింది దివ్య.

"ఫర్వాలేదమ్మా, ఇటురండి" అంటూ వేరే సీటు చూపించాడు కండక్టరు "హాయ్ దివ్యా" అంటూ సామాను అందుకున్న ప్రభను చూసి ఒక్కక్షణం ఆశ్చర్యపోయి సీట్లో సర్దుకుంటూ "ఎన్నాళ్లయిందే నిన్నుచూసి, ఎప్పుడో రెండేళ్ల నాడు నీ పెళ్లి తర్వాత మళ్లీ ఇదే సీటుమార్చి కండక్టరు మంచిపనే చేశాడు ఏమిటి విశేషాలు? మద్రాసులోనే ఉంటున్నావా? నీ సంసారం ఎలా ఉంది? జాబ్ చేస్తున్నావా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించేసింది దివ్య. "ఉండవోయ్‌బాబూ, ఇన్ని ప్రశ్నలతో గుక్కతిరగద్దూ? ఇన్నాళ్లూ మద్రాసే. వచ్చేనెలలో తనకి హైదరాబాదు ట్రాన్స్‌ఫర్ అవుతోంది నేనూ జాబ్ చేస్తున్నాను నువ్వు ఎలాగూ అడుగుతావు కనుక చెప్తున్నాను, మేమింకా పిల్లల గురించి ఆలోచించలేదు" అంటూ ప్రభ తనేమీ తక్కువ తినకుండా "మరి నీ సంగతేమిటి? ఆశ్రమం మార్చావాలేదా?" అడగాల్సింది అడిగేసింది "నీ అంత అదృష్టం ఉండద్దూ అందరికీ! నువ్వేమో పెళ్లికి ముందే డ్యూయెట్లు పాడేశావు ఒక్కసారే సంసారం. ఉద్యోగం సంపాదించుకున్న లక్కీ ఫెలోవి" అంది దివ్య "నీవంటి బ్రైట్ కెరీర్ ఉంటే నేనూ ఏదో సాధించాలని ఆశ పడే దాన్ని నాలాటి వాళ్లకి సామాన్య జీవితాలే మిగులుతాయి అలా అని నాకేవో బోలెడు బాధలున్నాయనుకోకు. హైదరాబాదు ఏదైనా పనిమీద ప్రయాణమా?" అంటున్న ప్రభను "పెళ్లైనదానివి ఒక్కర్తివీ బయల్దేరావు, నీ సంగతి చెప్పుముందు" అని ఎదురు ప్రశ్న వేసింది దివ్య "అబ్బ! నీ మొండితనం పోలేదే, నాచేత ముందు చెప్పించాలనేగా. ఎప్పుడూ గెలుపు నీదేలే సరే విను, నా ఉద్యోగానికి ట్రాన్స్‌ఫర్లు లేవు. రిజైన్‌చేసి హైదరాబాదులో ఇంకోటి వెతుక్కోమని మావారి ఆర్డర్స్ తప్పేదేముందని ఆ ప్రయత్నంలోనే బయలుదేరి రెండురోజులు అమ్మను చూసి, హైదరాబాదు వెళ్తున్నా"నన్నది ప్రభ

"అంతా ఆయనిష్టమేనేమిటే, పోనీ మద్రాసులో ఇంకోజాబ్ ఆయనే వెతుక్కోవచ్చుగా" పాయింటులేవతీసింది దివ్య "అనుకోవడం వరకేగాని జీవితంలో అలాంటి పట్టుదలలు కుదరవే అయినా ఇది నా అనుభవం నువ్వైనా నీమాట సాగించుకో" బరువుగా అంది ప్రభ "ఏం సాగించుకోటమో నా మొహం, నాకూ లోకం తెలుస్తోంది ఒకరికి చెప్పటం తేలికే." నిట్టూర్చింది దివ్య. "పెళ్లి కాకుండానే అంత నిరాశలో కూరుకుపోయావేమిటి?" అడిగింది ప్రభ "పెళ్లవుతేగాని లోకజ్ఞానం రాకూడదా?" ఎదురు ప్రశ్న వేసింది దివ్య. "ఏదో ఉంది కొంపతీసి ప్రేమలో పడ్డావేమిటి?" వేళాకోళమాడింది ప్రభ దివ్య "అదేంలేదు, పెళ్లి చేసుకోమని గొడవ చేస్తున్నారు మావాళ్లు ఈ మధ్యనే పెళ్లిచూపులయ్యాయి" అంటుండగా బస్సు



# పి. ప్రశాంతలక్ష్మి

కుదుపులకి తన ఎయిర్‌బాగ్ కిందపడటంతో మాటలు ఆపివేసి నిలబడి, బాగ్ మళ్లీ పెట్టింది బస్సులో చాల మంది నిద్రలో జోగుతున్నారు. తన వెనక సీట్లో ఒక పెద్ద మనిషి సిగార్ కాలుస్తున్నాడు "ఈ గతుకుల రోడ్లమీద సూపర్ బంపర్లుగా తయారయ్యాయి బస్సులు" అంటూ సర్దుక్కూచుంది దివ్య

"ఈసారికి మాత్రం రోడ్లనేమీ అనకు సమయానికి బాగ్ పడటం శుభశకునం ఈ సంబంధం నీకు కుదిరి తీరుతుందే ఆ కానీ ఏదో చెప్తున్నా"నంది ప్రభ "నీ సూపర్ స్టిషన్స్ పోలేదన్నమాట



ఆ పెళ్లిచూపులన్నాను కదూ తనపేరు శరత్ హైదరాబాదులో ఉద్యోగం" అంటూ వివరాలు చెప్పి "తనొక్కడే వచ్చాడు చూట్టానికి. తనకైతే నచ్చానుట కాని. " అంటున్న దివ్యని "ఏం? నీకు నచ్చలేదా?" అంది ప్రభ "అదే ఏమీ తేల్చుకోలేకపోతున్నాను నువ్వు చేసుకోమంటే ఒప్పుకుంటాను!" అంది దివ్య ప్రభ "అమ్మదొంగా! నామీదకి నెట్టున్నావా? మరైతే ఏమిటాలస్యం? శుభస్య శీఘ్రం అన్నా" రంది "అంత సింపుల్ కాదమ్మాయ్. తనకేమీ పట్టింపులు లేవుట కాని . వాళ్ల నాన్న కట్నం అడగవచ్చుట పోనీ నాకు ఉద్యోగమైనా ఉంటే కట్నం లేకుండా ఏదో సర్దిచెపుతానన్నాడతను ఈ ప్రయాణం ఉద్యోగం కోసమే రేపు హైదరాబాదులో ఇంటర్వ్యూ" అంది దివ్య "ఇలా ఒంటరిగా బయలుదేరావంటేనే తెలుస్తోంది నువ్వతన్ని ఎంతగా లైక్ చేస్తున్నావో" అంది ప్రభ "అది సరే గాని, నా IAS స్టడీస్ తగలడతాయి ఈ ఉద్యోగాలవేటతో ఏం చెయ్యాలో తోచటంలేదు నువ్వేమంటా"వని సమస్య బయట పెట్టింది దివ్య "మీ నాన్నగారేమన్నారు?" అడిగింది ప్రభ "మా ఫాదర్‌పోయి ఏడాది కావస్తోంది" దివ్య అంటుండగా ప్రభ అందుకుని "సో సారీ దివ్యా ఆడపిల్లల పరిస్థితి చూశావా? ఒకప్పుడు ఎంత స్నేహంగా ఉన్నా పెళ్లిళ్లతో పూర్తిగా సంబంధాలు తెగిపోతాయి ఒకరి విషయం ఒకరికి తెలీనే తెలీదు ఇదంతా మగాళ్ల ప్రపంచం మరి మీ అన్నయ్య లేమంటారు?" అడిగింది "చెప్పనే చెప్పావుగా ఇది మగాళ్ల ప్రపంచమని అన్నయ్యలిద్దరూ ఒకే ఇంట్లో ఉంటున్నా అస్తివంచేసుకున్నారు కొన్ని నెలల నుంచి వదినలు ధోరణి మార్చి ఇన్‌డైరెక్టుగా అంటున్నారు నేను వాళ్లకి బరువైనట్టు వెనకాల అన్నయ్యల వత్తాసుందని తెలియక పోలేదు "IAS నీవల్లవుతుందా? ఏదైనా ఉద్యోగం చూసుకోపోనీ, పోస్టుగ్రాడ్యుయేట్ వయ్యావుగా" అంటూ అనాల్సిన మాట మెత్తగా అనేశాడన్నయ్య ఇతనేమో పెళ్లిచూపుల్లోనే కాక,

రెండురోజుల్లో మరో రెండుసార్లు కలసి మాట్లాడాడు ఈ జాబ్‌కి అప్లై చేయమని తనే చెప్పాడు. పోనీ ఐ ఎ యస్ కోసం తనని వదులుకుందామంటే, తీరా తర్వాత అన్నయ్యలధోరణి విషమిస్తే, చివరకి ఏ దానయ్యనో చేసుకోక తప్పదేమోనని భయంగా ఉంది ఈ ఉద్యోగం వస్తే బావుణ్ణు" అంటూ చెప్పుకుపోతున్న దివ్యను "ఎక్కడే నీ ఇంటర్వ్యూ? అడిగిన ప్రభ, దివ్య వివరాలు చెప్పగానే "మైగాడ్" అనేసింది "అదేమిటే? ఆ కంపెనీ మంచిదికాదా? నీకు ముందే తెలుసేమిటి?" అంటూ దివ్య కంగారుపడితే "కాకపోయినా బాగుండేది తిరిగి వెళ్లమని చెప్పేదాన్ని - చిన్నప్పట్నించీ ప్రాణ స్నేహితులమైన మనిద్దరికీ ఇలాంటి సినిమాటిక్ సిట్యుయేషన్ ఎదురైందేమిటి? నీదగ్గర దాపరికమెందుకు? నేనూ ఆ ఇంటర్వ్యూకే వస్తున్నా"నని సంగతి బయట పెట్టింది ప్రభ స్నేహితురాల్లిద్దరూ ఒకరికోసం ఒకరు త్యాగం చెయ్యాలనుకున్నారు కాసేపు. కాని చివరకి "ఇలా మళ్లీ త్యాగాల్లోకూడా పోటీపడితే మూడో వాళ్లెవరో తన్నుకుపోతారు రాసిపెట్టింది జరగక మాన"దనుకున్నారు "చూశావా నాది సూపర్ స్టిషనన్నావు ఇప్పుడిద్దరం 'విధి' అనుకుంటున్నాం" అంది ప్రభ "నిజమేనే" అంది దివ్య నీరసంగా

* * * *

ఇంటర్వ్యూ కమిటీ ఛైర్మన్‌ను చూసి ఆశ్చర్యపడింది దివ్య రాత్రి బస్సులో తన వెనుక సీటులో సిగార్ కాలుస్తూ కనిపించిన వ్యక్తే ఇంటర్వ్యూ బాగానే జరిగింది, తను అన్నిటికీ జవాబు చెప్పింది ప్రభ ఇంటర్వ్యూ ఓ మాదిరిగా ఉంది అది ప్రైవేటు కంపెనీ కాబట్టి, ఎవరు సెలక్టు అయిందీ వెంటనే చెప్పేస్తారనీ, సెలక్టు అయినవాళ్లు వెంటనే జాయిన్ అవటం మంచిదనీ, కాని ఛైర్మన్‌గారు వేరే మీటింగుకి వెళ్లవలసి ఉన్నందున సాయంత్రందాకా రకూ పట్టచ్చునీ, ఇష్టమైన వాళ్లు రిజల్టు

## కొత్త శీర్షిక

# ఆంధ్రసచిత్రవారపత్రిక

"న్యాయపీఠం" శీర్షిక క్రింద పాఠకుల సందేహాలకు సమాధానాలు ప్రారంభించ దలిచాము !

మీ ప్రశ్నలు క్లుప్తంగా - సూటిగా - సాధ్యమైనంత చిన్నవిగా వుండాలి. ఈ క్రింది కూపన్ నింపి మీ ప్రశ్నకి జతచేయాలి. ప్రశ్న క్రింద కూడా మీ పేరు, వూరిపేరూ రాయాలి- మీ పూర్తి చిరునామా, పిన్ కోడ్ వెయ్యాలి. జవాబులు ఇవ్వదగిన ప్రశ్నలకు ప్రముఖ న్యాయవాది - న్యాయశాస్త్ర విషయాల గ్రంథకర్త అయిన - శ్రీ బి. బి. రావు - జవాబులు ఇస్తారు.

## న్యాయపీఠం - ప్రశ్నోత్తరాలు

ప్రశ్న పంపినవారి పేరు........................................ .........................

చిరునామా.. ......................... .................... ...

- సం.

---

చూసుకుని వెళ్లచ్చని తెలిసింది చాల మంది వెళ్లిపోయారు కాని, దివ్య, ప్రభ కబుర్లు చెప్పుకుంటూ ఉండిపోయారు. చివరకి ఛైర్మన్ గారిద్దరినీ ఒకేసారి రమ్మన్నారని కబురొచ్చింది "చూడండమ్మా దివ్యగారూ, రాత్రి మీతో ప్రయాణం చేసిన నన్ను మీరు గుర్తించే ఉంటారు. బస్సులో మీ బాగ్ కిందపడినప్పుడు, నా కాన్ సెన్ట్రేషన్ చెదిరి, మీ మాటలు వింటూ ఉండిపోయాను చేస్తున్నది తప్పేఅని తెలిసినా ఏ విధంగా తెలిసినా, ఉన్న ఇన్ ఫర్మేషన్ సద్వినియోగం చేస్తే, కమిటీ ఛైర్మన్ గా నేను ఈ కంపెనీ కి న్యాయం చెయ్యలేను మెరిటూ, ఏప్టిట్యూడ్ రెండూ ఈ జాబ్ కి చాల ముఖ్యం ఎంత మెరిటున్నా, ఏప్టిట్యూడ్ లేక, పరిస్థితుల ఒత్తిడివల్ల ఈ ఉద్యోగం కావాలనుకున్న మీకన్న, మెరిట్ కొంచెం తక్కువైనా, ప్రభగారి జాబ్ మీద ఇంటరెస్టు తీసుకుంటారని ఆశిస్తూ వారినే సెలక్టుచేశా" నంటూ ప్రభను కంగ్రాట్యులేట్ చేశాడు ఛైర్మన్ ఇద్దరూ తిరిగి వెళ్లబోతుంటే "దివ్యగారూ, మీకున్న మెరిట్ కిటువంటి ఉద్యోగంతో సరిపెట్టుకోకూడదు ఛైర్మన్ గా ఏంచేసినా, నువ్వెంతో పైకి రావాలని నేను పర్సనల్ గా కోరుకుంటాను. నా ఆశీస్సులు నీ కెప్పుడూ ఉంటాయి"అంటూ ఆయన ఉన్నట్టుండి ఏక వచనం ప్రయోగించినా, అప్పటికే ఆశాభంగం కలిగిన దివ్య ఈ ఓదార్పుగానీ, ఏకవచనంగానీ పట్టించుకోలేదు.

మామూలుగా ప్రభను కంగ్రాట్యులేట్ చేసి గుడ్ బై చెప్పి, తిరుగు ప్రయాణంలో బస్సులో కూర్చుని ఆలోచిస్తోంది దివ్య- ఈ ఉద్యోగం రాలేదు కనుక శరత్ ని మర్చిపోవాలి- మళ్లీ ఇంట్లో సాధింపులు తన జీవితం ఏంకానున్నదో ? అదేమిటి ప్రభకోసం త్యాగం చెయ్యటానికి తయారైన తనిలా బాధెందుకు పడుతోంది ?తన త్యాగం అవసరంలేకుండానే ప్రభ సాధించుకుందని తనకు అసూయా? కాదు ఇరవైనాలుగు గంటల క్రితం ఈ ప్రభ ఎక్కడుందో తనకు తెలీదు. రెండేళ్లనించీ విడిపోయి, ఎవరిబతుకులు వాళ్లు బ్రతుకుతూ, ఒకరినొకరు మర్చిపోయారు కూడా ఎవరి అవసరం వారికెక్కువ అంటే తన 'త్యాగం' మనస్ఫూర్తిగా అన్నది కాదా ? తీరా ప్రభ "థాంక్యూ వెరీమచ్" అంటే తనేంచేసేది? తన శరత్ ని ఈ ప్రభ కోసం వదులుకొనేదా? ఈ త్యాగాలన్నీ పైపై మాటలు ఎవరిబాధలు వారివి, ఎవరిజీవితం వారిదన్నప్పుడు స్వార్థం ఉండనే ఉంటుంది అసలు ప్రభకి ఈ ఛైర్మన్ ముందే తెలుసేమో ఏ రికమెండేషన్ కేసో ఏమో. . పైగా వెనకసీటు చూసుకుని మరీ కూర్చున్నాడు ఈయనమాత్రం తక్కువ తిన్నాడా? బాగ్ కిందపడినప్పుడు తన కాన్ సెన్ట్రేషన్ చెదిరిందనీ అప్పట్నించీ మాటలు విన్నాననీ ఎలాంటి అబద్ధమాడాడు? మరి అంతగా విన్నవాడు, నా జీవితం నాశనం అవుతోందని తెలిసికూడా, ఓ పక్క నా మెరిట్ ఒప్పుకుంటూనే జంకూ గొంకూ లేకుండా మోసం చేశాడే? ఉండ బట్టలేక తను చేసిన పాడుపనికో కుంటిసాకు వెతుక్కున్నాడు పైగా సినిమా డైలాగులు చెప్పి ఆశీస్సులంటూ ఏకవచనం కూడా వాడాడు అయినా తనూరుకుందేమిటి? పోయిన ఛాన్సు పోనే పోయింది నాలుగూ దులిపెయ్యాల్సింది- అనుకుంటూ దివ్య బెజవాడ చేరింది

ఆదివారం ఉదయం ఉసూరుమంటూ ఇంటికి చేరిన దివ్య, వదినలిద్దరూ చూపించే ఆప్యాయతకు విస్తుపోయింది. "మీ సంబంధం మాకు నచ్చింది. వెంటనే వచ్చి మిగతా విషయాలు మాట్లాడుకోం" డని కిందటి సాయంత్రం వచ్చిన టెలిగ్రాముచూసి, సెలవు కూడా కలిసొచ్చిందని హైదరాబాదు వెళ్తానన్నాడుట పెద్దన్నయ్య "అ ఏముంది? ఏదో ఈ కుర్రాడు కొంచెం మోడరన్ గా ఉండాలనుకున్నా, తండ్రి మాత్రం కట్నం కావల్సిందేనని ఉంటాడు వెంటనే మనం ఎంత వరకూ తూగగలమో తేల్చుకుంటే మిగతా సంబంధాలు చూసుకోవచ్చని పిలిచి ఉంటా"రన్నాడుట చిన్నన్నయ్య "అయినా మాట్లాడిరావటం మన డ్యూటీ లేకపోతే లోకం నన్నే అంటుం"దని కిందటిరాత్రే పెద్దన్నయ్య బయలుదేరాడుట ఈ హడావుడిలో ఉద్యోగమేమయిందని ఎవరూ పట్టించుకోక పోవటంతో, రెండు రోజులైనా హాయిగా గడవచ్చని, దివ్యకూడా ఆ విషయం ఎత్తలేదు

సోమవారం తన పేరున వచ్చిన కవరు చూసుకొని, ఏ రిగ్రెట్ లెటరో మహా అయితే దారి ఖర్చులకి చెక్కో అయి ఉంటుందని అన్యమనస్కంగా ఓపెన్ చేసిన

దివ్య, అలాంటిదేమీ కాకుండా, పరిచయం లేని దస్తూరిచూసి ఆశ్చర్యంతో చదువుకుంది-

"అమ్మా దివ్యా, నువ్వు అవునంటే నిన్నిలా ఏకవచనంతో పిలిచే అధికారం కావాలనుకుంటూ ఈ ఉత్తరం రాస్తున్నాను నేను శరత్ తండ్రి రామారావుని బస్సులో నువ్వు నా ముందు సీట్లో కూర్చోవటం, అక్కడే మీ ఫ్రెండు ప్రభగారుండటం, ఆ విధంగా నువ్వు నీ పర్సనల్ విషయాలు మాట్లాడటం యాదృచ్ఛికంగా జరిగాయి ఏవో మీటింగులవల్ల బిజీగా ఉండిపోయి, ఆరోజు శరత్‌తోపాటు మీ ఇంటికి రాలేక నేను పోగొట్టుకుంటున్నదేమిటో మీ మాటలవల్ల కొంత తెలిసింది నిన్ను గురించి తెలుసుకునే ఇంకో అవకాశం కలిగినందుకు అదృష్టాన్ని అభినందించి మీ మాటలు వింటూ ఉండిపోయాను

నేను కట్నం కావాలంటాననుకున్నాడా మా ప్రబుద్ధుడు? పైగా నిన్నీ ఉద్యోగం సంపాదించమన్నాడా? మీ ఇంటికి వెళ్లి వచ్చిన తర్వాత ఈ విషయం నాతో ఎప్పుడూ మాట్లాడలేదు శరత్. ఒక విధంగా చెప్పాలంటే నా పనుల్లో మునిగి ఉండే నేను తనకి అవకాశమే ఇవ్వలేదు. ఈ టాపిక్ నాతో అసలు మాట్లాడకుండా, ఒక్కరోజు పరిచయం కలిగిన నీతో శరత్ చెప్పాడంటే, దీన్నే కాబోలు జనరేషన్ గ్యాప్ అంటారు

ఇలాంటి ఉద్యోగాల ఇంటర్వ్యూలు తీసుకోడానికి సాధారణంగా నా జూనియర్లే వెడుతుంటారు. కానీ నీ మాటలు విని తెలుసుకున్న నేను, ఈ అవకాశం పోగొట్టుకోవడం ఇష్టంలేక, నాకున్న మీటింగులన్నీ కాన్సిల్ చేసుకుని, ఆ కంపెనీ నాకు తెలిసినదే కావడంతో నిన్ను ఇంటర్వ్యూ చేసి ఇంకా తెలుసుకోవడంకోసం స్వయంగా ఛైర్మెన్ అవతారమెత్తాను ఇంటర్వ్యూలో నీ ప్రతిభ చూసిన నేను, ఈ జనరేషన్ గ్యాప్ వల్ల జరగబోతున్న అనర్థాన్ని నివారించాలంటే, స్వయంగా కల్పించుకొని మా శరత్‌తో ఫ్రాంక్‌గా మాట్లాడి ఒక నిర్ణయానికి రావాలనుకొన్నాను నిజానికి ఈ పని పూర్తి కావడంకోసమే ఇంటర్వ్యూ ఫలితాలు సాయంత్రం వరకూ ఆపాను నువ్వు కోరితే ఇలాంటి ఉద్యోగం నీకేరోజునైనా ఇప్పించగలను, అదేం గొప్పకాదు కాని అంతకన్న మంచి అవకాశం ఇచ్చి నీ జీవితంలో పెళ్లికీ, కెరీర్‌కీ ఏర్పడ్డ సంఘర్షణ తొలగించాలనే ఉద్దేశ్యంతో వెంటనే మీ అన్నయ్యకు టెలిగ్రాం పంపించి, నీకీ ఉత్తరం రాస్తున్నాను.

నే నెప్పుడూ నీవంటి ప్రతిభావంతురాలు నా కోడలు కావాలనే ఆశించాను. అయితే మీ అన్నలెవరూ ఇవ్వలేని కట్నం నువ్వివ్వాలి నీ I A S స్టడీస్ తప్పక కొనసాగుతాయనే వాగ్దానమే నాకు కావలసిన కట్నం. నిర్ణయం నీ చేతుల్లో ఉంది-
రామారావు"

"ఎన్ని అపార్థాలు జరిగిపోయాయి? నేను మాత్రం తక్కువ తిన్నానా?" అనుకుంది దివ్య. ●





## "కలియుగ విశ్వామిత్ర" (1990)

"పొలిటికల్ ఫాంటసీ మందాకిని మేనక. ఆగస్ట్ 9 నుంచి ఏకబిగిన పదిహేను రోజుల షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు కాంగ్రెస్(ఐ) నాయకుడు, కృష్ణ ప్రజాశక్తి అధ్యక్షుడు యు. సూర్యనారాయణబాబు. ఈయన శక్తి క్రియేషన్స్ బ్యానర్‌లో నిర్మించే "కలియుగ విశ్వామిత్ర(1990)"లో విజయచందర్, ప్రదీప్‌శక్తి, త్యాగరాజు, సారథి, మందాకిని ఆదిగాగలవారు పాల్గొంటున్నారు. ప్రదీప్‌శక్తి కథకుడు. రామ్ సంభాషణలు, ఘంటసాల విజయకుమార్ సంగీతం, పి. సి. శ్రీరామ్ ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, శ్యామ్ సంయుక్త దర్శకత్వం, వేణుగోపాల్ సహకార దర్శకత్వం, ఉమాశంకర్‌బాబు కూర్పుతో విజయచందర్, ప్రదీప్‌శక్తి దర్శకులు. "ఒక సర్వసాధారణ వ్యక్తి విశ్వామిత్రుడుగా అసాధారణ వ్యక్తి కావడానికి ఆశించి, సాగించే ప్రయత్నాలే చిత్ర ఇతివృత్తం" అని దర్శకులు తెలిపారు.



"కోకిల"లో
శోభన, రంగనాథ్





సినిమా... సినిమా...

## "ఇన్‌స్పెక్టర్ రుద్ర"

"నిజాయితీపరుడైన పోలీస్ ఆఫీసర్‌గా ఒక సరికొత్త కృష్ణను ఈ చిత్రంలో చూస్తారు" అన్నారు కె ఎస్ ఆర్. దాస్ ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కె నాగేంద్రమణి సమర్పించే కె. ఎస్ ఆర్ దాస్ ప్రొడక్షన్స్ "ఇన్‌స్పెక్టర్ రుద్ర"లో కృష్ణ, యమున, సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, చారుహాసన్, రంగనాథ్, ప్రసాద్‌బాబు, త్యాగరాజు, గుమ్మడి, అన్నపూర్ణ, ముచ్చెర్ల అరుణ, సాగరిక వగైరా నటవర్గం ఓంకార్ మాటలు, వేటూరి పాటలు, అమర్ సంగీతం, పి లక్ష్మణ్ ఛాయ, జగన్ సహకార దర్శకత్వం, బి. చలం శిల్పం, హోర్స్‌మన్‌బాబు సాహసాలు, ప్రభాకర్ ఉమాపతిరాజు ప్రొడక్షన్, డి. వెంకటరత్నం కూర్పుతో కె సుకుమార్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్

## వెంకటేష్ ద్విపాత్రాభినయం




"జూలై 23 నుండి 30 వరకు రెండో షెడ్యూల్ జరిగింది. ఆగస్ట్ 16-30, సెప్టెంబర్ 16-30 తర్వాత, అక్టోబర్ 16-30 చివరి షెడ్యూల్‌లో పాటలు చిత్రీకరింపబడతాయి. నవంబర్ విడుదల" అన్నారు ఎస్. ఎస్. రవిచంద్ర. ఈయన స్క్రీన్ ప్లే - దర్శకత్వంలో ఎం. కృష్ణశేఖర్ నిర్మించే శ్రీ రాఘవేంద్ర ఆర్ట్ పిక్చర్స్ చిత్రంలో వెంకటేశ్, గౌతమి, అమల, శారద, శరత్ బాబు, సత్యనారాయణ, దేవరాజ్, కోట శ్రీనివాసరావు ప్రభృత తారాగణం. పరుచూరి సోదరులు మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, ఎస్. గోపాల్ రెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, కె. రంగారావు-ధర్మరాజు సంయుక్త దర్శకత్వం, జి. శ్రీనివాస్-బి. ప్రసాద్ ప్రొడక్షన్స్, కె. శ్రీనివాసరావు సహకార దర్శకత్వం, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు, ఎం. మోహన్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

### "నేరం నాదికాదు"

"సుమన్ నిజజీవితంలో జరిగిన సంఘటనలతో సామీప్యమున్న కథ" అన్నారు ఎ.



వెంకటేష్, రాధ



"అగ్ని నక్షత్రం"లో కళ్యాణచక్రవర్తి, శోభన్ బాబు

కోదండరామిరెడ్డి ఈయన స్క్రీన్ ప్లే దర్శకత్వంలో ఎస్ కృష్ణారెడ్డి నిర్మించిన సూర్యతేజా మూవీస్ "నేరం నాదికాదు" చిత్రంలో సుమన్, రాధ, రజని, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, దేవదాస్ కనకాల, సుజాత, రజిత, చలపతిరావు, పి ఎల్ నారాయణ, చిట్టిబాబు నటించారు జి సత్యమూర్తి కథ మాటలు రాశారు వేటూరి గీతాలు,హంసలేఖ సంగీతం, శ్రీనివాసరాజు శిల్పం, తార నృత్యాలు, రాజు సాహసాలు, కె సదాశివరావు సంయుక్తదర్శకత్వం, ఎస్ సుధాకరరెడ్డి ఛాయ, బి సుందరరావు సి కరుణాకరరెడ్డి సహకార దర్శకత్వం, డి వెంకటరత్నం కూర్పుతో ఎం రామారావు ప్రొడక్షన్ కంట్రోలర్, ఎ మల్లికార్జునరావు అంజయ్యారాజు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ సమర్పణ ఎస్ భాస్కరరెడ్డి



"ముద్దుల మావయ్య" విజయోత్సవంలో ఊర్వశి శారద నుంచి షీల్డ్ అందుకుంటున్న విజయశాంతి, చిత్ర నిర్మాత ఎస్. గోపాల్ రెడ్డి.

# సినిమా

## "ప్రతాపరుద్రుడు"

"సంఘవిద్రోహాలను సమూలంగా నిర్మూలించి, అనాథలకు, అభాగ్యులకు, అశాంతులకు వెలుగును ప్రసాదించే ప్రతాపరుద్రుడి పాత్రలో కృష్ణ మరోసారి విజృంభించారు" అన్నారు దుర్గా నాగేశ్వరరావు. ఈయన స్క్రీన్ ప్లే-దర్శకత్వంలో ఆర్. వెంకటేశ్వరరెడ్డి నిర్మించే మురళి ప్రొడక్షన్స్ "ప్రతాపరుద్రుడు"లో కృష్ణ, రాధ, దగ్గుబాటి రాజా, సాగరిక, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, అల్లు రామలింగయ్య, నర్రా వెంకటేశ్వరరావు, జీవా, అభిలాష, లక్ష్మీప్రియ, అత్తిలి లక్ష్మి, రఘాన్సి, త్యాగరాజు, సాక్షి రంగారావు పాల్గొంటున్నారు. పి. చంద్రశేఖరరెడ్డి కథ, సత్యానంద్ మాటలు, చక్రవర్తి సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, భాస్కరరాజు శిల్పం, శివశంకర్ నృత్యాలు, త్యాగరాజు సాహసాలు, తమ్మా మాధవరెడ్డి సంయుక్త దర్శకత్వం, అంకిరెడ్డి కూర్పుతో మణి ప్రొడక్షన్ కంట్రోలర్.

## రాఘవేంద్రరావు-నాగార్జునల "అగ్ని" ఆగస్ట్‌లో

"ప్రథమార్థం వినోదాత్మకంగా, ద్వితీయార్థం ఉత్తేజభరితమైన సెంటిమెంట్స్‌తో అత్యంత ఆసక్తికరంగా సాగుతుంది" అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వంలో ఛాయాగ్రాహకుడు కె. ఎస్. ప్రకాష్ నిర్మించిన సౌభాగ్యఫిలిమ్స్ "అగ్ని" చిత్రంలో నాగార్జున, శాంతిప్రియ, వాణిశ్రీ, మోహన్ బాబు, రావు గోపాలరావు, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, బ్రహ్మానందం, బాలాజీ, నర్రా పాత్రధారులు. సత్యమూర్తి రచన, హంసలేఖ సంగీతం, శ్రీనివాసరాజు శిల్పం, తార నృత్యాలు, విజయన్ సాహసాలు, వి. ఎస్. రెడ్డి-సునీల్ వర్మ సంయుక్త దర్శకత్వం, రామమోహన్‌రావు-బి. సత్యం ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు నిర్వహించారు.

## తొటినేని ప్రసాద్, సుమన్‌ల వీరబ్రహ్మేంద్ర కంబైన్స్ చిత్రం

"జైలుకి వెళ్ళి, జాలు తిండి తినాలనే కోరికను సదా వెల్లడిచేసే వెరైటీపాత్రధారి సుమన్" అన్నారు తొటినేని ప్రసాద్. ఈయన స్క్రీన్ ప్లే-దర్శకత్వంలో బి. వి. శేఖరరెడ్డి, టి. స్వరూప నిర్మించే వీరబ్రహ్మేంద్ర కంబైన్స్ తొలి చిత్రంలో రాధ నాయిక. వాణిశ్రీ, మురళీమోహన్, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, ప్రదీప్‌శక్తి, బ్రహ్మానందం, మాడా, జనకరాజ్, శ్రీలక్ష్మి తదితర నటవర్గం. రాజ్ ఇలంగో, సాయినాథ్-మధు, రాజ్-కోటి, వేటూరి, కబీర్‌లాల్, కుర్రా ప్రభాకర్, కొండపనేని రామలింగేశ్వరరావు, ఎస్. మహేశ్వరరావు, గంగాధర్, అట్లూరి నాగేశ్వరరావు ప్రభృత సాంకేతికవర్గంతో నిర్వహణ: ఎస్. వి. వి. ఆర్. సత్యనారాయణ.

"మనిషి"లో ఒకే నటులతో రెండు దృశ్యాలు.



## సెప్టెంబర్‌లో "స్వరకల్పన"

"రెండు కుటుంబాలమధ్య ద్వేషాలు, రోషాలు, మత్సరాలు పొడసూపి, కలతలు రేగి దూరం కాగా, ఆ కుటుంబాలకు చెందిన నాయకా నాయికలు అపశ్రుతులను సరిచేసి, ఆ కుటుంబాల మధ్య సుస్వరాలను పలికించడం ప్రధాన ఇతివృత్తం ఉభయగోదావరి జిల్లాలకు చెందిన అలంపురం, కోనాల, రేలంగి, మండపాక, పట్టిసీమ, సత్యపాడు, ముద్దాపురం, బొబ్బర్లంక తదితర ప్రాంతాలలో షూటింగ్ ముగించాం" అన్నారు పూర్ణోదయ ఆర్ట్ క్రియేషన్స్ ఏడిద నాగేశ్వరరావు ఈయన తాజా చిత్రం "స్వరకల్పన"లో శ్రీరామ్, సీత, జె వి సోమయాజులు, కోట శ్రీనివాసరావు, రాళ్ళపల్లి, తనికెళ్ళభరణి, విలేశ్వరం రంగా, కంభంపాటి సుబ్రహ్మణ్యం, అన్నపూర్ణ, డబ్బింగ్ జానకి, భాగ్య, శైలజ పాత్రధారులు తనికెళ్ళభరణి సంభాషణలే కొత్త దర్శకునితో కలిసి స్క్రీన్ ప్లే రాశారు సీతారామశాస్త్రి, జొన్నవిత్తుల, వంశీ, ఇళయరాజా, ముళ్ళపూడి శాస్త్రి, నాయని కృష్ణమూర్తి గీతాలను అమర్ స్వరపరిచారు. హరి అనుమోలు ఛాయ, అరుణ్ గొడగాంక్యర్ శిల్పం, శివశంకర్ నృత్యాలు, వెంకట్ మద్దిరాల సహాయ దర్శకత్వం, అనిల్ మల్నాడ్ కూర్పుతో తాడి రామకృష్ణ, తాడి భాస్టి, తాడి హరిబాబు సహ నిర్మాతలు. ఏడిద రాజా నిర్మాణసారథి కథ స్క్రీన్ ప్లే-దర్శకత్వం. వంశీ.

## రాజేంద్రప్రసాద్ "పైలాపచ్చీసు"

"బాధ్యతారహితంగా జల్సాగా, సరదాగా విలాసాలతో-వినోదాలతో ఆటపట్టించడాలతో ఉషారుగా తిరిగే కుర్రకారును 'పైలాపచ్చీసు'గా తిరుగుతున్నారంటారు. సాధారణంగా ఇలాంటివాళ్ళుజీవితంలో అడుగు పెట్టాక కొంత సఫర్ అవుతారు. చివరికి వారు బాధ్యతలు తెలిశాక సమాజానికి మేలు చేసేలా మారడమే ఈ చిత్ర కథాంశం. ఇందులో రాజేంద్రప్రసాద్ తొలుత లెక్చరర్. రమ్యకృష్ణ, డిస్కో-శాంతి, ఆనంద్‌బాబు, మాస్టర్ చక్రవర్తి స్టూడెంట్సు, గిరిబాబు ధనికుడైన విలన్. ఇతని సోదరి ప్రమీల. కుమారులు సుధాకర్, భాస్కర్. నాది ఓ తమాషా కేరెక్టర్. సందేశాన్ని లైటర్‌వీన్‌లో చెప్పే నవ్వించే చిత్రం. చివరి షెడ్యూల్ జూలై 27 నుంచి ఆగస్ట్ 5 వరకు" అన్నారు మౌళి. ఈయన కథ-స్క్రీన్ ప్లే-దర్శకత్వంలో రామోజీరావు నిర్మించే ఉషాకిరణ్ మూవీస్ "పైలాపచ్చీసు" చిత్రంలో రాజ్యలక్ష్మి, పై విజయ, బ్రహ్మానందం, రావి కొండలరావు ఇతర పాత్రధారులు నరేంద్రనాథ్ సంగీతం, డి ప్రసాద్‌బాబు ఛాయ, సాయి-రామచంద్రన్ సహకార దర్శకత్వంలో అట్లూరి రామారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ ●



రష్యా చలనచిత్రోత్సవానికి హాజరయిన నిర్మాత ఏడిద నాగేశ్వరరావు, హీరో చిరంజీవిలతో రష్యన్ తార అక్సానా




"సావన్‌కా మహీనా"లో

రిషికపూర్, జయప్రద




# 67

(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగిన కథ- 17 : జోషీకేసుదర్యాప్తులో భాగంగాపంచశూలమ్ పంపిన యువకుడు ఇన్‌స్పెక్టర్ 'షా'గా చెలామణీ అవుతుంటాడు. గురూజీ కూతురు మీనాక్షి అంధురాలై తర్వాత కన్ను మూస్తుంది. పంచశూలమ్ కిడ్నాప్ చేసిన బియరాజ్ కొడుకు మోహన్ హత్యకు గురవుతాడు. ఊర్వశి చేతిలో ఎం. ఎల్. ఏ. దీపాదేవి కాల్చి చంపబడుతుంధి. తన ఖరో కొడుకు మదనే మోహన్‌ని చంపాడని పంచశూలమ్ పరిమళకు తెలియజేస్తాడు. కడుపులో కసి పెంచుకున్న మదన్ పరిమళను కాల్చేసి ఆమె శవాన్ని యింటిముందు వ్రేలాడదీస్తాడు.**

రాత్రి రెండు గంటలయింది.

తన యింటి ముందు గుమికూడిన జనాన్ని చూసేసరికి గుండెలు దడ-దడలాడాయి ఊర్వశికి. "మా యింట్లో ఏదో ప్రమాదం జరిగిరది." అంది కంగారుగా.

"డోంట్ వర్రీ డార్లింగ్! నేను బతికున్నంత వరకు నీకు భయం లేదు." అని, ముందు కెళ్ళడానికి దారిలేక-యింటికి కొంతదూరంలో టూరర్ కారు అపుజేశాడు మదన్.

ఇద్దరు కారు దిగారు.

జనాన్ని తోసుకుంటూ తన యింటి వైపుకు పరుగెత్తింది ఊర్వశి వీధి గుమ్మం ముందు ఆగిపోయి-దిశలు దద్దరిల్లేటట్లు "అమ్మా!" అంటూ బిగ్గరగా అరిచింది

రెండడుగుల్లో ముందుకు వచ్చాదు మదన్. ఆమె వెనుక నిలుచున్నాడు ఇంటి లోపలకు దృష్టిని సారించాడు

వీధి తలుపులు తెరిచి ఉన్నాయి వెంకుటింటి దూలాలకు-ఉరి వేసుకుని వేలాడుతున్నారు- అహల్య, మల్లికలు!!!

ఆ దృశ్యాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు మదన్. ఊర్వశి భుజం మీద చెయ్యి వేశాడు. "వెరీ వెరీ సారీ డార్లింగ్! " అన్నాడు. ఒకర్ని ఓదార్చడానికి అంతకంటే ఎలాంటి మాటలు ఉపయోగించాలో అతనికి తెలియదు.

ఇంటి ముందు నిలబడిన-చుట్టుపక్కల జనమంతా అతని మాటలు విన్నారు ఆమె భుజం మీద ఉన్న అతని చేతిని చూశారు. మౌనంగా నిలబడిపోయారు.

వాళ్ళంతా తన మాటల్ని, చర్యల్ని గమనించారన్న సంగతి పట్టించుకోలేదు మదన్ తన చుట్టూ వందల కొద్దీ జనం ఉన్నారన్న ధ్యాసకూడా అతనికి లేదు ఉరేసుకుని ఎదురుగా వేలాడుతున్న తల్లిని, చెల్లెల్ని చూసేసరికి ఊర్వశి గుండెలు బద్దలవుతాయన్న విషయం కూడా అతనికి తెలీదు. జనన మరణాలు, తల్లీ కూతుర్ల మమకారం, అక్కా చెల్లెళ్ళ అనుబంధం-యిలాంటి వేమీ అతనికి తెలియవు. అలాంటి భావ స్పందన, సభ్యత, సంస్కారం, ఆత్మీయతలు లేవు అతనిలో. అందుకే తనకు తెలునున్న-భాషలో 'సారీ' అని మాత్రం అనగలిగాడు.

కాని, దుఃఖాన్ని అదువులో పెట్టుకోలేకపోయింది ఊర్వశి "మదన్! మా అమ్మా, చెల్లాయి నన్ను విడిచిపెట్టి వెళ్లిపోయారు. నన్ను అనాధను చేశారు" అంటూ భోరున ఏడుస్తూ, అతని గుండెలకు హత్తుకుపోయింధి.

"డార్లింగ్! నీకేం భయం లేదు-నేనున్నాను" ఆమె భుజాలు తడుతూ సముదాయించ సాగాడు మదన్

అంతవరకు-ఆమె ఉత్తమురాలు, అవివాహిత, ఉద్యోగం చేసుకుంటూ తల్లిని, చెల్లెల్ని పోషిస్తున్నది-అనే ఆ చుట్టు పక్కల వారికి తెలుసు. కాని, ఆమెకు ఓ ప్రియుడు ఉన్నాడని అర్థం జేసుకోగానే అంతా ఆశ్చర్యపోయారు ఈ సంగతి మామూలు సమయంలో తెలిస్తే, ఆమెను దుయ్యబట్టేవారు కాని, ఆమెను నిందించే సమయం కాదది అందుకే అంతా మౌనంగా వూరుకున్నారు.

ఇంతలో-

స్పోర్ట్స్ కారు వచ్చి ఆగింది అందులోంచి దిగి, పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ ముందుకు వచ్చాదు పంచశూలమ్ ఊర్వశి, మదన్‌ల వంక ఓ మారు చూశాడు వాళ్ళను తప్పించుకుని, యింటి లోపల కెళ్ళాడు

"శూలమ్ సాబ్! పోలీసులు వచ్చేంత వరకు మనం లోపలకెళ్ళకూడదు" హెచ్చరించాడు మదన్

"నిండా మునిగిన వాడిని-నాకు చలేమిటి?" లోపల నుండి సమాధానమిచ్చాడు పంచశూలమ్

"పద, మనం కూడా వెళదాం" తన ధోరణిలో తాపీగా అన్నాడు మదన్

కాని, దుఃఖాన్ని భరించలేక అప్పటికే స్పృహతప్పిపోయింది ఊర్వశి

పరిస్థితిని అర్థంజేసుకున్నాడు చంటిపిల్లను ఎత్తుకున్నట్లు ఆమెను భుజంమీద వేసుకున్నాడు ఇంటి లోపలకు ప్రవేశించాడు. కింద పరచిఉన్న చాపమీద ఊర్వశిని పడుకోబెట్టాడు - మదన్. "పోలీసులకు ఫోన్ చెయ్యమంటారా సాబ్?"



ప్రశ్నించాడు.

"నేను చేశాను"

"ఇంకా రాలేదేం?"

"తాగిన మత్తు దిగితేనేగానిరారు. వాళ్ళు వచ్చేసరికి తెల్లవారినా, మరో రోజు గడిచినా ఆశ్చర్య పడనక్కర్లేదు." అంటూ ఆ పరిసరాలను పరిశీలించసాగాడు వంచ శూలమ్.

వెంకటేశ్వరుని ఫొటో కింద ఓ కాగితం కనిపించింది. దానిని బైటకు తీశాడు. మడతలు విప్పాడు.

అది ఒక ఉత్తరం. అందులో యిలా ఉంది

ప్రతి ప్రాణికి ఓ కథ ఉంటుంది ఆ కథ వెనుక ఎన్నో గాథలు, బాధలు ఉంటాయి.

నేను అందగత్తెనని చెప్పుకోలేను, కాని అందవికారిని మాత్రం కాను

పహిల్వాన్ భీమరాజు నన్ను చూసి పిచ్చివాడైపోయాడు మరో విధంగా చెప్పాలంటే - పిచ్చివాడైనట్లు నటించాడు. నా కోసమే పుట్టానన్నాడు నాకోసమే చచ్చిపోతానన్నాడు.

అమాయకత్వం వల్ల అతని మాట లన్నీ నమ్మాను. అతనితో ఉన్నాను ఇద్దరు బిడ్డల్ని కన్నాను.

కాని, నా భర్త కాంమాంధుడై నన్ను, నా బిడ్డల్ని విడిచిపెట్టాడు దీపాదేవితో సంబంధం పెట్టుకున్నాడు ఆమెను పెళ్ళి చేసుకున్నాడు.

కాదు -

అతను కుస్తీలు పట్టిన ప్రతి పట్టణానికి వెళ్ళి, ముందు వరుసలో కూర్చుని, అతను బస చేసిన హోటల్లోనే - అతని పక్కగది తీసుకుని, తన చెణు కు - బెణుకులతో అతన్ని వల్లో వేసుకుంది దీప. అతన్ని పెళ్ళి చేసుకుంది

ఏది ఏమైనా మేము అనాధ లమైపోయాము

నాకు జీవితం మీద విరక్తి కలిగింది నా బిడ్డల్ని చంపి, నేను చచ్చి పోదామనుకున్నాను నమ్మిన మనిషి మోసగించాక బతకడం అనవసరమనిపించింది"

కాని -

ఏ తల్లి తన బిడ్డల్ని చంపుకోలేదు నా భర్త నన్ను విడిచిపెట్టినా నా బిడ్డల్ని నేను విడిచిపెట్టలేక పోయాను వాళ్ళను చంపలేక పోయాను నేను చావలేకపోయాను

నా యిద్దరు కూతుళ్ళను పోషించడానికి పెట్టి చాకిరీ చేశాను వీధి వీధి తిరిగి భిక్షమెత్తాను చివరకు భిక్ష మెత్తుకోవడమే నా వృత్తిగా పెట్టుకున్నాను - నా పిల్లల కోసం

నా పెద్దకూతురు ఊర్వశి కొద్దిగా చదువుకుంది 14 సంవత్సరాల వయసులోనే ఏదో ఉద్యోగంలో చేరానంది భిక్షమెత్తుకుని బతకడం మానేయమని నన్ను శాసించింది. ప్రతిరోజు పది, యిరవై, వంద తెచ్చి నా చేతికిచ్చింది మల్లికకు చదువు మీద ధ్యాస కలిగించింది ఆ పిల్లను బి. ఏ. చదివించింది

నీరు పల్లమెరుగు, నిజం దేవుడెరుగు

ఊర్వశి ఉద్యోగం చేస్తూ సంపాదించి, మమ్మల్ని పోషిస్తున్నదనే ఈ క్షణం వరకు నమ్మాము మేము ఆమె సంపాదన

## 'దోస్త్'లో అమల

పుష్పక్ చిత్రంలో నటించిన అమల తర్వాత నటించిన చిత్రాలు ఫ్లాప్ కావటంతో తెరమరుగైపోయి, మళ్ళీ యిప్పుడు 'దోస్త్' చిత్రంలో నటిస్తోందట. ఈ చిత్రంలో మిథున్ చక్రవర్తి హీరోగా నటిస్తున్నాడు.

ఈ చిత్రంలో అనుకున్న దానికంటే కూడా చాలా బాగా నటించిందట అమల. మరి ఈ చిత్రం ఎంత వరకు విజయం సాధిస్తుందన్నదే నిర్మాతల భయం. ఇది సక్సెస్ అయితే అమల పని మహా జోరుగా వుంటుందంటున్నారు. మరి సుడి ఎలా వుందో?



మీదనే ఆధారపడ్డాము.

కాని, పాప పుణ్యాలు భగవంతునికే తెలియాలి.

ఊర్వశికి 24 ఏళ్ళు. మల్లికకు 22 సంవత్సరాలు. ఇద్దరూ పెద్దవాళ్ళయ్యారు. కాని మరో రెండు సంత్సరాలవరకు పెళ్ళి చేసుకోనంది ఊర్వశి. చెల్లెలికి వరుణ్ణి చూసింది. మా స్థితికి, తన శక్తికి మించి ఎన్నెన్నో వాగ్దానాలు చేసింది. పెళ్ళి నిశ్చయించింది.

కాని -

మల్లికను పెళ్ళి చేసుకోబోయే అబ్బాయి దగ్గర నుండి ఈ రోజున ఓ ఉత్తరం వచ్చింది. అందులో - 'ప్రస్తుతం గురూజీగారి దగ్గర ఉద్యోగం చేస్తున్నాను నేను. ఆయనవల్ల మీ కుటుంబ రహస్యాలు తెలిశాయి. ఓ భిక్ష గత్తె కూతుర్ని, వ్యభిచారిణి చెల్లెల్ని పెళ్ళి చేసుకోలేను. మరో సంబంధం చూసుకోండి, మీరు' - అని ఉంది.

నేను భిక్షమెత్తుకున్నట్లు నాకు తెలుసు కాని, నా పెద్దకూతురు వ్యభిచారం చేస్తున్నట్లు యింత వరకు తెలీదు. ఆ విషయం తెలిస్తే, ఎప్పుడో ఉరేసుకుని చనిపోయేదానిని నేను.

కాని, మమ్మల్ని పోషించడానికి ఊర్వశి వ్యభిచార వృత్తి చేస్తున్నదని తెలియగానే నేను, మల్లిక దుఃఖాన్ని భరించలేకపోయాము. ఆమె చేస్తున్న త్యాగాన్ని సహించలేకపోయాము. ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకున్నాము

ఈ ప్రపంచంలో- ప్రత్యేకించి భారత దేశంలో, పెద్దలు చేసిన ప్రతి తప్పుడు పని పిల్లల భవిష్యత్తును దెబ్బతీస్తుంది వాళ్ల జీవితాలను నాశనంచేస్తుంది తమ బిడ్డల శ్రేయస్సుకోరే తల్లిదండ్రులు, అన్న దమ్ములు, అక్కచెల్లెళ్లు - అంతా నీతి నియమాలతో, పవిత్రమైన జీవితాలు గడపాలి జీవితంలో ఎప్పుడు ఎవరు ఏ తప్పు చేసినా; ఆ పాప ఫలితం వారి రక్తసంబధీకులమీద పడుతుంది.

కన్న బిడ్డల్ని చంపుకోలేక భిక్షమెత్తాను నేను. వాళ్లు యోగ్యులయితే చూసి ఆనందించాలనుకున్నాను

కాని; నేను, నా పెద్ద కూతురు చేసిన తప్పులు నా రెండో కూతురి జీవితాన్ని నాశనం చేస్తున్నాయి.

ఆ అవమానాన్ని, ఆత్మ క్షోభను భరించలేక; నేను, నా చిన్నకూతురు మల్లిక ఆత్మహత్య చేసుకుంటున్నాము.

మా మరణాలకు ఎవరూ బాధ్యులు కారు.

ఇట్లు,
అహల్య, మల్లిక..."

కింద యిద్దరి సంతకాలు ఉన్నాయి

ఉత్తరాన్ని చదివి మదన్ కిచ్చాడు పంచశూలమ్.

దాన్ని అతను పూర్తి చేస్తుండగా అలీషా వేషంలోనున్న సుభాష్, కొందరు పోలీసులు లోపలకు వచ్చారు.

తను చదవడం ముగించి ఉత్తరాన్ని సుభాష్ కిచ్చాడు మదన్.

ఇంతలో -

ఫొటోగ్రాఫర్లు, ప్రెస్ రిపోర్టర్లు, మరి కొందరు పోలీసులు, యిన్‌స్పెక్టర్ అబ్దుల్లా వచ్చారు.

రిపోర్టర్‌లువార్తలు వ్రాసుకుంటున్నారు ఫొటోగ్రాఫర్లు ఫొటోలు తీస్తున్నారు

తన చేతిలోని ఉత్తరాన్ని చదివి 'మిస్టర్ షా! ఇవి ఆత్మహత్యలేనా?" అడిగాడు అబ్దుల్లా.

"అక్షరాల ఆత్మహత్యలే అందులో సందేహంలేదు" తన అభిప్రాయాన్ని తెలిపాడు సుభాష్

"ఊర్వశి స్టేట్‌మెంటు తీసుకోవాలి."

"ఆమె స్పృహలో లేదు"

"డాక్టర్ని పిలుద్దాం ఆమెకు స్పృహ తెప్పిద్దాం."

అప్పటికింకా తెలివి తప్పే ఉంది ఊర్వశి. ఆమెను పొదివి పట్టుకునే ఉన్నాడు మదన్ అబ్దుల్లా మాటలు విని తల పైకెత్తాడు సూటిగా, కోపంగా అతని ముఖంలోకి చూసాడు. మెరుపులా పైకి లేచాడు. ఇన్‌స్పెక్టర్లమీద తిరగబడటానికి రెడీగా నిలుచున్నాడు

అక్కడి వాతావరణాన్ని, పరిస్థితుల్ని అర్థం జేసుకున్నాడు పంచశూలమ్ "ఇన్‌స్పెక్టర్! డాక్టర్ని పిలవొద్దు." అన్నాడు

"ఎందుకని ?"

"ఇప్పట్లో ఊర్వశికి తెలివి తెప్పించటం మంచిదికాదు స్పృహలోకి వస్తే ఈ బాధను బరువును భరించలేదు."

"ఆమె స్టేట్‌మెంట్ కావాలి."

"నిజమే. కాని, మీ రడిగే ప్రశ్నకు సమాధానం చెప్పేస్థితిలో లేదు ఊర్వశి ఆమె యిక్కడ ఉండటంకూడా మంచిది కాదు ఆమెను తీసుకెళ్తున్నాను నేను రేపు నా బంగ్లాకు వచ్చి, ఆమె స్టేట్‌మెంట్ రాసుకోండి లేదా నేనే మీ స్టేషన్‌కు ఆమెను తీసుకొస్తాను."

"మీ రెవరు ?" ప్రశ్నించాడు అబ్దుల్లా

"పంచశూలమ్, రిటైర్డ్ మిలటరీ ఆఫీసర్ని, పంచామృతం పార్టనర్ని."

"మీకు, ఆమెకు ఏమిటి సంబంధం ?"

"మీ యిద్దరికీ ఉన్న సంబంధం లాంటిది మాత్రం కాదు. మీకు అర్థంకాని అనుబంధం మాది"

"అంటే ?"

కోపంవచ్చింది పంచశూలానికి కాని, తమాయించుకున్నాడు కంఠాన్ని అదుపులో పెట్టుకున్నాడు "భరించలేనిదుఃఖంతో

# పంచశూలమ్

ఆమె సొమ్మసిల్లిపోయింది ఈ పరిస్థితిలో -సాటిమానవునిగా మీరో, నేనో ఆమెకు సేద తీర్చాలి మీ డిపార్టుమెంటు వారు ఆమెను ప్రశాంతంగా బతకనివ్వరు అందుకే నేను తీసుకెళుతున్నాను" అని, అబ్దుల్లాసమాధానానికెదురు చూడకుండా-చాపమీద ఉన్న ఊర్వశిని తన భుజం మీద వేసుకున్నాడు పంచశూలమ్

ఏదో అనబోయాడు అబ్దుల్లా

"డోంట్‌వర్రీ యిన్‌స్పెక్టర్ ! ఊర్వశి విషయంలో మీ చర్యలకు, యితరత్రా చట్టాలకు నేను బాధ్యత వహిస్తాను" అని బైటకు నడిచాడు పంచశూలవ్

అడుగు ముందుకు వెయ్యబోయాడు అబ్దుల్లా పంచశూలాన్ని ఆపాలనుకున్నాడు

కనుసైగతోనే అతన్ని వారించాడు సుభాష్

అంతా గమనిస్తూ, నోటమాటరాక రాతిబొమ్మలా నిలబడి పోయాడు మదన్।



తెల్లవారుజామున ఐదుగంటలయింది

గురూజీ గెస్ట్‌హౌస్‌లోని ఎయిర్‌కండిషన్డ్ రూమ్ బాగా చల్లబడింది కాని, ఆ గదిలో కూర్చున్న గురూజీ, జయరాజ్, యిన్‌స్పెక్టర్ అబ్దుల్లాల శరీరాలు బ్రాందీ నిషాతో వేడెక్కి పోయాయి

"ప్రాణాలు తీసేస్తాను, చర్మంఒలిచేస్తాను కాళ్లువిరగ్గొట్టేస్తాను"

కోపోద్రేకాలతో వూగిపోతూ అన్నాడు అబ్దుల్లా

అతని గ్లాసులో మరో పెగ్గు వేశాడు జయరాజ్ సోడా కలిపి, గ్లాసు అతని చేతికిచ్చాడు గురూజీ

ఎత్తిన గ్లాసు దించకుండా తాగేశాడు అబ్దుల్లా "మీకేం భయంలేదు, మీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డంవేస్తాను పంచశూలమ్ ప్రాణాలు తీసేస్తాను ఊర్వశి చర్మం వలిచేస్తాను మదన్ కీళ్లు విరగొట్టేస్తాను ముగ్గుర్నీ మూడు చెరువుల నీళ్లు తాగిస్తాను" మధ్య మధ్య బూతు మాటలు విసురుతూ, నిషాలో నోటికొచ్చినట్లు మాట్లాడుతున్నాడు

"మీరనుకున్నంత చిన్న మనిషి కాడు పంచశూలమ్ - అతనికి చాలా బలముంది" రెచ్చగొట్టాడు గురూజీ

"డేమ్‌డెకారం బూటుకాలు కిందేసి, నల్లిని నలిపినట్లు నలిపేస్తాం పోలీసులంటే మజాకా అనుకున్నారా ? తెల్లవారే సరికి మా తడాఖా చూపిస్తాం పంచశూలానికి టిక్కెట్టిచ్చి పంపించేస్తాం" మీసాలు దువ్వుకుంటూ అన్నాడు అబ్దుల్లా

"ఎలా ?" జయరాజ్ ప్రశ్నించాడు

" ఓ మనిషిని కొట్లో పెట్టాలన్నా, కీళ్లు విరిచి ప్రాణాలు తియ్యాలన్నా పోలీసులకు లక్ష మార్గాలున్నాయి ఆ బరువంతా నేను మోస్తాను మీరు నిశ్చింతగా పడుకోండి "

"ఓ దగ్గర దారి చెప్పనా ?" గురూజీ అన్నాడు

"నో .షార్ట్ రూట్, లాంగ్‌రూట్ -యివేమీ అక్కర్లేదు డైరెక్ట్ రూట్‌లో పంచశూలమ్ తల తీసేస్తాను డోంట్‌వర్రీ "

"అదిసరే, ఓ పాయింట్ చెబుతాను, వినండి "

# పంచశూలమ్

"ఏమిటది ?"

"ఊర్వశి మీద మనసు పారేసుకున్నాడు పంచశూలమ్ "

"కానీ బోలా ?" అగ్గిమీద కాలేసినట్లు ఎగిరిపడ్డాడు అబ్దుల్లా.

స్వతహా విలాసపురుషుడు అతను ఎన్నోసార్లు అనుభవించాడు ఊర్వశిని ఆమె పడుపు వృత్తితో బతుకుతున్నదని అతనికి బాగా తెలుసు. కాని, ఆమెకు పంచశూలమ్‌తో సంబంధం ఉందని వినగానే అసూయ, కోపం కూడా కలిగాయి

"ఆ ముసలోడు ఊర్వశిని వళ్లో వేసుకున్నాడు "అన్నాడు గురూజీ

"ఆమె అంటే అతనికి ప్రాణం " అన్నాడు జయరాజ్

"వాడి ప్రాణాలు నేను తీసేస్తాను." అంటూ కుర్చీలోంచి లేచాడు అబ్దుల్లా.

"ఇన్‌స్పెక్టర్ ! ఆవేశమేగాని మీకు ఆలోచనలేదు." విసుక్కున్నాడు గురూజీ

"ఏంచెయ్యమంటారో చెప్పండి."

"ఆ పిల్లను అరెస్ట్‌చేస్తే, అతను రంగంలోకి దిగుతాడు దానితో మీరు అతన్ని ఓ ఆట ఆడించవచ్చు "

"వాడినీ, దానినీ, మదన్‌నీ- అందర్నీ పర్టీలు కొట్టేం చేస్తాను ప్రాణాలుతీసి ఉప్పు పాతరేస్తాను వాళ్ళపేర్లు కార్పొరేషన్ లిస్టులోంచి తీయించేస్తాను."

తృప్తిపడ్డాడు గురూజీ తనపక్కనున్న బ్రీఫ్‌కేస్ అతని చేతికిచ్చాడు

"ఎంత?"

"మీ రడిగిన దానికి రెట్టింపు " జయరాజ్ సమాధానమిచ్చాడు.

"దట్సాల్ రైట్." అని బ్రీఫ్‌కేసు పట్టుకున్నాడు అబ్దుల్లా గెస్ట్‌హౌస్‌లోంచి బైటకు నడిచాడు. జీప్‌లో కూర్చున్నాడు

మరుక్షణంలోనే జీప్ స్టార్ట్ చేశాడు- డ్రైవింగ్ సీటులో కూర్చున్న కానిస్టేబుల్

జీప్ గేటుదాటి వెళ్ళేంత వరకు చూస్తూ నిలుచున్నారు- జయరాజ్, గురూజీలు.

ఇంతలో-

లోపల ఫోన్ మోగుతున్న శబ్దం వినిపించింది

ఇద్దరూ లోపల కెళ్ళారు.

రిసీవరు అందుకున్నాడు జయరాజ్ "హలో!" అన్నాడు.

"టైగర్ ఈజ్ దిస్‌సైడ్ " అవతల నుండి గంభీరమైన కంఠం వినిపించింది.

"చెప్పండి, టైగర్ సార్!"

"ఇన్‌స్పెక్టర్ అబ్దుల్లాతో మంతనాలు జరుపుతున్నారా? "

"అబ్బే, అదేంకాదు."

"మిస్టర్ జయరాజ్! ఈ టైగర్‌కి వెయ్యికళ్ళు, లక్ష చెవులు ఉన్నాయ్ టేక్కేర్! మన అగ్రిమెన్టు ప్రకారం పంచశూలమ్ తలకోసం అన్ని ఏర్పాట్లూ చేశాను అమావాస్యనాడు గోల్కొండ కోట దగ్గరకు తీసుకొస్తాను ఐదుకోట్ల రూపాయలతో సహా మీ రిద్దరూ రండి అలా జరగలేదో, మీ యిద్దరి తలలు పగల గొడతాను."అని, అవతలివైపు రిసీవరు పెట్టేసినట్లు 'క్లిక్' అన్న శబ్దం వినిపించింది.

ఒకరి ముఖంలోకి మరొకరు చూసుకుంటూ స్తంభించిపోయారు- జయరాజ్, గురూజీలు!

## 69

'ఛెళ్'

సోఫియా చెంప అదిరిపోయింది. కళ్లల్లోంచి కన్నీరు కారింది. ముఖం ఎర్రబడింది "రోజు రోజుకు నువ్వు రాక్షసుడివై పోతున్నావ్?"అంది కోపంగా

'ఛెళ్' మళ్ళీ కొట్టాడు సుభాష్

రెండో చెంప కంది పోయింది అతని అమానుషత్వాన్ని సహించలేక పోయింది కోపోద్రేకాలతో "యూ బ్రూట్" అంటూ పిడికిళ్ళు బిగించింది సోఫియా

మళ్ళీ కొట్టబోయాడు సుభాష్.

కాని, అతనికి అవకాశ మివ్వలేదు సోఫియా

అతని చెయ్యి పైకి లేవగానే- తలతో అతని గుండెలమీద ఢీ కొట్టింది అతని పిరలపైన- పిడికిళ్ళతో బలంగా గుద్దింది

రెండడుగులు వెనక్కి తూలాడు సుభాష్.

అయినా అతన్ని విడిచి పెట్టలేదు ఆమె. ఆవేశాన్ని అణచుకోలేక అతన్ని గుద్దనారంభించింది

కొద్ది కొద్దిగా వెనక్కి జరుగుతూ, గోడకు అంటుకుపోయాడు అతను చెయ్యి పైకెత్తాడు. ఆమె బాబ్డ్‌హేర్ పట్టుకున్నాడు

చిన్నగా అరిచింది ఆమె

"షటప్ ."

రెచ్చిపోయింది ఆమె అతని గూబలమీద ఎడా-పెడా గుద్దింది

అతని మెదడు అదిరిపోయింది ఆమె జుట్టు విడిచి పెట్టాడు

రెండడుగులు వెనక్కి వెళ్ళి నిలుచుంది సోఫియా.

నిటారుగా నిలుచున్నాడు సుభాష్

అతనిలాగే పోజిచ్చి నిలబడింది ఆమె

తినేసేటట్లు ఆమె వంక చూశాడు అతను

మింగేస్తానన్నట్లు బుసలు కొడుతూ,





పెదవులు విప్పింది ఆమె

ఇద్దరూ నాగరికులే, చదువుకున్న వారే!

సభ్యతా, సంస్కారం తెలిసినవారే!!

ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకుని, పెళ్ళి చేసుకున్నవారే!!!

కాని, పరిస్థితుల ప్రభావం వలన యిద్దరూ ఆవేశానికి గురి అవుతున్నారు

స్వతహా, సున్నితమైన మనస్తత్వం గల వాడు సుభాష్

అతనిలోని అనేక సుగుణాలు చూసి, ప్రేమించి, పెళ్లి చేసుకుంది సోఫియా

కాని, ఇండియా వచ్చాక తన జీవితం ఓ ప్రశ్నార్థకంగా కనిపించింది సుభాష్‌కి తన తల్లి ఎవరో తెలీదు! తండ్రెవరో తెలీదు!! తనెవరో తనకే తెలీదు!!!

దానితో, అతని మనస్తత్వం మారిపోయింది హృదయం మొద్దుబారి పోయింది కసాయివాడిలా తయారయ్యాడు

మొదట్లో సహించింది సోఫియా అతని హింసా ప్రవృత్తిని భరిస్తూ, అతన్ని మార్చడానికి ప్రయత్నించింది కాని, ఫలితం కనిపించలేదు క్రమంగా ఆమె కూడా అతనిలా మారిపోయింది ఎదురు తిరిగి పోరాడసాగింది అతన్ని శాంతప రచడానికి అంతకంటే వేరే మార్గం కనిపించలేదు ఆమెకు

కాని -

కోపంలోనూ, ఆవేశంలోనూ ఒకరినొకరు ఎంత కొట్టుకున్నా, ఎన్ని తిట్టుకున్నా కొన్ని క్షణాల్లోనే ఇద్దరూ మళ్లీ కలిసిపోతారు

"కమాన్ !" రెండు చేతులూ ముందుకు చాపుతూ అన్నాడు సుభాష్

అయస్కాంతంలా అతని గుండెలకు హత్తుకుపోయింది సోఫియా

అమాంతంగా ఆమెను పైకెత్తుకున్నాడు పక్క గది తలుపు తెరిచాడు లోపల కెళ్లి దభాలున తలుపు మూశాడు సుభాష్

* * * *

"సో సారీ, డార్లింగ్ ! జీవితంలో పెద్ద పొరపాటు చేశాను" అన్నాడు సుభాష్ ఆపిల్ కాయ కోస్తూ

"వాట్ ?" గౌను వేసుకుంటూ అడిగింది సోఫియా

'నిన్ను పెళ్లి చేసుకోవడం"

'నో నువ్వు నా భర్తగా లభించడం నా అదృష్టం ఐయాం వెరీ హాపీ విత్ యువర్ కంపెనీ"

"కాని, నీకు న్యాయం చెయ్యలేకపోతున్నాను ఇండియా వచ్చాక శాడిస్టునై పోయాను" చాకు మొనతో బొటనవేలి మీద గుచ్చుకున్నాడు

రక్తం విరజిమ్మింది. వేలు నోట్లో పెట్టుకొని పీల్చసాగాడు.

ఆ దృశ్యాన్ని చూడలేకపోయింది ఆమె ఓ అడుగు ముందుకు వేసింది అతని చెయ్యి పట్టుకు లాగింది సుభాష్ నోట్లోనుంచి బయటకు వచ్చింది బొటనవేలు అప్పటికి రక్తం కారడం ఆగిపోయింది కాని ఎర్రదనం పోలేదు

ఆ వేలు తన నోట్లో పెట్టుకుంది సోఫియా కొంతసేపు చప్పరించింది బైటకు తీసి, చేతి రుమాలుతో కట్టు కట్టింది "డియర్ ! నీలో సమస్యలు చెలరేగినప్పుడు భరించలేని ఉద్రేకానికి గురవుతున్నావ్ ! ఆ ఆవేశంలో ఎదుటి వారిని బాధిస్తున్నావ్, నిన్ను నువ్వు హింసించుకుంటున్నావ్ నీ ప్రోబ్లమ్ నాకు చెప్పు, సాల్వ్ చేస్తాను" అంది

"ఐ నో డార్లింగ్ ! నా కంటే తెలివైన దానివి నువ్వు, కానీ నా సమస్యలు పరిష్కరించలేవు"

"పరిష్కరించగలను అంతే కాదు - నీ మనస్సును వేధిస్తున్న సమస్యలు కూడా చెప్పగలను" ఛాలెంజ్ చేస్తున్నట్లు అంది సోఫియా

ప్రశ్నార్థకంగా ఆమె ముఖంలోకి చూశాడు సుభాష్

"నెంబర్ వన్ పంచశూలమ్ ఎవరు ? నెంబర్ టు నువ్వే ఇన్‌స్పెక్టర్ అలీషాగా వ్యవహరిస్తున్నట్లు అతనికెలా తెలుసు ? నెంబర్ త్రీ ఈ రహస్యం తెలిసినా, పదిమందిలో ఉన్నప్పుడు తెలియనట్లు ఎందుకు నటిస్తున్నాడు ? ప్రతి సంఘటనలోనూ, ప్రతి స్థలంలోనూ అతను ఎదురవటానికి కారణమేమిటి ? అసలు అతని ఆంతర్యమేమిటి ? డియర్ ! ఇవే నిన్ను కలవరపరుస్తున్న ముఖ్య సమస్యలు ఔనా ?"

ఆశ్చర్యపోయాడు అమాంతంగా ఆమెను పైకెత్తుకున్నాడు చటుక్కున ముద్దు పెట్టుకున్నాడు "డార్లింగ్ సోఫీ ! నీకు జ్యోతిషం వచ్చునా ?" అడిగాడు

చిరునవ్వు నవ్వింది అతని కౌగిట్లోంచి తప్పించుకుంది "పోలీస్ ఆఫీసర్ కూతుర్ని నేను క్రిమినాలజీలో గ్రాడ్యుయేషన్ చేశాను ఈ సమస్యలతో నువ్వు సతమతమవుతున్నావని గ్రహించాను సావధానంగా ఆలోచించాను ఓ దృఢమైన నిశ్చయానికి వచ్చాను" అంది

"ఏమిటి నిశ్చయించుకున్నావ్? పంచశూలమ్ ఎవరు ?"

# అమీర్‌ఖాన్



అమీర్‌ఖాన్ వాస్తవానికి దగ్గరగా నటించాలన్న ఆతృతలో యిటీవల ఒక చిత్రం షూటింగ్‌లో గాయపడ్డాడట

'తుమ్ మేరేహో' చిత్రంలో బల్లపై వున్న గాజు సీసాను పగులగొట్టే సీన్‌కు దాదాపు ఆరుసార్లు రిహార్సల్ వేసుకున్నాడట తర్వాత ఓ కే అనుకున్న దర్శకుడు షూటింగ్ ప్రారంభించాడు అంతే కెవ్వున కేక పెట్టాడట అమీర్ దర్శకుడు సన్‌కట్ అని చెప్పి వెళ్ళి చూస్తే చేయికి పగిలిన సీసా గిరుకుపోయి గాయమైందట

మరి అంత ఆవేశం పనికిరాదని దర్శక పితామహులు సలహాయిచ్చారట ఇలా జరగటం కూడా మంచిదేలే అనుభవం వస్తుందంటున్నారు కొంతమంది ఒక ప్రక్క చెయ్యి తెగి అమీర్ ఏడుస్తుంటే ఈ వ్యాఖ్యలేమిటో ?!

# పాతపురాణీ హోటలు !

ఎక్కడ చూసినా అధునాతనమైన రెస్టారెంట్లు నిర్మింపబడుతున్న ఈ కాలంలో పురాతనమైనవి మరుగునపడిపోతున్నాయి. కాని ప్రపంచంలోనే పురాతనమైన రెస్టారెంట్‌ను గురించి తెలుసుకుందాం.

ఇటువంటి పురాతనమైన రెస్టారెంట్ స్పెయిన్ దేశంలోని మాడ్రిడ్‌లో వున్నదట. ఈ రెస్టారెంట్ పేరు, ప్రఖ్యాతులు ఎప్పుడో గిన్నిస్ పుస్తకంలో చోటుచేసుకున్నాయట కూడా.

ఆ రెస్టారెంట్ పేరు కాసాబోటిన్. మాడ్రిడ్‌కు నడిబొడ్డునవున్న ఈ రెస్టారెంట్ 1590లో ప్రారంభింపబడిందట. నిజానికిది 'కోచ్‌హౌస్'గా తొలుత [illegible]ర్మించింది. క్రమేపీ 1725లో




రెస్టారెంట్‌గా రూపుదాల్చిందట.

1936-39 మధ్య స్పానిష్‌లో అంతఃకలహాలు చోటుచేసుకోవటంతో ఆ మూడేళ్లు మాత్రమే ఈ రెస్టారెంట్ మూతపడిందట. అంతకుమినహా యిది ఏ ఆటంకాలు లేకుండా అవిశ్రాంతంగా పని చేస్తోంది.

అనేకమంది ప్రముఖులు, డబ్బున్న వాళ్లు ఈ రెస్టారెంట్‌లో విందారగించిన వాళ్లే.

ఇక్కడ విందారగించిన ప్రముఖులెంతమందో లెక్కపెట్టటం కష్టమేనంటున్నారు. ప్రముఖ సాహిత్యవేత్తలు- గ్రాహంగ్రీన్, జేమ్స్‌మైఖెనర్ నుంచి రాజకీయవేత్తలు- నాన్సీ రీగన్ వరకు ఈ రెస్టారెంట్‌ను పావనం చేసిన వాళ్లేనట.

ప్రముఖ ఆంగ్ల నవలా రచయిత [illegible] హెమింగ్‌వే తరచు ఈ రెస్టా[illegible] వస్తుండేవారని దీని యజమాని ఆంటోనియో గోంజాలెజ్ (66) అంటున్నారు. రోస్టింగ్ చేసిన పందిమాంసం అంటే ఆ రచయితకు మహాప్రీతిట.

టి.వి., సినిమాలలో నటించే నటీనటులు- విందా ఎవన్స్, జాన్‌సేమోర్, హాలీవుడ్ నటుడు జాక్ నికల్‌సన్‌లు యిక్కడ బస చేస్తుండేవారని ఆంటోనియో తెలియజేశారు.

రోజు రోజుకి యిక్కడకు వచ్చేవారి సంఖ్య పెరిగిపోతోందని, యిక్కడకు వచ్చిన వారెవ్వరూ అసంతృప్తిగా వెళ్లరని ఆ యజమాని ధీమాగా పలుకుతున్నారు.

పూర్తిగా కొయ్యతోనే తయారైన ఈ రెస్టారెంట్‌లో ఎటువంటి ఫొటోగ్రాఫ్‌లు లేవు. ఇనుప బల్లల మీద చలువరాయి వేసి వుంటుందట. మొత్తం రెస్టారెంట్‌లో ఆ బల్లలపై ఆంటోనియో తల్లి స్వయంగా ఎంబ్రాయిడరీ చేసిన గుడ్డ పరచి వుంటుందట.

ఇంతకీ ఈ రెస్టారెంట్‌లో గత 40 ఏళ్లుగా వచ్చిన మార్పు ఏమిటయ్యా అంటే ధరల్లో మార్పే. 1935లో రోస్ట్ చేయబడిన పందిమాంసం 75 పైసల కంటేకూడా తక్కువ వుండేదట. ఇప్పుడు అదే 210 రూపాయలు అయిందట.

దేశం ఎంతో పురోభివృద్ధి చెందుతున్నా, అధునాతన సౌకర్యాలు ఏర్పాటవుతున్నా ఈ పురాతన రెస్టారెంట్‌ను జనాలు యింకా అభిమానిస్తున్నారంటే చెప్పుకోదగినవిషయమేకదూ! అందుకే 'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అంటారు మన పెద్దలు. ●

## పంచశూలమ్

"మరెవరో కాదు - ఆయనే మీ ఫాదర్ !"

"వాట్ !" నమ్మలేనట్లు చిన్నగా అరిచాడు సుభాష్.

"ఆయనే మిస్టర్ జోషీ ! మీ డాడీ !"

కొన్ని క్షణాల పాటు స్థాణువులా ఉండిపోయాడు. ఎన్నెన్నో విషయాలు స్మృతిపథంలోకి తెచ్చుకున్నాడు. పంచశూలమ్ రూపాన్ని కళ్లల్లో ప్రత్యక్షం చేసుకున్నాడు. "సోఫీ ! మా ఫాదర్ ఫొటో నా దగ్గరుంది. ఆయనవి తేనె కళ్లు, మొనదేరిన ముక్కు. కాని పంచశూలానివి నల్లని కళ్లు, తప్పటి ముక్కు" అన్నాడు.

"డియర్! సైన్స్ చాలా అడ్వాన్స్‌లో ఉంది. మనిషి రూపాన్నే పూర్తిగా మార్చేయవచ్చు."

"ఆయన కుడిచేతిమీద 'పంచశూలమ్' అన్న ఆయన పేరు పచ్చబొట్టుతో ఉంది. పేరు మార్చుకోవలసిన అవసరమేముంది మా ఫాదర్‌కి ?"

"అదే అసలు మిస్టరీ"

"అంటే ?"

"ఆయన జైల్లోనుంచి పారిపోయారు. జోషీ పేరుతో వ్యవహరిస్తే పోలీసులు పట్టుకుంటారు. అందుకే ముక్కు, కళ్లు మార్చుకున్నట్లు పేరు గూడా పచ్చబొట్టు పొడిపించుకొని, శాశ్వతంగా మార్చుకున్నారు. ఎందుకో తెలుసా ?"

"ఎందుకు ?"

"ఐదు మొనలు గల ఆయుధం - పంచశూలమ్."

"అయితే ?"

"దీపాదేవి, పరిమళ, విశాలాక్షి, జయరాజ్, గురూజీ - ఐదుగురూ మీ ఫాదర్‌ని మోసం చేశారు. ప్రతిక్షణం ఆ ద్రోహుల్ని గుర్తు చేసుకోడానికే ఐదు మొనలు గల 'పంచశూలమ్' అన్న అక్షరాలను పచ్చబొట్టు పొడిపించుకున్నారు. ఆ ఐదుగుర్ని అంతం చెయ్యడమే పంచశూలమ్ అలియాస్ మీ ఫాదర్ జోషీ జీవిత లక్ష్యం."

సోఫియా తెలివికి ఆశ్చర్యపోయాడు. అంతలోనే ఆగ్రహావేశాలతో వూగిపోయాడు. శక్తి కొద్దీ గోడను తన్నాడు సుభాష్ !

(ఇంకా ఉంది)

# "ఫుట్‌బాల్" మేటి "పెరల్ ఆఫ్ ఆంధ్ర" ఎస్. వరహాలు

అగ్రగామి అంతర్జాతీయ ఫుట్‌బాల్ ఆటగాడు, మోహన్‌బాగన్ క్లబ్, ఈస్ట్ బెంగాల్ క్లబ్, దక్షిణ మధ్య రైల్వే, బి ఎన్ రైల్వే, ఐ ఎఫ్ ఎ ఫుట్‌బాల్ జట్ల క్రీడాకారుడు, భారతీయ రైల్వే జట్టుల 'కోచ్' (ఎన్ ఐ ఎస్) విశాఖజిల్లాలో ఫుట్‌బాల్ ఆట అభివృద్ధికై ఎంతో కృషి చేసిన శ్రీ సిద్దనాతి వరహాలు జులై 12న అనారోగ్యంతో కన్నుమూసారు తెలుగు ఫుట్‌బాల్ రంగంలో 'పెరల్ ఆఫ్ ఆంధ్ర'గా ఖ్యాతి పొందిన వరహాలు ప్రముఖ ఆటగాడేగాక అనేక మంది యువతను మంచి ఆటగాళ్ళుగా తీర్చిదిద్దారు

అగ్రశ్రేణి ఫుట్‌బాల్ ఆటగాళ్లైన అత్తిలి సోదరులు, ఘంటా ఆదినారాయణ, మారగాని సూర్యం మొదలగు వారి పుట్టినిల్లు, అనేక క్రీడల నిలయమైన విశాఖపట్టణములో 1932 సెప్టెంబరు 9న వరహాలు జన్మించారు విద్యార్థిగా తన సాటివారు బంతి ఆడుట, ప్రశంసలు పొందుట వరహాలునకు ఫుట్‌బాల్ ఆటలో ఆసక్తి కలిగించింది 15వ ఏటనే హైస్కూలు విద్యార్థిగావుండగా అనేక టోర్నమెంటులలో ఆడాడు ఆ కాలమున విశాఖపట్నం స్పోర్ట్స్‌మెన్ క్లబ్ ప్రముఖ ఆటగాళ్లైన సయ్యద్‌హుసేన్ , మద్ది సింహాచలం, రాధాకృష్ణ, ఉమ్మి సత్యనారాయణరావులతో కలసి టోర్నమెంటులలో పాల్గొన్నారు ఇన్‌సైడ్ లెఫ్ట్ అయినను రెండుకాళ్ళతో బంతి ఆడించుట, తన్నుటయందు ఈయనకు మంచి నేర్పు గలదు

16వ ఏటనే 'బ్లూ రిబ్బన్ ఆఫ్ ఇండియన్ సోకర్'గా ఎంచబడు కలకత్తా ఐ ఎఫ్ ఎ షీల్డు టోర్నమెంటులో మొదటిసారిగా పాల్గొని మంచి ఆటగానిగా గుర్తించబడ్డారు.1952 వరకు విజయవాడ, ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్నం, ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహారులలో జరిగిన అనేక టోర్నమెంటులలో పాల్గొని జట్టు-విజయానికి తోడ్పడ్డారు

1953లో వరహాలు ప్రతిభను గుర్తించి కలకత్తా ప్రధమ డివిజన్‌కు చెందిన బి ఎన్ రైల్వే ఫుట్‌బాల్ క్లబ్‌నుండి అహ్వానము అందుకొని కలకత్తాకు నివాసము మార్చారు ఇరవై ఏళ్ళకుపైగా కలకత్తా అగ్రగామి జట్టులలో ఆడి, అనేక గోలులుచేసి పత్రికలు, అభిమానుల ప్రశంసలు పొందారు

ప్రధమసారిగా విదేశజట్టుతో అడు అవకాశము వరహాలుకు 1954లో లభించింది

సంతోష్ ట్రోఫీ జాతీయ ఫుట్‌బాల్ టోర్నమెంటులో అనేక సంవత్సరములు పాల్గొనుటయేగాక, 1958లో బెంగాల్ జట్టు స్కిప్పర్‌గాకూడా వున్నారు. బెంగాల్ జట్టునకు నాయకత్వం వహించిన ఆంధ్రులు వీరు ఒక్కరే. 1959లో సంతోష్‌ట్రోఫీ బెంగాల్ గెల్చుటలో వరహాలు కృషి ఎంతో గలదు.

1958లో మనదేశ జట్టు బర్మా పర్యటించినది. ఆ జట్టులో వరహాలుగలరు రంగూన్‌లో బర్మా ఎలెవన్‌తో జరిగిన పోటీలో వరహాలు మన జట్టునకు విజయం చేకూర్చారు. 1960 జాతీయ పోటీలలో ఇండియన్ రైల్వే జట్టు కెప్టెన్‌గా వున్నారు అదే సంవత్సరం రోమ్ ఒలింపిక్ క్రీడలయందు పాల్గొను మనదేశ జట్టు 'శిక్షణ శిబిరము'లో గలరు

మన మాజీ రాష్ట్రపతులు బాబూ రాజేంద్రప్రసాద్, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ, డాక్టర్ జాకీర్‌హుస్సేన్, ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూలవద్దనుండి బహుమతులు అందుకున్నారు బి ఎన్ రైల్వేలో టికట్టు ఎగ్జామినర్‌గా పనిచేశారు.

విశాఖపట్నం మహారాణిపేటలో, బుచ్చి సుందరరావు వీధిలోని యిల్లు ఎల్లప్పుడు ఫుట్‌బాల్ ఆటగాళ్లతో కళ కళలాడుచుండేది. అభిమానులకు వరహాలు భౌతికంగా దూరమైనా 'పెరల్ ఆఫ్ ఆంధ్ర' పేరు మాత్రం తెలుగు క్రీడారంగం మరువలేదు



1959లో ఢిల్లీ దూరండ్‌కప్ టోర్నమెంటు పోటీల సందర్భంగా అప్పటి భారత ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూతో కరచాలనం చేస్తున్న శ్రీ వరహాలు

\- ముకరమ్



# అమ్మ ఎవరు? నాన్న ఎవరు?

జి.యస్.సింహామూర్తి

కొండలూ కోనలూ దాటుకుంటూ పరుగెడుతుంది రైలు

చుట్టుకున్న ఆలోచనలు కంపార్ట్‌మెంట్‌లో కూర్చున్న సుకుమార్‌ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి

దిబ్యూగర్‌లో ఆర్మీలో పని చేస్తున్న తనకు మదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మీడియట్లీ' అంటూ వచ్చిన టెలిగ్రామ్ చిన్న అధికార్ల రికమెండేషన్స్‌తో కమాండింగ్ ఆఫీసర్ చేతికెళ్ళి లీవ్ సాంక్షనయ్యేసరికి నానా యిబ్బందులూ పడ్డాడు

వీళ్ళందరికీ అమ్మల్లేరా అనిపించిందతనికి

చావు బతుకుల్లో ఉండే ఆర్మీ రూల్సు లీవ్ రూల్సు చూసుకొని, అందుకు ప్రత్యామ్నాయంగా మరో వ్యక్తిని ఆ సీటులో వేస్తే గాని యివతల వ్యక్తికి సెలవు మంజూరుకాదు

అసలే మానసికాందోళనతో బాధపడుతూంటే ఆర్మీ క్రమ శిక్షణ తనని మరింత కృంగదీసేదిగా యిబ్బంది పెట్టింది

జోర్హాట్ మీదుగా కలకత్తా వచ్చి కలకత్తాలో బండి మారాడు సుకుమార్ ఆంధ్రా బోర్డరులో ఉంది బరంపురం. తను తెలుగువాడే కాని బరంపురంలో తనెందుకు ఉండాల్సివచ్చిందో తనకు తెలియదు

తల్లిని యెన్నడూ ఆ విషయం అడగలేదు

తల్లి సరస్వతి ఒక్కర్తే బరంపురంలో ఉంది తనకంటూ యెవరూ లేరు సుకుమార్‌కి స్నేహితులూ, చుట్టుపట్ల వాళ్ళూ తప్ప ఇంకెవ్వరూ తనకు తెలియదు

సరస్వతి బరంపురంలో చాలాకాలం ఓ ప్రవేటు నర్సింగ్‌హోంలో నర్స్‌గా పని చేసింది ఆ తర్వాత యింకో నర్సింగ్‌హోంలో – అలాగే తన జీవనోపాదికి ఆ చిన్న ఉద్యోగమే సరిపోయింది ఆవిడ ట్రైన్డ్ నర్సు కాని గవర్నమెంటు ఉద్యోగం సంపాదించడానికి కావలసిన కాగితాలు లేక ఊరుకుండిపోయింది

ఆంధ్రా నుంచి బరంపురం వెళ్లేటప్పుడు చేస్తున్న గవర్నమెంటు ఉద్యోగం వదిలేసి తన సర్టిఫికెట్సు కూడా అక్కడే వదులుకొని వెళ్ళిపోవడంతో ప్రవేటు నర్సింగ్ హోంలోనే ఏదో ఉద్యోగం దొరుకుతుందన్న ధైర్యంతో అప్పటి కాలమాన పరిస్థితులవల్లా అలా చేసింది

దీని వెనకగల వివరాలూ నిగూఢమైన విషయాలూ ఆమెకు తప్ప మరెవ్వరికీ తెలియవు

అందుకే సుకుమార్‌కి తల్లి గమనం అంతా అయోమయం ఎన్నడూ తాను విషయాల కోసం నిలదీయలేదు అటువంటి పరిస్థితులు ఆమె రానీయలేదు

ఇ యం ఇ సెంటర్ సికింద్రాబాద్‌లో ట్రైయినింగ్‌కి వెళ్ళిపోయిన తర్వాత గాని కొడుకు ఆర్మీలో చేరాడని సరస్వతికి తెలియదు

ఇంటర్ పాసయితే తప్పకుండా పెద్ద చదువు చెప్పించాలనుకున్న సరస్వతి ఆశ భగ్నమయ్యింది

కొడుకు ఆర్మీకి వెళ్ళినందుకు సంబరపడలేదు గాని ఒక్కో వ్యక్తికి, ఒక్కో బాధ్యత అలా అనుకోకుండానే స్వీకరించాల్సి వస్తుందని వేదాంతం నెమరువేసుకుంది

అలా ఆమె వేదాంతం నెమరు వేసుకునేటప్పుడు ఇరవై సంవత్సరాల క్రితం జరిగిన వెప్పుడూ తన నయనాల ముందు సజీవంగా కదులుతూనే ఉంటాయి

★ ★ ★

సరస్వతీ! నన్ను నమ్మించి యింత ద్రోహం చేస్తావా?"

ప్రకాశ్‌రావు ఆగ్రహంతో ఉన్నాడు

సరస్వతి మాట్లాడలేదు

ఊయలలో చిన్న పిల్లాడు నిద్రపోతున్నాడు

"మనం పెళ్ళాడి ఆదర్శంగా బతుకుదామనుకున్నాం కులాలు వేరయినా మనసులే ముఖ్యమని చాటి చెపుదామనుకున్నాం కాని నువ్వు నన్ను మోసగించావ్– చెప్పు, పెళ్లి చేసుకున్నావా?"

లేదు

అయితే ఈ బిడ్డని పెళ్లి కాకుండానే కన్నావన్నమాట?" మళ్ళీ గద్దించాడు

'అవును ప్రకాశ్"

–షాక్ నుంచి తేరుకుని "ఎవరతను?" చెప్పు అన్నాడు

"నేను ప్రేమించినతను"– ఆమె గొంతు పెగిల్చి చెప్పింది

"నన్నూ ప్రేమించానన్నావ్– పెళ్లాడతానన్నావ్– ఎంతమందిని ప్రేమించావో– యింకా యింకెంత మంది పిల్లల్ని కంటావో – నీ నీచత్వం, నీ కుటిలత్వం, నీ వ్యభిచారనైజం నాకిప్పుడర్థమయింది " అతనిలో క్షణక్షణానికీ ఆమెపై ద్వేషం, అసహ్యం పెరిగిపోతోంది

"అవును ప్రకాశ్, నావంటి వ్యభిచారితో, ، కులటతో పతితతో నువ్వు జీవితంలో అనుభవించేది శూన్యం అందుకే నీతీ నిజాయితీ సభ్యతా సంస్కారం గల మరో అమ్మాయిని నువ్వు పెళ్ళాడగలిగితే నేను కాదనను "

ఇన్ని సంవత్సరాల తపస్సు తర్వాత నీ కోసం నేనెన్నో వదులుకొని నీ తియ్యని స్నేహం కోసం వస్తే నువ్వింత క్రూరంగా కఠినంగా మాట్లాడతావని నేననుకోలేదు నువ్వో విషసర్పానివని

# అమ్మ ఎవరు? నాన్న ఎవరు?

తెలిసిందిప్పుడు సరస్వతీ' ప్రకాశ్ అంతరాత్మ రోదిస్తోంది

"ఇంకెన్నో విషసర్పాలుండొచ్చు యిటువంటి నాలాంటి అవినీతికి నిలయమైన స్త్రీల దగ్గర– యింకా నన్ను తిట్టుతూ కూర్చునేకంటే గౌరవంగా యిక్కడ్నుంచి వెళ్ళిపోవడం యిద్దరికీ మంచిది "

'కాని, నువ్వేపాపాన్ని దాచుకుని యిలా నన్ను మోసగించావో, ఏ మోసాన్నిలా పాపలా పెంచుకుంటున్నావో దానిని హతమార్చే

ప్రకాశ్ భయపడ్డాడు ఉగ్రంగా ఉన్న ఆమె ముఖంలోకి చూసి

ప్రేమ దక్కలేదని ఎసఃండు ప్రాణాలు తియ్యడానికి తయారయ్యే వంటి నీలోనూ పశుత్వం ఉందని అర్థమయింది కాని తల్లి బిడ్డనెలా కనుక్కున్నా తన ప్రేమతో సాకడం తప్ప యింకొకటి తెలియదు కన్న తల్లే కబళించడం ప్రారంభిస్తే ఈ లోకంలో జీవరాశి ఎప్పుడో మాయమయ్యి ఉండేది వెళ్ళు– వెళ్ళిపో అంటూ గర్జించింది

వెళ్ళాను అంటూ ప్రకాశ్‌రావు ఊయలలో ఉన్న పసికందు దగ్గరకెళ్ళబోయాడు రాక్షసుడిలా

సరస్వతి "ప్రకాశ్' అంటూ అతని ముందుకెళ్ళి వెనక్కి తోసింది

అతను ఆమెను పక్కకు లాగబోయాడు

ఆమె ఆడపులిలా అతనిమీద పడింది

ప్రకాశ్ ఆమెను విదిలించి కొట్టాడు

ఆమె మళ్ళీ అతన్ని వెనక్కి తోసి పక్క కిటికీలో పడున్న చాకుఎత్తి అతనిమీద పడబోయింది

ప్రకాశ్ తానెందుకు తొందరపడ్డాడో తెలిసి శాంతించాడు

ఇక ఆ ప్రదేశంలో ఒక్కక్షణం కూడా ఉండకూడదని వెళ్ళిపోయాడు

* * * * * * * *

నలభై వసంతాలు సరస్వతి జీవితంలో మండిపోయాయి అందమైన ఆ శరీరం ఆకర్షణీయమైన ఆ కళ్ళూ కళావిహీనమై కృశించిపోయాయి

ఆమె మనోవేదన శరీరాన్ని శుష్కింప జేసింది అందీ అందని ఆదర్శాలు వమ్మయి పోయాయి

అయినవాళ్ళందరినీ వొదులుకుని అజ్ఞాతంగా బరంపురంలో ఓ మూల చిన్ని కొంపలో తన జీవితం అశాంతితో అనారోగ్యంతో సాగుతుంది

డాక్టర్లు పెదవి విరిచారు

అయినా బతుకుదామని బతికేదో సాధించాలనీ తనకులేవు తన బాధ్యత తీర్చుకున్నట్లే భావన

తన వెచ్చా వేడీ చూస్తూ తనకి కలిగింది తీసుకెళ్ళి తన పిల్లా పాపల్తో బతుకుతున్న అరవై సంవత్సరాల అరవ వృద్ధురాలు కన్నమ్మ తప్ప యింకెవరూ లేరు

కష్ట సుఖాల్లో పాలు పంచుకుంటున్న ఆత్మీయురాలు కన్నమ్మ సరస్వతికి మందూ మాకూ పోస్తుంది కాని మెతుకులు వండి బలవంతంమీద యింతకాలమూ తినిపించింది

కాని సరస్వతికి తిండి సహించదు తినాలని లేదు కడుపులో బాధ శ్వాస తీసుకోవడానికి కష్టం

అందుకే కొడుకుని సెలవుల్లో ఓసారి రమ్మని ఉత్తరం రాసింది

అతను రాలేకపోయాడు

ఇక బతుకుతానన్న ఆశ లేకపోయింది ఆఖరి క్షణంలో కన్న కొడుకు దగ్గర లేకుండా పోతే ఆమెను మట్టిలో కలిపే వాళ్ళుండరని కన్నమ్మే టెలిగ్రాం యిప్పించింది

* * * * * *

అమ్మా ఆ బంధం కూడా తెగిపోయింది

ఇంత కాలం పెంచింది తనకో దారి చూపిన తల్లి ఇకలేదు

గుమ్మంలో అడుగుపెట్టేసరికి అప్పుడే ఆమెను సమాధి చేసి తిరిగొచ్చిన వాళ్ళు తనని ఊరడించారు

ఈ బాబుగారే అన్నీ చూసుకున్నారు బాబూ కొడుకువైన నీకు లేని అదృష్టం ఆయనకు కలిగింది అంది కన్నమ్మ

సుకుమార్ అతనివేపు పరీక్షగా చూశాడు

ఆ చూపుల్లో ప్రశ్నలు అతనికి తెలుసు

నేను మీకు కావలసిన దగ్గరబంధువుని బాబూ ప్రకాశరావు అంటారు– పద చాలా దూరం నుంచి వస్తున్నావ్, రెస్టు తీసుకుందువుగాని అంటూ ఆ నడివయస్కుడు అతణ్ణి వోదార్చాడు

తమకెవరూ లేరని చెప్పేది అమ్మ– తాత ఎవరో, మామ్మ ఎవరో నాన్న ఎవరో వాళ్ళ బంధువులెవరో తెలియని తనకు ఈ ప్రకాశరావెవరు?

తనకంటూ ఓ చోటు లేదు ఉన్నదల్లా అద్దెకొంప సంపాయించిన ఆస్తిపాస్తులు లేవు ఇప్పుడు తను ఏకాకి

సుకుమార్ ఆలోచనలో పడ్డాడు

పదో రోజు చెయ్యాల్సిన దినకార్యం మూడో రోజునే పూర్తి చేసేసి ఇక తన ఉద్యోగానికి వెళ్ళిపోయి తన బతుకేదో తాను చూసుకోవడం మంచిదనుకున్నాడు సుకుమార్

ప్రకాశరావు సుకుమార్ అభిప్రాయానికి మారు మాటాడలేదు

సరస్వతి దినకార్యం మూడో రోజున ముగిసింది

సుకుమార్ తన సామానంతా సర్దుకున్నాడు ఇక యింట్లో ఉన్నదల్లా ఓ పాత ట్రంకు అందులో తల్లి తాలూకు బట్టలు అవన్నీ ఎవరికైనా యిచ్చేయాలని తీసాడు అలా తీసెయ్యబోతుంటే ట్రంకు క్రింద కాగితం కింద ఉత్తరాలకట్ట!!!

ఒక్కోటీ చదివాడు అతను

ఆమెకెవరో ఇరవై సంవత్సరాల క్రితం రాసిన ప్రేమలేఖలు!

ఎంత గాఢంగా ప్రేమించుకున్నారు?

తన తండ్రి అతనే అయి ఉండొచ్చా?

అయితే ఎప్పుడూ చెప్పలేదే?– కనుక తన తల్లి ఏదో తప్పు చేసి ఉండొచ్చు అది కప్పిపుచ్చుకుని యింతకాలం గడిపేసిన ఓ పతిత! నీతిమాలిన ఆడది అన్నమాట!

సుకుమార్ తన సూట్‌కేస్ సర్దుకున్నాడు ఇక ఆ ఛాయల్లో ఉండకూడదు అప్పుడే తనకు మనశ్శాంతి

ఉషోదయం

బయట అరుగుమీద ప్రకాశరావు కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు

"ఏం బాబూ ఎక్కడికింత పొద్దున్నే ప్రయాణం?" ప్రయాణంకట్టిన సుకుమార్ని ప్రశ్నించాడు

"ఇక్కడ నాకేముందని?– నేనెంతో గౌరవించిన అమ్మ నిజస్వరూపం కూడా తెలిసింది ఆమె ఓ పతిత'నీతిమాలింది"

## చేప నూనెతో రక్తపోటు నివారణ

పెద్ద మోతాదులలో ఇచ్చే చేప-నూనె అధిక రక్తపోటు నుంచి ఉపశమనం కలిగించడంతో పాటు రక్తపోటుకు సాధారణంగా ఉపయోగించే ఔషధాల వలె పనిచేస్తుందని అమెరికాలోని వాండర్‌బిల్ట్ యూనివర్శిటీ పరిశోధకులు వెల్లడించారు

ఇటీవల ఈ విషయుపై తాజాగా జరిపిన పరిశోధనలలో చేప నూనెకు గల ఈ సామర్థ్యాన్ని గట్టిగా రుజువు చేసే సాక్ష్యాధారాలు లభ్యమయ్యాయి.

ఇదివరలో జరిపిన పరిశీలనలో చేప నూనె హృదయ కోశంలో దెబ్బతిన్న రక్తనాళాలకు 'మరమ్మతు' చేయడం ద్వారా ఇది రక్తంలో ప్రమాదకరమైన స్థాయిలో ఏర్పడే క్రొవ్వు (కొలెస్ట్రాల్)ను తగ్గించి రక్తానికి గల గడ్డకట్టే స్వభావాన్ని మందగింప జేస్తుందని వెల్లడైంది.

ఈ పరిశోధనలు జరిపిన వాండర్‌బిల్ట్ పరిశోధకులైన డాక్టర్ హోవర్డ్‌నాప్, గారెట్ ఫిట్జ్‌రాల్డ్ లకు వాస్తవానికి చేప నూనె ప్రయోజనాల విషయంలో తొలుత సందేహాలు ఏర్పడ్డాయి. అయితే ఆ తర్వాత అది చూపిన ఫలితాలు తమకు ఆశ్చర్యం కలిగించాయని వారు చెప్పారు.

అయితే ప్రజలు తాము రక్తపోటుకు వాడే గుళికలను ఆపివేసి వాటికి బదులుగా చేపనూనెను వినియోగించడానికి "ఇంకా కొంత వ్యవధి" వున్నదని ఈ పరిశోధకులు పేర్కొన్నారు.

# ప్రశ్నావళి

## — కె. రామలక్ష్మి

చలపాక ప్రకాష్, విజయవాడ

ప్రేమ ఎంత మధురం భగ్న ప్రేమ అంత కఠినం మరి భగ్న ప్రేమికులకి మీ రిచ్చే సలహా?

* భగ్నింపబడకుండా జాగ్రత్త పడండని!!

**కొందరు తెలుగువారు ఇంగ్లీషు, హిందీ మాట్లాడడానికి మొజు పడుతున్నారు. అంటే తెలుగు వాళ్ళే తెలుగు భాషను అగౌరవ పరుస్తున్నారు కారణం?**

* దీనికో కారణం ఎందుకు? అలా తెలుగుని ఖూనీ చేసే కంటే ఇంగ్లీషులో ఏడు అనే వాడు మా పెదమామయ్య ఇప్పుడు కొందరింగ్లీషు మాట్లాడుతూంటే బాబూ ఏ తెలుగొస్తే దాల్లోనే ఏడవండి. మమ్మల్ని ఏడిపించకండి అనాలనిపిస్తోంది చూడండి భాష- ఓ వెహికల్ ఫర్ కమ్యూనికేటింగ్ అర్థమైతే- చాలదా- అగౌరవం ప్రశ్న- దేనికి?!

శ్రీకొండ నవీన్, గూడూరు

భారత దేశాన్ని సమర్థవంతంగా నిర్వహించడానికి రాష్ట్రపతి కావాలని ప్రజలు కోరినప్పుడు మీరు ఎవరి పేరు సూచించుతారు?

* మనం ఎవరం సూచించడానికి?! ఈ దేశపు ప్రజాస్వామ్యానికీ- ప్రజలకీ సంబంధం లేదు ప్రజలకీ ఓట్లకీ తప్ప! అంచేత ఎవరూ సూచన లివ్వక్కర లేదు- బుట్టబొమ్మ నొకరిని నిలపడానికి!

నిజంగా మిమ్ము నా వారిగా భావించాను నేను మైకంలో వున్నాను క్షమించాలి . అంటే ఎదుటి వ్యక్తి ఏం సమాధానం యివ్వాలి? ఎలా ప్రవర్తించాలి?

* ముందు చాచి చెంపపెట్టు పెట్టి- మైకం వదల్చాలి తరువాత 'నీ వంటి వ్యక్తిని నా వాడనుకోవడం పొరపాటైంది' అని గుడ్‌బై చెప్పాలి కొందరు తాగి - ఏం చేసినా ఏం అన్నా ఫరవాలేదు 'మైకం' లెక్కలో పోతుందనుకుంటారు మర్నాడు వెధవ ముఖాలు వేసుకుని సిద్ధం! అలాంటి వారికి ఎవరో పరిస్థితి చెప్పకపోతే- నైతికంగా మన బాధ్యత మనం గుర్తించవట్టేనని నా ఉద్దేశ్యం

**జె. రామచంద్రరావు, అయిజ**

ఒక అమ్మాయిని ప్రేమించాను అమ్మాయికీ విషయం ఎలా చెప్పాలి అని ఎవరినడిగినా 'ధైర్యం చేసి చెప్పెయ్' అంటారు ఆ ధైర్యం వుంటే తమనెందుకు సలహా అడుగుతాడని అర్థం చేసుకోరేం?

* ఏం లేదు తమ్ముడు ప్రేమరోగం- ఎవరిది వారిదే- దీనికి కామన్ లక్షణాలు వుండవు అంచేత- ఎవరి పద్ధతి వారు అనుసరించాలి మరి అయినా అమ్మాయికి ప్రేమ గురించి చెప్పేముందు- మీ పెద్దలని అడిగేస్తే పోలేటూ!

కె. సన్నీ, అనకాపల్లి

**దేవుణ్ణి పూజించడానికి గుడికే వెళ్ళాలా? దైవత్వం హృదయంలో ఉండదా?**

* ఎందుకుండదు వుంటుంది కాని కొంపలో ఏకాగ్రత కుదరదని గుడికి వెళ్ళమంటారు (మహా? అక్కడ వుండేట్టు!)

**ధనముంటేనే స్నేహం కలకాలం నిలుస్తుందా?**

* డబ్బుకీ, స్నేహానికి ముడి వేస్తే- అది ఎప్పుడూ కలకాలం నిలవదు

**యు. యు. ఉరుకుందు, ఎమ్మిగనూరు.**

పోయినోళ్ళంతా మంచోళ్ళు ఉన్నోళ్ళు పోయినోళ్ల తీపిగురుతులు అంతేనంటారా?

* ఎలా అంటానయ్యా ఉన్నవాళ్లు కాల్చుకు తింటూ వుంటే?!

బి. కుమారస్వామి, వరంగల్

**రామలక్ష్మిగారూ, నేటి సినిమా పాటలపై మీ నిర్మొహ మాటమైన అభిప్రాయం చెప్పండి.**

* ఏముంది? కొట్టు పట్టు విప్పు చుట్టు అమ్మమ్మో అబ్బొబ్బొ లాంటి పది మాటల బలం చేబట్టి ఒంట బట్టించుకొంటే చాలు నేటి సినిమా పాట రాయడానికి! ప్రేమ డ్యూయెట్ అయితే చీర కుచ్చెళ్ళు సవరించు దోచుకో లు చాలు కవ్వించే పాటైతే- ఓ రబ్బో ఓ లమ్మో నిన్నం జేయిన్రో అని గోలపెట్టేస్తే చాలు, కీసింగ్ సాంగా? చూడనీ ముందందం! వెనకందం! విప్పనీ పట్టు కొంగు మీ యిష్టం ఇక సందేశాత్మక సాంగా? ఉత్తేజం ఉన్మాదం ఉవ్వెత్తు రక్తపాతం పడిసాగు. చంపు నరుకు- చాలదా?! నేటి సినిమాలకి తగ్గట్టుగానే వుంటున్నాయి- పాటలూ అందుకే పాత పాటల కంత గిరాకీ పెరిగింది పూర్వంలో ఆత్రేయ పచ్చగడ్డి కోసుకునే పడుచు పిల్లా అంటే బాబోయ్ అన్నారు ఇప్పుడది- 'పట్టదండీ' అంటారు డైరెక్టర్లు ఇది రంగ ప్రవేశం చేసిన నిర్మాతలు దర్శకులు రచయితలు అభిరుచికీ ప్రేక్షకుల దిగజారుడు తనానికీ- నిదర్శన అన్నా తప్పు లేదేమో! ●

---

అంటూ బాదపడ్డాడు

ఇద్దరూ కాస్సేపు మర్షణపడ్డారు

సుకుమార్ తన చేతిలో ఉన్న ఆ ఉత్తరాలకట్ట అతనికిచ్చాడు చదివితే అర్థం అవుతుందని

ప్రకాశ్‌రావు వాటినన్నిటినీ ఓసారి చూశాడు అతని ముఖం గంభీరమైపోయింది

ఇపుడు సరస్వతి తనకి పూర్తిగా అర్థమయ్యింది

అయితే ఈ ఉత్తరం కూడా చదివి నీ తల్లి ఎటువంటిదో నువ్వే నిర్ధారణ చెయ్యి సుకుమార్ అంటూ అతను తన బేగ్‌లోంచి ఓ ఉత్తరం తీసి యిచ్చాడు

ప్రియమైన ప్రకాష్!

మనిద్దరం వివాహం చేసుకుందాం అనుకున్నాం కాని నేను నర్స్ ట్రైనింగ్‌లో ఉండగా ఓ అభాగ్యురాలు పెళ్ళికాకుండానే తల్లి అయింది ఆమె తన బిడ్డతో సహా ప్రాణత్యాగం చెయ్యబోతుంటే సమయానికి నేను అడ్డుపడి ఆ బిడ్డ నా బిడ్డగా పెంచుకుంటానని చెప్పి, హాయిగా ఆమెను తనకు నిర్ణయమైన వివాహం చేసుకోమనడమేకాదు అది దగ్గరుండి నేనే చేయించాను ఆమెకో బిడ్డ ఉన్నా కన్యగానే వివాహమాడింది అందుకే ఆ బిడ్డతో నేను బరంపురం వచ్చేశాను కాని నేను ఎవరికో ఓ బిడ్డ కన్నట్టు మిమ్మల్ని నమ్మించాను ఇన్ని సంవత్సరాలూ ఆ రహస్యం నాలోనే దాచుకున్నాను కాని నేనో వంచకినని శాశ్వతంగా స్త్రీజాతినే అసహ్యించుకుంటారేమోనని ఈ నిజం మీకు రాస్తున్నాను

జీవిత చరమాంకంలో ఈ సత్యం బయట పెట్టినా ఎవరి బతుకులోనూ ఏ అనర్థమూ జరగదుకదా! కొంత ఆత్మశాంతి చేకూరగలదనే వెర్రి ఆశ నన్ను క్షమించండి

ప్రేమతో
సరస్వతి

సుకుమార్ కళ్ళు అశ్రుపూరితాలైనాయి

'అయితే అమ్మ నన్ను కనలేదా?

కనకపోవచ్చు కాని ఆమె అంతకంటే గొప్పది బాబూ''

'నా తండ్రి యెవరు?

'ఆమె మహోన్నతమైన త్యాగానికి సర్వదా వినమ్రుణ్ణి ఆ ప్రేమమూర్తి హృదయంలో అనునిత్యం ఊపిరిగా నిలిచిన ప్రకాశ్‌ని నేనే ఇక నుంచీ నీ తండ్రిని బాబూ' అంటూ ప్రకాశ్‌రావు అతణ్ణి హృదయానికి మరింత దగ్గరగా హత్తుకున్నాడు ●

# మన రక్తపరీక్షవలన ఏమేమి తెలుస్తుంది?

రక్తం మన శరీరంలో చాలా ముఖ్యమైన ధర్మాలను నిర్వర్తిస్తోంది జీర్ణమైన ఆహారం, నీటిని, ఆక్సిజన్‌ని శరీరంలోని అన్ని భాగాలకు తీసుకుపోతోంది అలాగే వాటిలోని వ్యర్థపదార్థాలని ముఖ్యంగా కార్బన్‌డయాక్సైడ్‌ని సేకరించి ఊపిరితిత్తులకు చేరవేస్తోంది అందుకే శరీరంలో ఏ భాగంకైనా, ఏ కారణం చేతయినా రక్తం వెళ్ళకపోతే ఆ ప్రాంతం 'గాంగ్రిన్'తో కుళ్ళిపోతుంది

శరీరంలోని అన్ని భాగాలకు రక్తం చేరవేయడానికి వీలుగా ఆర్టెరీస్ శాఖోపశాఖలుగా చీలివున్నాయి ఈ రక్తనాళాలు చివర్న అతి సన్నని కేపలరీస్‌గా మారి సరాసరి ధాతువులలోకి చొచ్చుకుపోతాయి అలాగే కార్బన్‌డయాక్సైడ్‌తో కూడుకున్న రక్తాన్ని తిరిగి వెనక్కి గుండె, ఊపిరితిత్తులకు తీసుకుపోవడానికి 'వీన్స్' శాఖలున్నాయి

రక్తంలోని ప్లాస్మాలో ఎర్ర, తెల్ల రక్త కణాలు, ప్లేట్‌లెట్ సెల్స్ తేలుతూ వుంటాయి ఈ ప్లాస్మాలోకి జీర్ణమైన ఆహారం, నీరు, గ్రహింపబడి, రక్తంతోపాటు ప్రవహిస్తూ శరీరమంతటికీ అందించబడుతుంది అలాగే పనికిరాని పదార్థాలైన యూరియా, యూరిక్ యాసిడ్‌లనుసేకరించి ఊపిరితిత్తులకు, లివర్‌కి, మూత్రపిండాలకి, చర్మానికి చేర్చి, అక్కడ నుంచి బయటకి పంపేవీలుని కల్పిస్తోంది పాపా

ఎర్ర రక్తకణాలు మనం పీల్చిన గాలిలోని ఆక్సిజన్‌ని శరీరంలోని అన్ని భాగాలకు అందచేసి, వాటి లోని కార్బన్‌డయా



డాక్టర్ కె ఎస్ రత్నాకర్ "పేథాలజి హెడ్"గా హైదరాబాద్ నిజామ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో పని చేస్తున్నారు

క్సైడ్‌ని సేకరించి గుండె ద్వారా ఊపిరితిత్తులకు చేరవేస్తున్నాయి ఇవి గుండ్రని బిళ్ళలు వంటివి రెండు ప్రక్కలా నిమ్నములుగా వుంటాయి అసంఖ్యాకంగా వుంటాయి ఒక ఘన మిల్లీ మీటరుకు యాభై లక్షల ఎర్ర రక్తకణాలు వుంటాయి స్త్రీలలో అయితే ఘన మిల్లీ మీటరుకు 45 లక్షల ఎర్ర రక్తకణాలు వుంటాయి వీటిలో హిమోగ్లోబిన్ అనే ఇనుము వున్న వర్ణ పదార్థముంటుంది ఆక్సిజన్‌ని పీల్చినప్పుడు ఈ హిమోగ్లోబిన్ బాగా ఎర్రబడుతుంది అంటే ఆర్టెరీస్‌లోని ఎర్ర రక్తకణాలు బాగా ఎర్రగా వుంటాయన్నమాట హిమోగ్లోబిన్ ఆక్సిజన్‌ని ధాతువులకిచ్చేసి కార్బన్‌డయాక్సైడ్‌ని పీల్చగానే నలుపుడాలుగా మారుతుంది ఇలా ఒక రక్తకణము మూడు, నాల్గు నెలలు పని చేసిన తర్వాత లివరు, స్ప్లీను వాటిని చిదిపివేసి, ఎర్రరక్తకణాలలో వున్న ఇనుమును ఎముకల లోపల వున్న మజ్జా ధాతువుకు పంపిస్తాయి దీనిని వుపయోగించుకుని మజ్జాధాతువు కొత్త కణాలని వుత్పత్తి చేస్తుంది అయితే నశించిన కణాల నుంచి సేకరించిన ఇనుము నూతన కణాల తయారీకి చాలదు అందుకనే మనం ఆహారంలో ఇనుము వున్న పదార్థాలని తీసుకోవాలి

తెల్లరక్తకణాలు ఎర్రరక్తకణాలకన్నా పెద్దః ఘన మిల్లీ మీటరుకు ఎనిమిది వేల నుంచి పదివేల వరకు మాత్రమే తెల్లకణాలుంటాయి తెల్ల రక్తకణాలు మజ్జాధాతువులోను, లింఫ్ గ్రంధులలోను వుత్పత్తి అవుతాయి రక్తంలో తిరిగేప్పుడు ఇవి తమ రూపాన్ని మార్చుకోగలవు కేపిలరీల గోడలలో వున్న సూక్ష్మ రంధ్రాల ద్వారా ఇవి దూరిపో గలవు మళ్ళీ కేపిలరీలలోకి రాగలవు శరీరములో పరాయి వస్తువు లైన రేణు వులను, బేక్టీరియాలను ఇవి చుట్టుముట్టి దిగమ్రింగగలవు శరీరంలో తీవ్రమైన క్రిమిదోషము ఏర్పడినప్పుడు వీటి సంఖ్య పెరుగుతుంది టైఫాయిడ్ వంటి క్రిమిదోషములలో వీటి సంఖ్య తగ్గిపోతుంది ఈ స్థితిని 'ల్యూకోపీనియా' అంటారు మృత క్రిములు, మృత తెల్ల రక్తకణాలు, మృత జీవకణాలు కలిసి చీముగా ఏర్పడతాయి తెల్ల కణాలలో చాలా రకాలున్నాయి ఒక చిన్న గాజుముక్కపై ఒక రక్తబిందువును పరచి అందులో ఏ రకం తెల్ల కణాలు ఎన్ని వున్నాయో లెక్కకట్టి రోగ నిర్ధారణ చేస్తుంటారు ఇసినోఫిల్ రకం ఆస్త్మా, ఎక్జిమా వంటి ఎలర్జీ రోగాలలోను, శరీరంలో కొన్ని పేరసైట్‌లు చేరినప్పుడు అధికమవుతాయి

## గడ్డకట్టే రక్తం

ప్లేట్లెట్ సెల్స్ ఎర్ర రక్త కణాలకన్నా చిన్నవి సంఖ్య తక్కువగా వుంటుంది రక్తం గడ్డకట్టడానికి ఇవి తోడ్పడతాయి రక్తస్రావమవుతున్నప్పుడు ముందు ప్లేట్‌లెట్ సెల్స్



రక్తపరీక్షల ద్వారా మన ఆరోగ్యాన్నేకాదు, అనారోగ్యాన్ని వివరంగా తెలుసుకోవచ్చు

# చికిత్సా విధానంలో రక్తపరీక్ష అవసరం!

చితికి త్రాంబోప్లాస్టిన్ అనే పదార్థము తయారవుతుంది అప్పుడు లింపులో తయారైన ప్రోత్రాంబిన్ కూడా రక్తంలోకి వస్తుంది రక్తంలోని విటమిన్ 'కె' కేల్షియముల సాన్నిధ్యములో త్రాంబో ప్లాస్టిన్, ప్రోత్రాంబిన్‌ల కలయికతో త్రాంబిన్ అనే పదార్థము తయారవుతుంది ఈ త్రాంబిన్ రక్తంలో వున్న ఫైబ్రినోజిన్ అనే ప్రొటీన్‌తో కలసి ఫైబ్రిన్ తంతువులు తయారవుతాయి ఈ ఫైబ్రిన్ తంతువులలో తయారైన వలలో ఎర్ర, తెల్ల రక్తకణాలు ఇరుక్కుని, గడ్డకడ్తాయి ఇలా గడ్డకట్టిన తర్వాత మిగిలిన భాగాన్ని సీరమ్ అంటారు.

రక్తం కేపిలరీలలో తిరుగుతున్నప్పుడు కొంత ప్లాస్మా కే పిలరీల గోడలగుండా బయటకి వెళ్తుంది ఇలా రక్తనాళికలగుండా పైకి ఉబికిన ద్రావకాన్ని 'లింపు' అంటారు

ఎర్ర రక్తకణాలలో ఎగ్లూటినోజన్ అనే వస్తువు గ్రహీత, రక్తంలో ఎగ్లూటినిన్ అనే వస్తువు వుంటాయి

ఈ రెంటి మధ్య రియాక్షన్‌వల్ల ఒకరి రక్తం మరొకరికి పడదు రక్త ప్రదాత రక్తములో ఎర్ర రక్తకణములు, రక్త గ్రహీత శరీరముతో ఇమడడమే రక్తదానంలో ముఖ్యమైన విషయము మానవ రక్తంలో ఎగ్లూటినోజన్లు ఎ, బి - అని రెండు రకాలు 'ఎ' రకము రక్తము వున్నవారు 'ఎ' గ్రూపుకు చెందిన వారు, 'బి' రకము వున్నవారు 'బి' గ్రూపు కొంత మందిలో ఏ, బి రెండూ వుంటాయి వీళ్లు ఎ, బి గ్రూపు. మరి కొంతమందిలో రెండు వుండవు వారు '0' గ్రూపు, జీరో (౦) గ్రూపు వారిలో రక్త కణాలను గుమిగూడజేసే వస్తువులేదు అందుకని '0' గ్రూప్ రక్తము అవసరములో అన్ని గ్రూపుల వారికీ ఇవ్వవచ్చు. కాబట్టి '0' గ్రూప్ వారిని 'విశ్వజనీన రక్తదాత' (యూనివర్సల్ డోనార్) అంటారు. అలాగే 'ఎ', 'బి' గ్రూప్‌రోగి అన్ని రకాల రక్తాన్ని స్వీకరించగలరు. అందుకని అతడిని 'విశ్వజనీనగ్రహీత' (యూనివర్సల్ రెసిపెంట్) అంటారు.

రక్తంలో ఎన్.పి ఆర్ హెచ్, ఇంకా ఎన్నోరకాల ఏంటిజెన్స్ వుంటాయి. ఇవి కేసుల పరిశోధనలలోను, పితృ నిర్ణయంలోనుపయోగపడతాయి. ఆర్.హెచ్. అనే వస్తువు ప్రత్యేకత కలది. రీసస్ అన్నమాట నుంచి పుట్టింది. ఆర్.హెచ్. పాజిటివ్, నెగిటివ్ అన్న రెండు రకాలుగా వుంటుంది. రక్తదానానికి ఆర్.హెచ్. టైపింగ్ కూడా సరిపోవాలి

## పుట్టుమచ్చలు

రక్తాన్ని గురించి ఇన్ని వివరాలు అందించిన డాక్టర్ కె ఎస్ రత్నాకర్‌గారు రక్తంతో రోగ నిర్ధారణ చేయడం గురించి కూడా వివరించారు

"పుట్టుమచ్చలు పెరగడం, గొంతు మారడం, కళ్ళలో రక్తం జీర, కారణం లేకుండా నీళ్ళ విరేచనాలు, అజీర్ణం, మెనోపాజ్ తర్వాత రక్తస్రావం కావడం, చనుమొనల నుంచి డిస్చార్జి, రక్తం గడ్డకట్టడం లాంటి వున్నప్పుడు వెంటనే రక్తం పరీక్ష చేయించడం అవసరం. ఆసుపత్రులు చికిత్సకేకాదు రోగ నిర్ధారణకూ ఉపయోగపడతాయి రక్తంలో వున్న రకరకాల కణాలు, వాటి పరిమాణంతో



రక్తపరీక్షల్ని టెలివిజన్ స్క్రీన్‌మీద పెద్దవిగా చూపటం వల్ల డిమాన్‌స్ట్రేషన్‌కి ఎంతో సహకరిస్తుంది

అనారోగ్యాలు నిర్ణయించవచ్చు హిమోగ్లోబిన్, రక్తకణాల కీట్, పాక్‌డ్ సెల్ వాల్యూమ్, ఇ.ఎస్.ఆర్. రేట్ మొదలైన ఎన్నో పరీక్షలని రక్తంలో చేస్తాము తెల్ల కణాల సంఖ్య పెరిగితే లుకేమియా. బోన్ మారోలోంచి కాన్సర్‌లో ఇమెచ్యూర్ సెల్స్ బయటికొస్తాయి ఇన్‌ఫెక్షన్ వుంటే ఇ.ఎస్ ఆర్. కౌంట్ పెరుగుతుంది ఇలా రక్తకణాల ద్వారా రోగనిర్ధారణని చేయడాన్ని పేథాలజీ అంటారు క్లోరోమైసిన్ అనేది టైఫాయిడ్‌కి తప్ప ఇవ్వకూడదు ఇస్తే బోన్‌మారో దెబ్బతింటుంది ఎక్స్‌రే, న్యూక్లియర్ ఫ్యూయల్‌కి ఎక్కువగా ఎక్స్‌పోజ్ అయినా కాన్సర్ రావచ్చు రోగ నిర్ధారణేకాదు, అది ఏ దశలో వుందో కూడా పేథాలజీ చెప్తుంది" అంటారు డాక్టర్ రత్నాకర్

## క్యాన్సర్ !

క్యాన్సర్ రోగ పీడితమవుతున్నాయనుకున్న ప్రాంతాల నుంచి చిన్న ముక్కను తీసి 'బయాప్సి' పరీక్షకు పంపుతా రు ఈ పరీక్షలో క్యాన్సర్ వున్నది, లేనిది తెలుసుకోవచ్చు దీన్ని 'హిస్టోపాథాలజీ' అంటారు

సైటోపేథాలజీలో పెప్స్‌మియర్ టెస్ట్‌లో వెజైనాల్ సెర్వికల్ స్మియర్‌తీసి పరీక్షిస్తారు బయోకెమిస్ట్రీలో కెమికల్ కాంపౌండ్స్ మార్పు తెలుసుకుంటారు మైక్రోబయాలజీలో లోపల సూక్ష్మజీవుల్ని, ఇతర ఆర్గాన్స్‌ని తెలుసుకుంటారు

"ఎక్కువగా పొగత్రాగేవాళ్ళు, మద్యపానం సేవించేవాళ్ళు, తరచు గర్భస్రావమయ్యే వాళ్ళు, గోళ్ళు పెళసుగా వున్నవాళ్ళు, తొందరగా అలసట వచ్చేవాళ్ళూ రక్త పరీక్షలు చేయించుకోవడం మంచిది అసలు నలభై సంవత్సరాలు దాటిన వాళ్ళందరూ రక్త పరీక్షలు చేయించుకుంటుంటే ఏమైనా అనారోగ్యాలు వస్తుంటే ప్రథమ దశలోనే పసిగట్టవచ్చు" అంటారు డాక్టర్ కె ఎస్ రత్నాకర్

- వేదగిరి రాంబాబు

-ఫొటోలు పై భీమారావు

సీరియల్

# శత్రుసంహారం

లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

ఇంతవరకూ సాగినకథ- 9 : పరమవీర చక్ర అవార్డు అందుకొన్న మహేష్ చంద్ర కొడుకు రాహుల్ వైమానికదళంలో పైలట్‌గా చేరతాడు తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు కుమార్తె సుషుమ్న దగ్గరున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ వంటి పరికరంవల్లనే సంపత్ మాస్టారి కుటుంబం విచ్ఛిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబంధించిన కేసు వివరాలను సేకరిస్తుంటాడు కారవెల్లీ విమాన ప్రమాదానికి సంబంధించి క్రూ:బాక్స్‌లోని ఇండికేటర్ దొంగతనంతో సంబంధమున్న అలయన్స్ సంస్థపై కన్నువేసిన ఎ ఎస్ పి కారంత్ హత్యకు గురవుతాడు చెన్నుడు ద్వారా పోలీసులకు ఈ వర్తమానం అంది దుండగుల కోసం గాలింపు జరుపుతుంటారు

నగరం తగులబడి పోతూంది, ప్రజలు మంటల్లో చిక్కుకుని మలమల మాడిపోతున్నారు ఏ డివిజన్‌లో ఏ ఘోరకలి ఎదురవుతూందనే వార్తలు ప్రతిక్షణం అందుతూనే ఉన్నాయి

అయినా దేవిప్రసాద్ ఎ సి చేయబడిన గదిలో సింహాసనం లాంటి కుర్చీ మీద ప్రశాంతంగా కూర్చుని ఉన్నాడు ముఖంలో ఖుషీ కన్పిస్తోంది పెదవుల అంచుల్లోంచి చిరునవ్వు విరిగి పడుతుంది అవెస్తా గ్రంథం పేజీలు తిరుగుతున్నాయి చేతిలో జపమాల తిరుగుతూనే ఉంది తన్మయభావంతో కళ్ళు సగం మూసి ఉన్నాయి వెండి రేకులు కప్పిన కొయ్యకుర్చీమీద ముఖమల్ దిండ్లు మెత్తగా హాయిని కలిగిస్తున్నాయి కుషన్ చేయబడిన వెండి పాదపీఠం ట్యూబ్‌లైట్ల కాంతిలో ధగధగలాడుతూంది

అతని మీదికి ప్రత్యేకంగా లైట్లు ఫోకస్ చేయబడి ఉన్నాయి ఫ్లడ్‌లైట్లు చిమ్ముతున్న కాంతితో అతని శరీరం తరలిస్తోంది

ఆ గది నాలుగుమూలలా ఒకేవిధంగా ఉంది క్రొత్తవారికి వాకిలి ఎక్కడుందో అర్థం కాదు ఓ వంక ఎర్రలైటు వెలిగింది

క్లిక్‌మన్న శబ్దంతో తలుపులు తెరుచుకున్నాయి ఒక విదేశీ అమ్మాయి విసురుగా నడుస్తూ లోనికొచ్చింది ఒక ట్రేలో టెలిఫోన్! రిసీవర్ అందుకునేందుకు వీలుగా అతనిముందు వినయంగా వంగి నిలబడింది ఓ చిన్న బికినీ ధరించి ఉన్నదామె- టాప్‌లెస్!

దేవి ప్రసాద్ చూపులు ఆమె గుండెల్లో చిక్కుకున్నాయి

"సర్! ఎ కాల్ ఫర్ యూ!" హెచ్చరించిందామె ఉలికిపడి రిసీవర్ అందుకున్నాడు ఈ సమయంలో టెలిఫోన్‌లో విన్పిస్తున్న వార్తలు అతనికి చాల ఆనందాన్ని కలిగిస్తున్నాయి

"బాస్! నాగార్జున నగర్‌లో ఓ బాంకు భవనంతో సహా నాలుగు భవనాలు కూలాయి మన మిలిటెంట్లు ఇంకా ఛార్జిలో ఉన్నారు "

"లాకర్స్ అన్నీ దోచుకోవటం పూర్తి అయిందా?"

"మరో అయిదు గంటల సమయం పడుతుందనుకుంటాను బాస్"

"మీ పని పూర్తి అయిందాకా ఉద్రిక్తత సడలిపోనివ్వకండి! అవుసరమైతే వెపన్ని, స్మోక్‌బాంబ్స్, గ్రెనేడ్స్ పంపుతాను, కైలాష్ ఛద్దా మీతో వున్నాడా?"

"ఆయన తారనాకలో మెయింటెయిన్ చేస్తున్నారు "

"వార్తలు వచ్చాయా? వివరాలు తెలిసాయా?"

"అవును బాస్! ఎనిమిది మంది చనిపోయారు తారనాకలో!"

"దట్స్‌గుడ్! వెరిగుడ్!"

"ఇంచుమించుగా యిరవై యిళ్ళు కాలిపోయాయి "

"గృహదహనాల్లో కైలాష్ సామర్థ్యం నాకు తెలుసు మన శత్రువుల కదలికలు ఎలా ఉన్నాయి డోర్జీ!"

"పోలీసులు సెంటర్స్‌లో ఉన్నారు కార్నర్ సైట్స్‌కి రావటల్లేదు "

"ఇది మంచి అనుకూలమయిన సమయం వారు సైట్స్‌కి రావటల్లేదంటే మన వ్యూహం అర్థం కాలేదని తెలుసుకో! ఇక ముందు కూడా అర్థం కాదు భయం లేదు గో ఎ హెడ్!"

"ఇంకా ఏం చేయమంటారు బాస్!"

"నా ప్రియతముడు ఇబ్రహీం ఎక్కడున్నాడు? ఓ సారి నాకు ఫోన్ చేయమని చెప్పు" అంటూ ఆదేశించాడు దేవిప్రసాద్!

రెండు నిముషాల అనంతరం మళ్ళీ టెలిఫోన్ వచ్చింది

"హలో ఇబ్రహీం?" ఎంతో సంతోషంగా పలకరించాడు.

"బాస్! ఇబ్రహీం లొకేషన్‌లో ఉన్నాడు ఒకే భవనంలో రెండు బాంకులున్నాయి అయిదంతస్థుల భవనం దాన్ని పడగొట్టేందుకు ప్రయత్నాలు జరుగుతున్నా

యి గ్రెనేడ్స్ ప్రయోగించినా భవనం పూర్తిగా కూలిపోలేదు దాన్ని పడగొట్టేందుకు క్రొత్త దారికోసం ఆలోచిస్తున్నారు అది పడిపోతే ప్రక్కనున్న చిన్న భవనాలు నజ్జు నజ్జు అవుతాయి జన నష్టం ఎక్కువగా అవుతుంది."

"అదంతా జరగవలసిందే! ఏ నష్టమూ జరగకుండా ప్రజలు భయభ్రాంతులు ఎలా అవుతారు? వారిని భయపెట్టకుండా మన పబ్బం గడుపుకోవటం ఎలాగనుకున్నావు? నీ పేరు?"

"బాస్! నా పేరు పీయూష!"

"అక్కడ నువ్వేం చేస్తున్నావు?"

"గవర్నమెంట్ హాస్పిటల్‌కి డ్యూటీ నర్సుల్ని తీసుకుపోయే వాన్ ఇక్కడ చిక్కిపోయింది బాస్! వారితో మాట్లాడుతున్నాను "

"మొత్తం ఎందరున్నారు?"

"ఇరవై నలుగురున్నారు."

"ఏమంటున్నారు?"

"క్షేమకరమయిన చోటుకి చేరాలంటున్నారు."

"అయితే నా దగ్గరకు చేర్చు మోక్షం ప్రసాదిస్తాను."

"కాని బాస్! వాళ్ళంతా.. .."

"డోంటాక్ ఎనీమోర్! మన దగ్గర కర్ఫ్యూపాసులు ముందుగానే సిద్ధం చేయించాను అవి పంపుతున్నాను. వెంటనే రండి."

"అలాగే బాస్" అంది పీయూష తల దిమ్మెత్తినట్లుగా అయింది తన మూలంగా రోగులకు సేవచేసే యిరవై నలుగురు నర్సులు బలి కావటం అనే వార్త ఆలోచించలేక పోతుంది.

దేవిప్రసాద్ చూపుపడటమంటే పరమశివుడి మూడవకంటిలో చిక్కుకు పోవటమనే అర్థం! వారిని అక్కడకు చేర్చటమంటూ జరిగితే ఇంక బ్రతికి బయటపడలేరు.

ఆమె ఆలోచనలు చాలదూరం పరుగెత్తాయి. చూపులు ఆకాశం అంచుల్లో గ్రుచ్చుకుంటున్నాయి. ఒక మోటార్ బైసికిల్ చాల వేగంగా ఆమె వైపు దూసుకు వచ్చింది.

కర్ఫ్యూ పాస్‌లు ఉన్నవారు ఒకరిద్దరే తిరుగుతున్నారు వీధుల్లో! అర్జంట్ సర్వీసుల వారికి పోలీసులు స్వయంగా వచ్చి పాస్‌లు అందచేస్తున్నారు అందరికన్నా ముందుగా అవి దేవిప్రసాద్‌కి అందుతాయని ఆమెకు తెలుసు

నిర్మానుష్యంగా, నిర్వాహనంగా ఉన్న వీధుల్లో పోలీసులు కన్పిస్తున్నారు వారిని తప్పించే ఉపాయం ఏదైనా ఉందా అని ఆలోచిస్తోంది పీయూష! యువకుడు పాస్‌లు అందించి వచ్చినంత వేగంగా వెనుదిరిగి పాస్ చూపుకుంటూ పోలీసు బృందాల మధ్యనించి దూసుకు పోయాడు. క్షణంలో కనుమరుగు అయాడు.



అతని వెంట వచ్చిన రెండవ యువకుడు అక్కడే ఉండిపోయాడు

"నీవు కూడ అతనితో వెళ్ళిపోవలసింది" అంది పీయూష!

"వాన్‌ని నేనే డ్రయివ్‌చేసి తీసుకురావాలని ఆర్డర్" అన్నాడా యువకుడు ఆమెకు నవనాడులు కృంగిపోతున్నాయి

నర్స్‌లు అందరూ వారిని చుట్టుముట్టారు ఏ విషయమూ పైకి మాట్లాడేందుకు వీలుకాదు సకాలంలో తగిన నిర్ణయం తీసుకోలేకపోతే వారందరి జీవితాలు బలి అవుతాయి

ఆలోచించేందుకు తగిన సమయం లేదు కాబట్టి వెంటనే ఒక నిర్ణయానికి వచ్చిందామె అందరిని వాన్‌లో ఎక్కవలసిందిగా కోరింది ఏదో ఒక మంచిదారి దొరికి ఈ రాత్రికి యింటికి జేరిపోతామనే ఆశ అందరిలో చిగురిస్తోంది

బిలబిలమంటూ వాన్‌లోకి ఎక్కి కూర్చున్నారు

దేవిప్రసాద్ పంపిన యువకుడు డ్రయివింగ్ సీట్లో కూర్చున్నాడు అతని ప్రక్కనే కూర్చుంది పీయూష! వాన్ ముందుకు కదిలింది అంటే మరింక ఆగేది దేవిప్రసాద్ మాయామందిరంలోనే!

చివరిసారిగా ఆమె పెద్ద నిట్టూర్పు విడిచింది

వాన్ కదిలింది మొదటి మెయిన్ రోడ్ చౌరస్తాలో పోలీసులు తనిఖీ కోసం ఆపారు కర్ఫ్యూ విధించిన సమయంలో ప్రయాణం చేసేందుకు కాగితాలన్నీ ఖచ్చితంగానే ఉన్నాయి

తనిఖీ పూర్తి అయింతరువాత అనుమతి దొరికింది

"మీరు ఎక్కడకు పోతున్నారు?" పోలీసాఫీసర్ ప్రశ్నించాడు

"పాస్‌లో వ్రాసిఉంది కదా!"

"అడగటం మా విధి! ఇది దొంగ పాస్ కాదని మీరు చెప్పేదాన్నిబట్టి మేము ధృవపరుచుకోవాలి, చెప్పండి"

"శ్రీ మహాదేవి అలయన్స్ సంస్థకి పోతున్నాము"

అంకెను ధృవపరుచుకోవటం కోసం వాన్ తలుపులు తెరిపించాడు పోలీసాఫీసర్! ఇరవై ఆరుగు రున్నారు డ్రయివర్‌తో సహా అతనికి అనుమానం వచ్చింది

## భారతీయులకి సైన్సు ఫౌండేషన్

1989 సంవత్సరానికి అమెరికా జాతీయ సైన్సు ఫౌండేషన్ ప్రతిష్ఠాత్మకమైన అవార్డులు 9 మంది భారతీయ పరిశోధకులకు లభించాయి.

ఈ అవార్డుక్రింద ఒక్కొక్క పరిశోధకునికి ఏడాదికి లక్ష డాలర్ల వంతున అంటే సుమారు 16 లక్షల రూపాయలు అయిదేళ్లపాటు లభిస్తుందట

1983 లో ఏర్పాటైన ఈ అవార్డులు 9 మంది భారతీయ సంతతి పరిశోధకులు అందుకోవటం యిదే ప్రధమం.

కమలేశ్వర్ పూళ్ల, కేశవ్ పింగళి, జితేందర్ మాలిక్, అనీష్ మనోహర్, శ్రీరామ్ దువ్వూరు, దేవనాధ్ త్రిపాఠీ, సుందరేశన్ జయరామన్, రమేష్ నారాయణ్, ఉమేష్ మిశ్రాలకు ఈ అవార్డులు లభించాయి.

తన అనుమానాన్ని బయట పెట్టుకోవటానికి, ఈ విషయాన్ని ఒక సమస్యగా మలచటానికి ముందు అరక్షణం ఆలోచించాడు

"ఇతనెవరు? ఒక మనిషి ఎక్కువగా ఉన్నారు కదా!" అన్నాడు అందరి ముఖాల్లోనూ భయం కన్పించింది

"మమ్మల్ని రిసీవ్ చేసుకునేందుకు దేవిప్రసాద్ పంపారు"

ఆ పేరు వింటూనే "ఓ! అలాగా!" అంటూ పచ్చజండా ఊపేశాడు పోలీసాఫీసర్!

వాన్ ముందుకు దూసుకు పోతూంది

నగరంలో కూడలి కేంద్రాల్ని చక్రవ్యూహంలా ముట్టడించి ఉన్నారు పోలీసులు ఎక్కడో ఒకచోట చెకింగ్ పూర్తికానిదే ఆ వ్యూహంలోకి రాగలగటం అసాధ్యం!

ముందు ముందు వారి నెవరూ అడ్డగించలేదు

గమ్యం దగ్గర అవుతోంది క్రమక్రమంగా పీయూష ముఖంలో భయం కరడు కడుతోంది!

బహుశా నర్స్‌స్టాఫ్‌ని కాపాడగలగటం ఇక అసాధ్యమే!!

* * * * *

భయం ఒడిలో శిలలా బిగుసుకుపోయిన నగరం! నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుమీద రెండు జీపులు పరుగెడు తున్నాయి

ముందు జీపులో పోలీసు దుస్తులు ధరించిన వారున్నారు వెనుక జీపులో ఉన్నవారు పోలీసులు! ముందు జీపులో ఉన్న వారు పోలీసులు కాదని వారికి అర్ధమయి పోయింది

వెనుకనించి సిగ్నల్స్ అందించాడు డ్రయివ్ చేస్తున్న రాహుల్! కాని ముందు జీపులోని వారు వాటిని అందుకోలేదు

వేగంగా పోవటం మీదే వారు దృష్టిని కేంద్రీకరించారు

తన ప్రతిభ అంతటిని ఉపయోగించి డ్రయివ్ చేసినా వారిని అందుకోవటం సాధ్యపడలేదు

వారు కనుమరుగు అవుతున్నారు ముందు చౌక్‌లో ఉన్న పోలీసులకి వార్త అందించారు

మరో రెండు నిముషాల తరువాత వారే ఎదురు వచ్చారు

పోలీసుల ఎదుట ఓ పెద్ద ప్రశ్నార్ధకం మిగిలి పోయింది జీపు వారికి ఎదురు కాలేదు గంటనుండి ఎలాంటి వాహనం ఆ వైపుగా రాలేదని రిపోర్టు అందించారు వింటున్నవారు అప్రతిభులయ్యారు ముందు వెడుతున్న జీపు ఎలా మాయమయింది

డ్రయివింగ్ సీటులోంచి క్రిందికి దుమికాడు రాహుల్!

కర్ఫ్యూ నడుస్తున్న సమయంలో పోలీసులు నగరాన్ని ఆక్రమించుకుంటారు రాకపోకలు అదుపు చేయబడతాయి కొన్ని ప్రాంతాలలో కన్పిస్తే కాల్చివేత ఉత్తరువులు కూడ ఉన్నాయి కాబట్టి ప్రజా జీవితంలో ప్రమాదాలకు అవకాశం ఉండదని అందరూ అనుకుంటారు కాని ప్రాణాలకు తెగించిన విధ్వంసకారులకు అది మంచి సమయం మాఫియా ముఠాలకు ఆత్మాహుతి దళాలుంటాయి వారు వారి ప్రాణాలనే విలువయినవిగా భావించరు

ఇంక ఎదుటివారి ప్రాణాలను తీసేయటం అవలీల! సామూహిక హత్యలు చేయటం వారి కార్యక్రమం అలాంటిదళమే పోలీసు దుస్తులు ధరించి తమ ముందు వెళ్ళింది అదృశ్య మయింది

వారేం చేయబోతున్నారో ఊహించటం అసాధ్యం! జరుగబోయేది ఏదయినా అది చాల తీవ్రమయిన దారుణం అయి

వుండాలి! పోలీసులు తిరిగి ఎవరి పాయింట్ కి వారు వెళ్ళిపోవాలని నిర్ణయించారు వెంటనే వెనుదిరిగి వెళ్ళిపోయారు.

అక్కడ ఒంటరిగా మిగిలిపోయాడు రాహుల్! తీసుకు వచ్చింది అతడే అయినా తమతో రమ్మని అడగలేదు అంత భయంకర స్థితిలో అతని అదృష్టానికి అతన్ని వొంటరిగా వొదిలేసి వెళ్ళిపోయారు

తమ ముందు వెడుతున్న జీపు రెండు చౌకుల మధ్య ఎక్కడో సందు మలుపుల్లోకి తిరిగి అదృశ్యమయింది. పోలీసుల దృష్టి నించి తప్పుకునేందుకే వారు అలా చేశారు అనుకోవాలా?

లేక వారు నిర్దేశించుకున్న పనికి కార్య స్థానం ఈ ప్రాంతాలలోనే ఉంది అనుకోవాలా? ఒక పోలీసు అధికారిని చంపి శవాన్ని కూడ దొరకకుండా మాయం చేయగలిగిన ఘనులు ఇంక వారు చేయలేనిది ఏముంటుంది రాహుల్ ముందుకి కదిలాడు

శ్రీ మహాదేవి అలయన్స్ సంస్థ తాలూకు ఆత్మాహుతిదళం వెళ్ళిన సందు మలువు ఎక్కడుందో అతనికి తెలియాలి పోలీసులు రెండు చౌకులలో ఉన్నారు వాటి మధ్య దూరం కిలోమీటరు!

ఈ మధ్య హఠాత్తుగా వచ్చే పెట్రోలు దళం తప్ప తనని నిరోధించేవారు ఎవరూ ఉండరు వ్యాపార సంస్థలు, నివాస గృహాలు నూటికి నూరుశాతం మూసి ఉన్నాయి పోలీసులు తప్ప సాధారణ పౌరులు ఒక్కరూ కన్పించకుండా భయం గొల్పుతోంది కరుడు కట్టిన రాత్రి!

మరికొంత దూరం ముందుకు నడిచాడు

ఒక సందు మలుపులో అతనికి భయంకరమైన మూలుగు విన్పించింది అది మానవ రోదనం కాదు ఓ నడుం విరిగిన కుక్క పిల్ల ఏడుపు

కుక్కపిల్ల నడిరోడ్డుమీద ఏ క్షణంలో అయినా ప్రాణాలు విడిచేందుకు సిద్ధంగా రక్తపు మడుగులో పడిఉంది రక్తం ఇంకా పూర్తిగా గడ్డకట్టలేదు దాని నడుం మీదుగా వెనుక కాళ్ళ మీదుగా వాహనం వెళ్ళిపోయినట్లు రక్తపు చారలు కన్పిస్తున్నాయి

రక్తపు మరకలతో టైరుగుర్తులు గమనించి ఆ వెళ్ళింది జీపు అని అర్థం చేసుకున్నాడు. రక్తం ఇంకా పచ్చిగా ఉండటం చూచి అది వెళ్ళి ఎంతోసేపు కాలేదని గుర్తించ గలిగాడు

విశ్వాసం కలిగిన జంతువు కుక్కపిల్ల! చనిపోయే ముందుగా తన మీదినించి జీపు నడిపి చావుకి కారణమయిన శత్రువుల ఆచూకిని రాహుల్ కి అందించింది.

పరిస్థితిని పరిశీలిస్తూ ఉండగానే అది మూలగటం మానేసింది ప్రాణం విడిచి కొయ్యలా అయిపోయింది

కుక్క శవం సాక్షిగా తమనించి తప్పుకున్న జీపు ఆ మలుపులో తిరిగి వెళ్ళిందని నిర్ణయించు కున్నాడు రాహుల్!

వడివడిగా ఆ వైపుకి నడకసాగించాడు ఆ వీధి చాల దూరంలో ఉన్న మరో చౌకు వైపుకి దారితీస్తోంది. అక్కడ గార్డులు ఉన్నారు అంటే జీపు ఈ మధ్యలోనే ఉండి ఉండాలి! కాని ఎక్కడ??

అతని చూపులు వాడిగా డేగ చూపుల్లా గ్రుచ్చుకుంటున్నాయి రెండు ప్రధాన వీధుల మధ్య లాన్! ఆ దారిలో కూడ ప్రక్కలకు మరీ చిన్న చిన్న సందులున్నా



యి వీధి ముఖం చూచేందుకు భయపడి హడలెత్తిన జనం తలుపులు బిడాయించుకున్నారు

ఒక అగంతకుడు నిర్భయంగా ఆ సమయంలో వీధుల్లో తిరగటాన్ని కొందరు కిటికీలనించి గమనిస్తున్నారు మరికొంత దూరం ముందుకు పోయాక ఒక యిరుకు దారిలో ఇంచు మించుగా దాచినట్లు కన్పించే వాహనం వెనుకభాగం అతని దృష్టిలో పడింది

ఆ మలుపు తిరిగి వాహనం దగ్గరకు పోయాడు. రెండు భవనాల అవతల అలజడి చెలరేగుతోంది జీపు అద్దాలలోంచి ముందు జరుగుతున్న దృశ్యాలు కన్పిస్తున్నాయి రాహుల్ చూపులు నిలిచాయి

ఆ యింటిని చుట్టుముడుతున్న అందరిలోను ఎత్తయిన వ్యక్తి ఇబ్రహీం! అతని ముఖం బాగా జేవురించి ఉంది ఏదో ఘనకార్యం చేయబోతున్న వాడిలా చాల దృఢంగానూ వేగంగానూ అడుగు లేస్తున్నాడు

ఒక చోటున అతని బృందం ఆగిపోయింది అది ఓ మధ్య తరగతి యిల్లు! అందరూ బయట నిలబడి పోయారు గేటు తెరుచుకుని లోపలకు పోయాడు ఇబ్రహీం! చుట్టూ ఇళ్ళలో కిటికీలు తెరుచుకుంటున్నాయి.

కర్ఫ్యూ, కన్పిస్తే కాల్చివేత ఆర్డర్లు ఉండగా నగరం పోలీసు, పారా మిలిటరీ స్వాధీనంలో ఉన్న సమయం రాత్రివేళ! అలాంటి స్థితిలో ఎక్కడికయినా పోలీసులు రావటం విడ్డూరమేమీ కాదు.

సంఘ వ్యతిరేకులే కాదు. కొందరు ఆకతాయి కుర్రాళ్ళు కూడ ఇలాంటి సమయంలో విజృంభిస్తారు అలాంటి వారు ఎక్కడయినా ఉండవచ్చు. ఆచూకీ దొరికి గాలింపు కోసం పోలీసులు ఎక్కడికయినా రావచ్చు. ఒక సాధారణమయిన సంఘటనగా భావించారు

ఏ ఒక్కరూ తలుపులు మాత్రం తెరవలేదు

లోపలే ఉండి సాధ్యమయినంతవరకూ జరిగే సంఘటనలు చూడాలనే ప్రయత్నంలో ఉన్నారు. వారి పథకం ఏమిటో రాహుల్ గ్రహించలేక పోయాడు. జీపు అద్దంలోంచి ఏకాగ్రంగా చూస్తున్నాడు

ఇరవైమూడు సంవత్సరాలున్న ఓ యువతిని యింటిలోంచి వెలుపలకు యీడ్చుకొచ్చాడు యిబ్రహీం! ఆమె దయనీయంగా రోదిస్తోంది. సోదరులూ, ఆమె తండ్రి మరికొందరు తెరచాటు స్త్రీలు గగ్గోలుపడుతూ వెలుపలకు వచ్చారు.

యిబ్రహీం కొప్పు పట్టి యీడ్చుకు వచ్చిన యువతి నిండు చూలాలు!!

"అల్లుడుగారూ! మా అమ్మాయి ఖర్మకి దాన్ని వొదిలేశారు మాకు బాధ లేదు కావాలంటే కాపురానికి తీసుకుపొండి. లేదంటే వొదిలేయండి. మీరెలా చెప్తే అలా వినుకుంటాం. కాని నిండు చూలాలిని ఏమీ చేయకండి" అంటూ వారిలో వయసు మీరిన స్త్రీ ముందుకువచ్చి యిబ్రహీం కాళ్ళు పట్టుకుంది

వికటంగా నవ్వాడు యిబ్రహీం!

"నీ కూతురుతో కాపురం చేయవలసిన అవుసరం నాకేంటి?" అన్నాడు మరో రెండు విసుర్లు లాగి నడివీధిలోకి తెచ్చాడు

వృద్ధురాలు దయనీయంగా ప్రాధేయపడుతోంది అతని పాదాలు విడిచిపెట్టకుం

# ఫోటో వ్యాఖ్య పోటీ–26 ఫలితాలు



—— బహుమతి పొందిన వ్యాఖ్య ——

**'జై'' అంది వైజయంతిమాల**
**'సై'' అంది సైరాబానూ!**

– బి. స్వామి (హైదరాబాద్)

వైజయంతిమాల :– బానూగారూ! మీరు కాంగ్రెస్‌లో చేరకూడదూ?

సైరాబాను :– కూల్ వాటర్, కూలింగ్ గ్లాసెస్‌తో భలే కూల్‌గా ఉన్నారు. మీకేం ఏమైనా అంటారు.

– మడగల గోవిందరావు (విజయనగరం)

"అప్పుడే ఇద్దరం ముసలివాళ్ళమయిపోయాం!"
"క్షమించండి, మీరయిపోయారేమోగాని, నేనింకా పరువంలోనే ఉన్నాను".

(షరా ఏ మాట ఎవరు అన్నారో వారి అభిమానులే నిర్ణయించుకోవాలి)

– దలసరి వెంకటరత్నం (విశాఖపట్టణం)

వైజయంతిమాల .– ఆభరణాలు లేకుండా అంత అందముగా వున్నారు ఏ కేశవర్ధిని వాడతారు మీరు?

సైరాబాను :– మీ ముఖారవిందము అంత మృదువుగా వుంది ఏ స్నో వాడతారు మీరు?

– మేడేపల్లి జయప్రభాకర్ (విజయవాడ)

## లక్కీ పేర్లు

పి శ్రీదేవి (కడప), పవనశ్రీ (పామూరు), ఎ గోవిందరావు (పలాస) ఐ ఉషారాణి (నర్సారావుపేట), కె రామకృష్ణ (రేపల్లె) మామిడి ఆషారాణి (హైదరాబాద్) జి సుబ్బలక్ష్మి (చాగల్లు) ఎన్ కృష్ణప్రసాద్ (స్టూవర్ట్‌పురం), గొట్టాపు దుర్గారావు (గోపాలపురం), ఎమ్ డి ఖాసిమ్ (చినటగిరాల)

---

గట్టిగా పట్టుకుంది

"బాబూ! అంతా అల్లాదయ మీరు పురం చేయకూడదనుకుంటే ముల్లా బుని పిలిచి తలాక్ రాయిస్తాను" అందా.

"తలాక్ రాయించాలని ప్రయత్నించా నుకో! నీ కొడుకుల్ని ఖతంచేసి వాళ్ళ డలు నరికి కిచిడీ వొండిస్తాను" యిబ్ర ం ఆమె బలహీనత మీద మరింత దారు ంగా దాడి చేశాడు

"అల్లా దయకాదు అల్లుడుగారూ! ంతా నీ దయ! ఆ పనిమాత్రం చేయకు లాక్ యివ్వటం మీకు యిష్టం కాకపోతే గా ఖర్మాన్ని నమ్ముకుని నాలుగు గోడల ధ్య పడిఉంటాం."

"ఎందుకూ? నన్ను అప్రతిష్టపాలు యటానికా?"

"మరీ అంత నిర్దయగా మాట్లాడకు బూ! అల్లా మెచ్చడు."

"ఇది బ్రతికి ఉండటానికి వీలులేదు" సురుగా కాలు ఝాడించి నిండుచూలాలి క్కలో తన్నాడు ఇబ్రహీం!

"బాబూ దాన్ని చంపకు! ఈ ఊరు విడిచిపోతాం! నా ఒక్కగా నొక్క కూతు రు నీకు నాలుగో భార్య! అది నీకు పీడ కాదు. ఉండమంటే నీ దగ్గరే ఉంటుంది విడిచిపెడితే నా దగ్గరుంటుంది ఇదంతా ఎందుకు అనుకుంటే ఈ ఊరు విడిచిపో తాం!"

"ఈ కడుపు పండి పిల్లాడు పుడితే భవిష్యత్తులో నా గతేమిటి?"

క్రూరాతి క్రూరంగా తనవల్ల తల్లి కాబో తున్న చూలాలివంక చూచాడు యిబ్రహీం! వజవజ వొణికిపోతోందా దీనురాలు!

"వాడు నీకు భవిష్యత్తులో ఏవిధం గా అడ్డురాడు ఈ రాష్ట్రం కూడ వద లి చాలదూరం వెళ్ళిపోయి ఎక్కడయినా బ్రతుకుతాం" వృద్ధురాలు చివరి ఆశతో అర్థించింది

"అదేం వీలుకాదు దీన్ని చంపి తీరు తాను."

ఆ దీనులకు దిక్కు తోచలేదు అత ని సహాయం కోసం వచ్చిన సైతానుల్లాంటి గూండాలనే ఆపద్బాంధవులుగా భావించు కున్నారు. కర్ఫ్యూ నీడలో కరిగిపోతున్న ఆ కాళరాత్రిలో దిక్కులేని ఆ దీనులకు మరోదారి లేదు

"మాకు బ్రతుకు యివ్వండి!" అని ప్రాణాలు తీసుకుపోవచ్చిన యమభటుల్ని అర్థించిన విధంగా వారినే అడుగుతున్నారు

యిబ్రహీం వర్క్ ఆర్డర్ ఇవ్వటంతో గూండాలు విజృంభించారు అందిన వారి ని అందినట్లు చితక కొట్టేశారు

ఆడవాళ్ళు పిల్లలు వారి పాదాలను ఆశ్రయిస్తే సైకిల్ ఛెయిన్లు, రాడ్లు వారి మీద ప్రయోగించారు.

యిబ్రహీం తన చతుర్థ కళత్రాన్ని మరోమారు కాలుచాచి డొక్కలో తన్నా డు. ఆమె వెర్రికేక పెట్టి విరుచుకు పడిపో యింది. నవరంధ్రాల నించి రక్తం ఏరులుక ట్టి ప్రవహించింది. గర్భంలోంచి మాంసపు ముద్దలు దూసుకువచ్చాయి

ఆ తరువాత అన్ని బాధలకు అతీతం గా బిగుసుకు పోయింది అందరిని యింటి లోకి చేర్చి గొళ్ళెంపెట్టి నిప్పు అంటించాడు యిబ్రహీం!!

(ఇంకావుంది)

# పెద్దల చమత్కారాలు

## హవుస్‌లో...

లోక్ సభ స్పీకర్‌గా సర్దార్ హుకుంసింగ్ వున్న రోజుల్లో ఒకసారి రాష్ట్రపతి భవనంలో తేనీటి విందు జరుగుతోంది లోక్ సభలో ఎప్పుడూ ఆవేశంతో ప్రసంగిస్తూ వాకౌట్లు జరిపే శ్రీ మణిరామ్‌బాగ్రి కూడా సతీ సమేతంగా తేనీటి విందుకు హాజరయ్యారు శ్రీ హుకుంసింగును శ్రీ మణిరామ్ బాగ్రి తన భార్యకు పరిచయం చేసాడు శ్రీ హుకుం సింగ్ వెంటనే శ్రీమతి బాగ్రి కాళ్ళమీద పడబోయాడ్చ 'అయ్యయ్యో' మీరు నా కంటే చాల పెద్దవారు ఇది భావ్యం కాదు లేవండి అంది ఆవిడ



హుకుంసింగ్ లేచి 'తల్లీ నా హౌస్‌లో రెండు గంటల సేపు కూడా ఈయనను భరించలేకుండా వున్నాను మీరు మీ హౌస్‌లో జీవితాంతం ఎలా భరిస్తున్నారో! మీ సహనానికి శత సహస్ర వందనాలు ' అన్నార్చ

ఆంతే తేనీటి విందుకు హాజరైన వారిలో ముప్పాతిక మంది కొట్ల మీద టీ ఒలక బోసుకున్నారు రాష్ట్రపతి భవనం నవ్వులతో మారుమ్రోగింది

## ఇబ్బంది

ఒకసారి సభలో ఒక సభ్యుడు 'పశుప్రాయంగా ప్రవర్తిస్తున్నాను అని వ్యాఖ్యానించాడ్చ మరొక సభ్యుడు వెంటనే లేచి తీవ్ర అభ్యంతరం తెలియ చేశాడు ఆ వెంటనే మళ్ళీ మొదటి సభ్యుడు లేచి 'నా వ్యాఖ్య పశువులకు ఇబ్బంది కలిగిస్తే క్షమించాలని కోరుతున్నాను అని కూర్చున్నాడ్చ దానితో సభలో ఉద్రిక్తత సడలి సన్నగా మొదలైన నవ్వులు చివరికి తారస్థాయికి చేరుకున్నాయి

ప్రయాగ

# వారఫలం

**11-8-1989 శుక్రవారం మొదలు 17-8-1989 గురువారం వరకు**

**మేషం:** గ్రహమండలిలో, అనేక మార్పులు ఏర్పడ్డాయి మీకు బహు లాభదాయక సమయానికి ఆస్కారం, పత్రికా రంగాన కృషి చేయువారికి, పంపిణీదారులకు, చలనచిత్ర రంగానుభవం గలవారికి అనుకూల వారం స్త్రీలకు- సభా మర్యాద, ధనలబ్ధి, యత్న కార్యసిద్ధి గలదని గ్రహించండి

**వృషభం:** కళాసాహిత్య రంగానుభవం గలవారికి సదవకాశాలున్నాయి అప్రయత్న ధనలబ్ధి, విద్యావేత్తల సహాయం, నూతన మిత్ర సహాయానికి ఆస్కారం గ్రహించాలి స్త్రీలకు- బంధువుల యిండ్లకు ప్రయాణించుటకు, సాహిత్యరంగాన మేలు చేకూరుటకు ఆస్కారం గ్రహించండి

**మిధునం:** రాజకీయ రంగాన మీరు ప్రయత్నిస్తారా? ఇది సమయం కాదని గ్రహిస్తారు క్రొత్త వ్యాపారం చేయాలనుకొంటారా? సమయం అనుకూలంగా లేదు, ప్రయాణం సాగించుటకు సమయం కాదు స్త్రీలకు- సుఖశాంతులు, ఆనందం, ప్రయాణానుకూలత, వివాహ యత్నాలు సానుకూలమగుటకు ఆస్కారం, గ్రహించండి

**కర్కాటకం:** వస్తు సేకరణకు, వ్యాపారానుకూలతకు, రాజకీయ రంగ ప్రసిద్ధికి అనుకూల సమయం మీకు దక్కదనుకున్న ఒకానొక 'వస్తువు' వారాంతాన అందుతుంది గ్రహించాలి స్త్రీలకు- ధనలబ్ధి, ఉద్యోగానుకూలత, సభా మర్యాదకు ఆస్కారం గలదని గ్రహించండి

**సింహం:** బంధువులు గాని, పరిచితులు గాని, కడకు అతిధి అభ్యాగతులయినా యింటికి రానున్నారు దైవ కార్యాచరణమునకు ఆస్కారమైన సమయం వ్యాపారానందం, ఆరోగ్యాభివృద్ధి స్త్రీలకు- ఇటీవల గావించిన ఉద్యోగ యత్నాలు సానుకూలం గావించబడుటకు అనుకూల సమయం. ప్రయాణం చేయుటకు తగిన సమయం

**కన్య:** సభారంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది ధన లోపం ఏమాత్రం రాని వారం బంధు మిత్ర సమాగమం రాజకీయరంగాన మేలు చేకూరుటకు 'శని' ఉపకరించనున్నాడు క్రమంగా యిక నుండి మేలు చేకూరనున్నదని గ్రహింపగలుగుతారు స్త్రీలకు- ధనలబ్ధి, ఉద్యోగమందు వృద్ధి, ఆనందం, గ్రహించండి

**తుల:** రాజకీయ పరిజ్ఞానం, వికాసవంతముగుచున్నది యత్న కార్యమందు ప్రసిద్ధి, సభా మర్యాద, నూతన మిత్ర సమాగమం కృషి లోపం లేకుంటే, వ్యాపారాన మేలు స్త్రీలకు- ఉద్యోగమందు పెంపు, వృత్తి వికాసం

**వృశ్చికం:** ఆలోచించి, ఆలోచించి, ఒకానొక వ్యవహారాన మేలు చేకూరనున్నది వివాహ విషయమా? పరాయి సంబంధం నిశ్చయింపబడుతుంది. బంధువర్గీయులతో, తగాదా రాకుండా చూచుకోవాలి స్త్రీలకు- వృత్తియందు అనుకూలత, ఆదాయమందు అభివృద్ధి

**ధనుస్సు:** అనుకొనని రీతిగా ఏదో మేలు జరుగనున్నది ఎక్కడ నుండియో పైకం అందనున్నది స్థితిగతులందు పెంపు, రాజకీయాలందు అనుకూలత, విదేశీ గమనానికి ఆస్కారం స్త్రీలకు- కళా సాహితీరంగాన ప్రసిద్ధి చిత్రరంగానుకూలత నిశ్చయం

**మకరం:** చాలామందికి దూర ప్రాంతాలకు వెళ్లవలసిన అగత్య ముంటుంది వ్యాపార రీత్యా కావచ్చు కొందరకు విదేశమందు ఉద్యోగం చిక్కవచ్చు చాలామందికి భారీ వ్యాపారం సాగించుటకు ఆస్కారం స్త్రీలకు- సభారంగాన ప్రసిద్ధి యత్న కార్య సాఫల్యత గ్రహించండి

**కుంభం:** రాశికి 11న ఉన్న 'వక్ర శని' మేలు చేయనున్నాడు అంటే ధనం, సదవకాశాలకు, సుఖశాంతులకు, ఆనందానికి, రాజకీయరంగాన అనుకూలతకు, ఆస్కారం స్త్రీలకు- ఉద్యోగ వృద్ధికి అనుకూల సమయంగా గ్రహించాలి ఇంతకు 'కుంభరాశి' జాతకులకు సర్వాభీష్ట సమయమే

**మీనం:** గురుని అనుగ్రహం, సుఖ స్థాన స్థితి మీకు సర్వాభీష్ట దాయకం ధన లోపం ఏమాత్రం రాదు వాహన సౌఖ్యం కొందరకు చెప్పదగిన అంశం ఇష్ట బంధు సమాగమం రాజకీయాలందు మేలున్నది స్త్రీలకు- ఆశించిన విధంగా ఉద్యోగ ప్రాప్తి, ధనలబ్ధి గ్రహించగలరు

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# యువ కవిత

నీలి నిట్టూర్పు విడిస్తే
చట్రంలో బిగించి చూస్తే
కిటికీ కావల రెండు పక్షులు

## కూ(కో)టి కోసం

పేదోడికి
ఒక్క
కడుపులోనే
ఆకలి!
కూలి చేస్తున్నారు
కూటికోసం!
గొప్పోడికి
నిలువెల్లా
ఆకలి!
కూని చే(యి)స్తున్నాడు
కోటి కోసం.!

-కవిబాబు

## కుక్క!

డబ్బున్న వాడి
మారుతీ కార్లో
ఒగర్చుకుంటూ
జాతికుక్క.
అది వాడికి
భోగం!
డబ్బు లేనివాడి
పూరిగుడిశ ముందు
తోకాడించుకుంటూ
ఊరకుక్క
ఇది వీడికి
సాయం!!

-"సింహం"

## వయసు

అమ్మాయి నవ్విందని
అనుకోకు అవాహగా!
ప్రేమించే వయసని
పేలిపోకు టపాకాయలా!
ఎంతో అందమైన జీవితం
ఉంటుంది ముందర
సమాజంలో వున్నారు
సగటు మనుషు లెందరో?
కలుసుకో అందరిని
తెలుసుకో కొందరిని
అపుడు – తెలుస్తుంది
సమాజానికి
సేవచేసే వయసు నీదని!

–పూల మురళి



## శుభలేఖ

నా గుండెని
గుడిగా మార్చి
అందులో
నీ ప్రతిబింబాన్ని
దేవతగా చేర్చి
అనుక్షణం
పూజించే
ఈ ప్రేమ పూజారికి
నీ విచ్చే కానుక
నీ పెళ్ళి పిలుపు
శుబలేఖ!

–సలీం

## సిగ్గు!

ప్రియా!
నీ కనుల సోయగాలు
మత్తెక్కించే పరువాలు చూస్తుంటే
ని ఒడిలో సేదతీరాలని
ఉరకలేస్తోంది హృదయం!
కాని మనసు మాత్రం
వెనక్కి కళ్లెం వేస్తోంది.
ఎందుకో తెలుసా?
ఈ మనసు యిదివరకే
ఒకరికి స్వంతమైందని గుర్తొచ్చి,
కొంచెం సిగ్గొచ్చి!

- తిలక్

## కన్నీరు - పన్నీరు

గుడిసెల్లో నివసించేవారు మనుషులే,
దాబాల్లో నివసించేవారూ మనుషులే,
కాకపోతే,
వారు అక్కడ కన్నీళ్ళలో తడిస్తే,
వీరు ఇక్కడ పన్నీళ్ళలో తడుస్తారు,
వారు తినడం కోసం శ్రమిస్తే,
వీరు తింది అరగడం కోసం శ్రమిస్తారు!

-కుమార్ యాదవ్

## ఆ ప్రవర్తనమార్చుకో...

పూటపూట నీవుఆడే ఆ పేకాట
నీ భార్యకు ప్రతిపూట పస్తులపాట!!
మాటిమాటికి నీవుఆడే ఆ మటకా
నీ ఇంటికిబాణాల్లావచ్చేబాకీలమూక!!
నిను మత్తెక్కించే ఆ సారాచుక్క
ఆకలిచేలలమాటించే నీపిల్లడిడొక్క!!
ఇకనైనామార్చుకో ఆ పాడుప్రవర్తన
కలిగించు నీ ఆలుబిడ్డల కి మోచన!!

-కె. రామకృష్ణ

## స్వార్థం!

పొగడ్తలకు
పొంగిపోకు
బాహ్య సౌందర్యానికి
బానిసకాకు!
మనిషి మనసంతా
మలినం
స్వార్థమే
ఈనాటి మానవుని
జీవిత పరమార్థం!

-ఓ. ఆర్. కె. రావ్

## నలుసు

నలుసుని అలుసు చేయకు
అది తలుచుకుంటే -
కన్నీటిని రప్పిస్తుంది
మరీ కోపగిస్తే-
జీవితాన్నే అంధకారం చేస్తుంది!

-సాధనాలవేంకటస్వామినాయుడు

# ఆమె కౌస్త్రరం



ప్రతి వ్యక్తీ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు తన బాధ్యత గుర్తిస్తాడు. అలా గుర్తించనివాడు అసలు మనిషే కాదు.

★ ★ ★

రామ్మూర్తిది మాది పక్క పక్క ఇళ్ళు అదీగాక మేమిద్దరమూ ఒకే స్కూలు ఒకే క్లాసు, ఒకే సెక్షను కనుక ఇద్దరమూ కలసి మెలసి తిరిగేవాళ్ళం కలసి స్కూలు ఎగ్గొట్టేవాళ్ళం కలసి టౌను కెళ్ళి మ్యాట్నీలు చూసేవాళ్ళం. ఎనిమిదవ తరగతి తప్పినందుకు కలసి తన్నులు తిన్నాము. ఆ తర్వాత కలసి కష్టపడి చదివి టెన్త్ ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్నాము ఇద్దరమూ కలసి కాలేజీలో చేరాము ఆ తర్వాత ఉద్యోగాలలో సెటి

సోమయాజుల సోదరుడు

లయిపోయాము

చిన్నప్పట్నుంచీ కలసి మెలసి తిరగడం వల్లో ఏమోగాని, చాలా విషయాల్లో మా ఇద్దరి అభిప్రాయాలూ ఒకటే అయితే రామ్మూర్తి నాకంటే ఒక విషయంలో గొప్పవాడు రామ్మూర్తికి మితిమీరిన వరోపకారబుద్ధి ఉంది. నాలో అది లేదు. అలాగని నేనేమంత స్వార్థపరుణ్ణి కాను. కాకుంటే రామ్మూర్తికి ఉన్నంత వరోపకార బుద్ధి నాలో లేదు అయితే రామ్మూర్తికంటే నేనొక విషయంలో గొప్పవాణ్ణి వాడికి వరోపకారం తప్ప, తన సంసారాన్ని గురించి ఏం పట్టదు కాని నేను మాత్రం అలా కాదు. సాధ్యమయినంత వరకూ నా సంసార బాధ్యతలని నేను నిర్వహిస్తున్నాను నిజానికి ఇందులో గొప్పతనం ఏమీ లేదు. ఒక భార్యకు భర్తగా, పిల్లలకు తండ్రిగా ఆ మాత్రం సంసార బాధ్యతల్ని నిర్వర్తించడం, మగవాడి కనీస ధర్మం ఈ బాధ్యతనే రామ్మూర్తి విస్మరిస్తున్నాడు అందుచేత రామ్మూర్తితో పోలిస్తే ఈ విషయంలో నేను రామ్మూర్తికంటే గొప్పవాణ్ణి.

ఎదుటివారికి ఉపకారం చెయ్యాలనే తపనలో రామ్మూర్తి తన సంసారాన్ని గురించి పట్టించుకోకపోవడం నాకు బాధ కలిగించే విషయం ఎందుకంటే- చిన్నప్పట్నుంచీ రామ్మూర్తిని ఎరుగుదును కనుక మా యింటికి పెద్దవాడిగా మా పెదనాన్న కూతురు సుమిత్రను రామ్మూర్తికి కట్టబెట్టి మా స్నేహాన్ని బంధుత్వంగా మార్చుకున్నాను. అయినా బంధుత్వం కంటే స్నేహం గొప్పదని నమ్మేవాళ్ళం కనుక మేమిద్దరం స్నేహితులుగానే మిగిలిపోయేము పెళ్ళైతే భార్య మోజులో పడి, సంసార బాధ్యతలకు వాడే అలవాటు పడతాడని అనుకొన్నానుగానీ, పరిస్థితిలా ఉంటుందనుకోలేదు అనవసరంగా సుమిత్ర గొంతు కోసానేమోనని ఇప్పుడనిపిస్తోంది ఆ ఆలోచనతోనే నాలో అంతరంగ మధనం ఆరంభమయ్యింది కూడా

ఏ స్త్రీ అయినా కోరుకునేది చక్కని సంసారాన్ని, దాన్ని నడపగల యోగ్యుడైన భర్తని రామ్మూర్తి మనిషిగా యోగ్యుడే అందులో ఏమీ సందేహం లేదు కానీ ఏమైనా అడిగితే టైమ్ లేదనేవాడు వాడి తరపు నుంచి చూస్తే, వాడు చెప్పిందీ నిజమేననిపిస్తుంది ఉదయం ఆరు గంటలకి లేవడంతో వాడి దినచర్య ప్రారంభమవుతుంది ఏడోగంటకల్లా స్నానం చేసి కారియర్ పట్టుకుని ఆఫీస్‌కి వెళ్ళిపోతాడు (వాడు ఇవాళ చెయ్యవలసిన ఉపకారాలు నిన్నినే ఒప్పుకుని ఇంటికి వస్తాడని, సుమిత్ర నా దగ్గర వాపోతూ ఉంటుంది). ఆ తర్వాత మళ్ళీ రాత్రి ఎప్పుడో పది గంటలకు రొప్పుతూ సైకిల్ తొక్కుకుంటూ వస్తాడు. మొదట్లో సుమిత్ర వాడికోసం ఎదురుచూసేది. కాని రాను రానూ భర్త పద్ధతి అర్థం చేసుకుని, ఆ అలవాటు మానుకుంది. మా సుమిత్ర సీత, సావిత్రి లాంటి పతివ్రతలకు ప్రతీక భర్తను ఏనాడు ఇదేమని ప్రశ్నించేదు కాదు. ఏనాడూ భర్త మాట జవదాటేది కాదు. అతడు తెచ్చిన జీతంతోనే గుట్టుగా సంసారాన్ని నెట్టుకొచ్చేది. రామ్మూర్తి వంతు బాధ్యతలు- బజారుకి వెళ్ళి సరుకులు తేవడం, పిల్లల్ని స్కూలుకి దిగపెట్టడం- వంటివి కూడా తనే నిర్వహించేది. కానీ నాకెందుకో అవన్నీ రామ్మూర్తి చేస్తేనే బాగుంటుందనిపించేది. కొత్తలో మా సుమిత్ర అవన్నీ చేయడం చూడలేక, ఆఫీసు నుంచి వచ్చాక ఓమారు సుమిత్ర దగ్గరకు వెళ్ళి కావలసినవన్నీ అడిగి తెచ్చేవాణ్ణి. పాపం సుమిత్ర అటు ఇంటి పనులు, ఇటు బయటపనులూ, పిల్లలకు కావలసినవన్నీ అమర్చడం వీటిలోపడి, భర్త గురించిన చింతను మర్చిపోవడానికి ప్రయత్నించేది.

నాకు ఇదంతా చూస్తుంటే సుమిత్ర మనసునీ, అవస్థనీ అర్థం చేసుకోలేని రామ్మూర్తి మీద పీకల్దాకా కోపం వచ్చేది. చాలాసార్లు వాడికి బ్రెయిన్ వాష్ చెయ్యాలని ప్రయత్నిస్తే "ఆ విషయం తప్ప ఇంకేమైనా మాట్లాడు శేషూ" అని నా నోటికి తాళం వేసేవాడు

కాని నిన్న రాత్రి జరిగిందేమిటి? రామ్మూర్తి నిన్న రాత్రి ఇంటికి రాలేదు. వాడి ఆఖరి కూతురు ఏణ్ణర్థం పసిగుడ్డుకి వొళ్ళు తెలియని సుస్తీ చేసింది. సుమిత్ర గుడ్ల నీరు కుక్కుకుంటూ వచ్చి విషయం చెప్తే, నేనే డాక్టర్‌ని పిలిచి, పరీక్షలు చేయించి, సమిత్రకు సాయం ఉన్నాను ఎప్పుడో తెల్ల వారాక రామ్మూర్తి వచ్చి యధావిధిగానే కాలకృత్యాలు తీర్చుకుని బయలుదేరబోతుండగా, "రాత్రి రాలేదేం?" అని అడిగింది సుమిత్ర.

"అదా! నిన్న మా కొలీగ్ ఫాదర్‌కి సీరియస్ చేసింది వాడు కేంప్‌లో ఉన్నాడు. నేను వెళ్ళి ఆ ముసలాయన్ని దగ్గరుండి హాస్పిటల్లో జాయిన్ చేసి, రాత్రంతా సాయం పడుకున్నాను. మనిషన్నాక ఆ మాత్రం సాయం చెయ్యాలి కద సుమిత్రా!" ఎంతో శాంతంగా చెప్పాడు రామ్మూర్తి అంతకంటే శాంతంగా విని




## వినాయక చవితి సంచిక

ఎప్పటివలె యీ సంవత్సరం వినాయక చవితి సంచిక కూడా ఆంధ్ర సచిత్ర వార పత్రిక జన్మ దిన సంచికగా వెలువడుతుంది । రచయితలు, చిత్రకారులు ప్రత్యేక రచనలను వినాయక చవితి సంచిక, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీ-నగరం అన్న చిరునామాకి పోస్టు చేయాలి కార్టూనిస్టులు "విఘ్నేశ్వరు"ని మీద వ్యంగ్య చిత్రాలు పంపనక్కరలేదు వ్యాసకర్తలు హాస్య రచనలు పంపినట్లే కార్టూనిస్టులు కూడా యితర అంశాలపై కడుపుబ్బ నవ్వించే కార్టూన్‌లు పంపడం మంచిది.

**- ఎడిటర్**

## ఇదేమి శిక్ష?

బ్రెబ్రాఏన్ ఫార్‌స్టర్ అనే ఒక తల్లికి- తన పిల్లలిద్దర్ని దిక్కుమాలిన వాళ్లుగా వదిలి పెట్టి పోయినందుకు అమెరికాలో ఒక జడ్జి "జీవితాంతం బిడ్డల్ని కనకుండా- బర్త్ కంట్రోలు" పాటిస్తూ వుండు అని శిక్ష వేశాడు. ఆమె తన రెండేళ్ల కొడుకుని- ఆరుమాసాల బాబునీ- మండుటెండా కాలంలో ఒక గాలీ వెల్తురూ చొరని యింట్లో వదిలిపోయింది. వాళ్లని పెంచడం తనకో సమస్య అయిపోయినందువల్ల వదిలిపోయానని కోర్టులో ఆమె వాదించింది. చంటి పిల్లల్ని దయారహితంగా వదిలిపోయిన నేరానికి నీకింక జన్మలో తల్లి అయ్యే హక్కు లేదని న్యాయమూర్తి శిక్ష వేశాడు- రోజూ పోలీసుస్టేషన్‌లో తాను "గర్భ నిరోధక సూత్రాలు" పాటిస్తున్నానంటూ సంతకం చేయాలిట ఆ అమ్మాయి.



ఊరుకుంది సుమిత్ర.

రామ్మూర్తి ప్రవర్తనకు అవాక్కయిపోయాను నేను

'ఎలాగైనా వీణ్ని మార్చాలి. లేకపోతే వీడు జీవితాంతం ఇలాగే ఉండిపోతాడు' స్థిరంగా నిర్ణయించుకున్నాను నేను

★ ★ ★

ఒక స్థిర నిశ్చయంతో ఆ సాయంత్రం రామ్మూర్తి ఆఫీస్‌కి వెళ్ళాను నేను వెళ్ళే సరికి, రామ్మూర్తి ఒక్కడే ఉన్నాడు. వాడి ముందు దొంతెడు ఫైల్స్

"రామ్మూర్తీ" అన్న నా పిలుపుకి తలెత్తి చూసి "నువ్వా శేషూ! రా కూర్చో!" అంటూ కుర్చీ చూపించి మళ్ళీ ఫైల్లో తల దూర్చాడు.

"ఆఫీసులో నువ్వొక్కడివే ఉన్నావేమిటి?"

"అయిదు దాటిపోయిందిగా అందరూ వెళ్ళిపోయారు. ఇదిగో, ఈ పని అయిపోతే నేను కూడా ఇంటికి వెళ్దామనుకుంటున్నాను." రోజూ ఆరోగంటకి ఇంటికి వెళ్ళేవాడిలా చెప్పాడు.

"ఈ పని రేపు చేసుకోవచ్చు కదా! ఇంటి దగ్గర సుమిత్ర నీకోసం ఎదురు చూస్తోంది."

"ఎందుకనీ!" ఆతృతగా అడిగాడు

"ఏం లేదు ఊరికినే."

"ఓస్! అంతే కదా! ఈ ఫైల్స్ రేపటికల్లా పుటప్ చెయ్యాలి అయినా ఇది నా పని కాదు. మా కొలీగ్ పని వాళ్ళావిడకి ఈ రోజు డెలివరీట ఈ వర్క్ కాస్త చేసిపెట్టమని చెప్పాడు" అంటూనే ప్యూన్‌ని కేకేసి టీలు తీసుకు రమ్మని పురమాయించాడు

"మరి రోజూ ఆఫీసు నుండి లేట్‌గా వస్తుంటావేం?" అడిగాను. ఇలా అడుగుతుంటే ఎందుకోగాని నాకే సిగ్గనిపించింది రామ్మూర్తి ఏదో నేరం చేసినట్లు అతడ్ని నేనిలా ప్రశ్నించడం- నిజంగా ఒక్క క్షణం రామ్మూర్తి మీద జాలేసింది




"రోజూ హెవీ వర్కు ఉంటుందిరా స్టాఫ్ తక్కువ పని ఎక్కువ. ట్రాన్స్‌ఫర్లయి రావలసిన వాళ్ళు చాలా మందున్నారు వాళ్ళంతా వస్తే నాకు కొంత రిలీఫ్ నీకు తెలుసు కదా! చాలా గవర్నమెంటు ఆఫీసులలో ఉండే సమస్యే ఇది." ప్యూన్ తెచ్చిన టీని ఫ్లాస్క్‌లోంచి కప్పుల్లోకి వంచుతూ చెప్పాడు

"ఎంతమంది వచ్చినా నీకు రిలీఫ్ ఉండదురా నీ పని అయిపోయినా నీ చుట్టూ ఉన్నవాళ్ళ పని కూడా నీకు అప్పగించి హాయిగా ఇళ్ళకు వెళ్లిపోతారు. నువ్వు మాత్రం వాళ్ళ కాకమ్మ కథలు నమ్మి, అందరి పనులూ చేస్తూ ఉండిపోతావు ఒకరికి సహాయం చెయ్యాలనుకోవడం తప్పు కాదు నీ సహాయాన్ని ఎదుటివాళ్ళు గుర్తించగలిగినప్పుడే దానికి ఓ అర్థం, పరమార్థం ఉంటుంది"

ఈ మాటలు నా గొంతుదాటి బయటకు రాలేదు. టీకప్పు టేబుల్ మీద పెట్టి "ఇతరులకి సహాయపడే ముందు నీ గురించి కూడా కాస్త ఆలోచించరా మూర్తీ! నా భార్యకి డెలివరీ అంటూ మీ కొలీగ్ వెళ్ళిపోయాడు నీకూ భార్యా, పిల్లలూ ఉన్నారు వాళ్ళని గురించి ఒక్కసారి ఆలోచించు నీ పిల్లలు పెద్దవాళ్ళు అవుతున్నారు వాళ్ళని సక్రమంగా పెంచడానికి నీ భార్యకు నీ సహాయం కూడా కావాలి కనుక నీ బాధ్యతను గుర్తించి మసలుకో. నువ్వు చేస్తున్నది తప్పని నేనను కానీ నీకున్న సమయంలో కొంత భాగాన్ని నీ భార్యా పిల్లలకు కేటాయించు మరి నే వస్తాను" అంటూ బయటకి వచ్చేసాను.

వాడితో ఎన్నో చెప్పాలని అనుకుంటాను. వాడిలో మార్పు తీసుకురావాలని ఎంతగానో అనుకుంటాను. కానీ వాడి

ముఖం చూసి ఏమీ అనలేకపోతున్నాను అది నా బలహీనత

అసలీ సమస్య ఎంత సున్నితమయిందో, అంత జటిలమయినదికూడా సుమిత్ర భర్తతో నోరు తెరచి ఒక్కమాట చెప్తే వాడు మారవచ్చునేమో! కాని తను చెప్పదు వాడితో కాస్త సూటిగా చెప్దామంటే నాకు గొంతు పెగలదు వాడంతట వాడికి తట్టదు కనుక ఇది ఇలా కొనసాగుతూ ఉంటుంది సుమిత్రకు అన్యాయం చేసానేమోనన్న ఫీలింగ్ నన్ను దహించివేస్తూ ఉంటుంది ఎంత చిత్రం ! చూసేవారికి ఇది ఒక సమస్యలా కనిపించదు దాన్ని అనుభవించేవారికే తెలుస్తుంది ఒక సంసారం అస్తవ్యస్తమవ్వడానికి, మగవాడు వ్యసనపరుడే కానక్కరలేదు యోగ్యుడైనప్పటికీ, బాధ్యతారహితంగా ప్రవర్తించేవాడయినా చాలు ఇక ఆ భార్యకు మనస్తాపమే. ఇలా ఆలోచిస్తున్నకొద్దీ నా బుర్ర వేడెక్కిపోతోంది.

నేను ఆలోచిస్తూ మా వీధి మొదలుకి వచ్చేసరికి, రోజూలాగే ఒక డాబా యింట్లోంచి ఏడుపులు, కేకలు వినిపించాయి ఆ డాబాయింట్లో ఒక గదిలో భార్యభర్తా అద్దెకుంటున్నారు ఆ భర్త రోజూ తాగివచ్చి, భార్యను విచక్షణారహితంగా హింసిస్తుంటాడు. ఇరుగుపొరుగువారికి అదొక వినోదమే అయ్యింది. తరచిచూస్తే ఆ సంసారానికీ, రామ్మూర్తి సంసారానికీ పెద్ద తేడాయేం కనిపించలేదు నాకు

* * * *

"నువ్వు చెప్పింది నిజమా?" విస్మయంగా అడిగాను నేను

"అవున్నాన్నా ! నిజం రామ్మూర్తి మామయ్య ఏదో ప్యాకెట్ పట్టుకుని ఇంటికి వెళుతుండగా చూసాను" చెప్పాడు పెద్దబ్బాయి కిరణ్

"అలాగా!! అయితే నేను మామయ్య ఇంటికి ఎళ్లొస్తాను. అమ్మకి చెప్పు" అని చెప్పి, చెప్పులేసుకుని పక్కయింట్లోకి దారితీసాను

నాకు చాలా సంతోషంగా ఉంది ఇన్నాళ్లుగా, ఇంతమంది చెప్పినా మారని రామ్మూర్తి ఇవ్వాల్టికి మారాడు ఎలాగయితేనేం తన బాధ్యతను గుర్తించాడు

ఎలాజరిగిందిది?

సుమిత్ర చెప్పిందా?

లేక నా మాటలు వాడిమీద ప్రభావం చూపెట్టాయా?

నేను ఇంట్లోకి వెళ్లేసరికి "నాన్నా! శేషు అంకుల్ వచ్చారు." హోమ్‌వర్క్ చేసుకుంటున్న రామ్మూర్తి రెండోకొడుకు కేకేసాడు ఆ పసివాడి ముఖంలో ఇటీవలి కాలంలో నేనంత సంతోషాన్ని చూడలేదు

నవ్వుకుంటూ లోపలికి వెళ్ళాను

రామ్మూర్తి వంటింట్లో కూర్చున్నాడు సుమిత్ర వేయిస్తున్న ఉల్లిపకోడీలు రుచిచూస్తున్నాడు వాడు ఏదో చెప్తుంటే సుమిత్ర ముసి ముసిగా నవ్వుతోంది ఆ దృశ్యం నాకెంత నచ్చిందంటే, వాళ్ల ఏకాంతాన్ని భంగపర్చడం ఇష్టంలేక, తిరిగి వెళ్ళిపోదామా అనుకున్నాను. కాని అప్పటికే రామ్మూర్తి నన్ను చూడనేచూసాడు గోడకాన్చివున్న పీట వాలుస్తూ "రారా శేషూ! సుమిత్రా. మీ అన్నయ్యొచ్చాడోయ్ అంటూ చెప్పాడు నేను వెళ్లి రామ్మూర్తి పక్కనే కూర్చున్నాను "ఏమిటో అన్నయ్యా ఈ మధ్య మా యింట్లోకి రావడంమానేసావ్?" పకోడీలు ప్లేట్లో పెట్టి నాకు అందిస్తూ అంది సుమిత్ర.

సుమిత్ర కళ్లలో ఆనందంతో కూడిన మెరుపుని నేను స్పష్టంగా గమనించాను.. చాలాసేపు అక్కడే కూర్చుండిపోయాను సుమిత్రనూ, రామ్మూర్తిని అలా చూస్తూంటే సంతోషంతో నా హృదయం ఉప్పొంగిపోయింది.

"అలా మార్కెట్టుకి వెళ్లొద్దామా శేషూ" బట్టలేసుకుంటూ అడిగాడు రామ్మూర్తి

"పద, నాక్కూడా బజార్లో పనుంది"

సంచీ తీసుకుని బజారుకి బయలుదేరాం

## చేజారిన క్షణం



ఇసుకలో నీటిని జార్చి
ఇంకి పోయాక
నీటి కోసం
మనిషి అన్వేషణ!
ఆకశాన పూసిన ఇంద్ర ధనస్సు
మాసిపోయాక
ఇంద్ర ధనస్సు కోసం
మనిషి అన్వేషణ!
వెలుగున కొవ్వొత్తి వెలిగించి
నిశ్శేషమైన
కొవ్వొత్తి కోసం
మనిషి అన్వేషణ!
వర్తమానంలో
చేజారిన క్షణాలు
భవిష్యత్తుకు
భూతకాలం చెప్పే
గుణపాఠాలు!

-అడిగోపుల వెంకటరత్నమ్

సంభాషణ ఎలా ప్రారంభించాలా అని నేను ఆలోచిస్తుండగా రామ్మూర్తే అన్నాడు

"నేను మారడం మీ అందరికీ ఆశ్చర్యంగా ఉంది కదూ"

"అవును"

"నేను ఇలా హటాత్తుగా మారడానికి కొన్ని కారణాలున్నాయి ముందుగా నీ కొక విషయం చెప్పాలి మన వీధి మొదట్లో ఒక డాబా యిల్లుంది, అందులో అద్దెకుంటున్న భార్యాభర్తల సంగతి నీకు తెలుసు కదా !"

ఇదంతా ఎందుకు చెబుతున్నాడో నాకు అర్థం కాలేదు

# ఆమె కాపురం

"ఆఁ, వాళ్ల సంగతి వీధిలో ఉన్న అందరికీ తెలుసు"

"రోజూ భర్త తాగి భార్యను హింసిస్తూంటే ఆవిడ ఏడుస్తూండేదికదా! నిన్నొక విచిత్రం జరిగింది ఎప్పటిలాగే నేను ఆలశ్యంగా ఇంటికి వస్తుంటే ఆ ఇంట్లో గొడవ జరుగుతుంది అయితే రోజు జరిగేదానికి నిన్న పూర్తిగా భిన్నం ఆ భార్య నిన్న అతడి మీద తిరగబడింది దానితో అతడు తోక ముడిచాడు అప్పుడు నాకు అనిపించింది అతడు తాగి వచ్చి భార్యను హింసిస్తే, ఆ ఇల్లాలు ఓర్చుకున్నాళ్ళు ఓర్చుకొని ఒక్కసారి తిరగబడింది మరి నేను చేస్తున్నదేమిటి? నా ప్రవర్తనతో సుమిత్రను మానసికంగా హింస్తున్నాను కదు! సుమిత్ర ఎంత ఓర్పు గలదయితే మాత్రము, తన ఓర్పుకి కూడా అంతురంటుంది కదా! ఏదో ఒకనాడు సుమిత్ర కూడా అలానే తిరగబడితే మా సంసారం బజారున పడుతుంది. వాళ్ళ సంసారంలాగే అందరికి వినోదం అయిపోతుంది."

సరిగ్గా ఈ పాయింట్ నుంచే నా ఆలోచన ప్రారంభమయింది. ఆలోచించే కొద్ది నా జీవితంలో ఎంత ఆనందాన్ని కోల్పోయానో అర్ధమవసాగింది. పెళ్లి అయిన నాటినుంచి ఈనాటివరకు, హాయిగా భార్య పిల్లలతో గడపవలసిన సాయంత్రాలన్ని, ఎవరుకోసమే వృద్ధా చేసాను ఈ విషయంలో నేను ఎందుకు ఇలా ప్రవర్తించానో నాకే తెలియదు

నాలో మార్పుకు ఇదొక కారణం

ఇక ఇంకో కారణం చెప్తా విను ఒకరికి సాయపడాలన్న తపనలో నేను వేరొక వైపు నుంచి ఎంత లోతుగా మునిగి పోయానో ఇన్నాళ్లుగా గ్రహించలేకపోయాను. నేను మారి పోవాలని నిర్ణయించుకొని, నాకొక కొలీగ్ అప్పగించిన పనిని మరొక కొలీగ్‌కు అప్పజెప్పి, ఇవాళ్ల తొందరగా ఇంటికి వచ్చేద్దామనుకున్నాను కాని అతడు "అయ్యో! నాకు వీలుపడదండి. నేను తొందరగా ఇంటికి వెళ్లాలి" అన్నాడు.

మా సెక్షన్ క్లర్క్ తన పని నాకు అప్పగించబోతే "నేను ఇవాళ అర్జెంటుగా ఇంటికి వెళ్ళాల"ని చెప్పాను. అతడు నన్నొక వింత జంతువును చూసినట్టు చూసాడు.

మా హెడ్ క్లర్క్ దగ్గరకు వెళ్లి "ఈ రోజు కాస్త వేగంగా వెళ్లాలి నేను ఈ బిల్సు ఇంకెవరి చేతనైనా ప్రిపేర్ చేయించండి" అని చెప్పాను నేను

"సారీ మిస్టర్ మూర్తి ఇవాళ స్టాఫ్ అంతా ఎక్సిజిన్సీస్ అని ముందే వెళ్లిపోతున్నారు." అని తప్పించుకున్నాడతను.

నాకు ఒకటి అర్ధమయిపోయింది ఇన్నాళ్లు నా సహాయాన్ని పొందిన వీళ్ళంతా, నేను సహాయాన్నాసిస్తే తప్పించుకో చూసారు వీళ్ళ కోసమా నేను భార్య పిల్లలని విస్మరించి హర్నిశలు కష్టపడింది!

అందుకే నా మనస్సు విరిగిపోయిందిరా శేషు! నీవు చెప్పినట్లు మనం చేసిన సహాయం ఇతరులు గుర్తించినప్పుడే దానికి సార్ధకత ఏర్పడుతుంది ఆ మాట అక్షరాల నిజం ఇన్నాళ్లు ఈ మనుష్యుల నైజం తెలుసుకోలేకపోయాను ఇప్పటికి నా చూట్టు వున్నవారు సంగతి తెలిసింది నా బాధ్యత తెలిసింది" అని ఆవేశంగా చెబుతున్న రామమూర్తి భుజం మీద అనునయంగా చేయివేసి "కంట్రోల్ యువర్ సెల్ఫ్," చెప్పాను నేను నాకు చాలా ఆనందంగా వున్నది ఒక్కరికి ఇచ్చిన సలహా సత్ఫలితాన్ని ఇస్తే ఎంతో సంతోషంగా వుంటుంది. లేకుంటే పశ్చాత్తాపం దహించేస్తుంది ఆ త్రాగుబోతు భర్తకి ఎదురు తిరగమని అతడి భార్యకు సలహా ఇచ్చింది నేనే

ఆ తరువాత ఆ డాబా ఇంటిలో ఎపుడు గొడవ జరుగలేదు నేనిచ్చిన సలహా వల్ల.

"ఆమె కాపురం" కుదుటపడింది
రామమూర్తిలో మార్పు వచ్చింది.
సుమిత్ర సంసారం బాగుపడింది
నాలో అంతర్మథనం తగ్గింది. ●



## ఆణిముత్యం

చదువరుల హృదయాలను ప్రతిస్పందిప చేయగల రచన విశ్వరచన. చక్కని కథాకథన శిల్పంతో బహుళ ప్రయోజన సందేశాత్మకమై అతి చక్కని కొసమెరుపు కలిగిన కథ కథలకు

ఆణిముత్యం కాగలదు అన్నీ అలాంటి ఆణిము త్యాల్లాంటి కథలనే ఏర్చికూర్చి వారం వారం ఓ ఆణిముత్యాలహారాన్ని 'పత్రిక' రూపంలో అందుకుంటున్న మా తెలుగు పాఠకలోకం అదృష్టపరిమాణం అంచనా వేయడం నాకలా నికి గాని మెదడుకుగానీ చేతకాదని సవిన యంగా మనవి చేసుకుంటున్నాను

14-07-89 సంచికలో శే వీణారెడ్డి గారి కథ 'విశ్వకేతనం' చదివాక ఈ లేఖ వ్రాయాలనిపించింది ఏ కథకు ఆ కథే.. ఎంతో గొప్పగా నన్ను ఆకర్షించాయి

-కె. మాధవరావు (సైదాబాద్)

## గమనిక

అనివార్య కారణాల వలన అసంప్రేక్ష్యకారిత్వము ఈ వారం అందించలేక పోయాము.

-ఎడిటర్

## ఈ వారం సలహా

శనివారం రాత్రి యిడ్లీఫలహారం బదులుగా పచ్చివేరుశనక్కాయపలుకులు తినండి. ఆదివారం నవ్వుతూ త్రేలుతూ వుంటారు.

# వీక్లీపోస్ట్

(4 వ పేజీ తరువాయి)

## సీరియల్స్

విశిష్ట రచయితల వినూత్న సీరియల్స్.. శత్రుసంహారం, వజ్రసంకల్పం చాలా ఆసక్తికరంగా ఉన్నాయి.

-జి. అశోక్ వెంకటి, మెట్‌పల్లి

## దొంగల రాజ్యం

వారం వారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక చూడముచ్చటగా నాలుగు రూపాయలకే ఆకర్షణీయంగా వెలువడటం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఈవారం ప్రారంభమయిన "దొంగల రాజ్యంలో" కొత్త సీరియల్ నాకు నచ్చింది.

కథలు అన్నీ ఆణిముత్యాలే. ప్రతివారం కథల విషయంలో చాలా శ్రద్ధ తీసుకుని ప్రచురిస్తున్నారనిపిస్తుంది



"వీక్లీ పోస్ట్"ని పాఠకుల ఉత్తరాలతోపాటు ఫోటో ప్రచురించి, పాఠకులు పాల్గొనే శీర్షికలు ఎక్కువగా ప్రవేశపెట్టడంలో మన పత్రికదే పైచేయి అని నిరూపిస్తారని కోరుతున్నాను.

- కాళహస్తి వెంకట శేషగిరిరావ్
నెల్లూరు-1

## "ధర్మం" ఎక్కడుంది?

"ధర్మాసనం ముందు 'విశ్వామిత్ర' " మీ సంపాదకీయం బహు శ్లాఘనీయం. అసలు ధర్మం ఎక్కడుంది? యుగం మారే కొద్దీ నాలుగు పాదాల నుండి, మూడుకి, మూడు నుండి రెంటికి, రెండు నుండి ఒకటికి తగ్గి, ఆ ఒక్కపాదము కూడా శూన్యమై సదరు ధర్మం అడుక్కునే వాళ్ల వద్ద కుచేరి అయ్యా ధర్మం, అమ్మా ధర్మం అనే స్థితికి దిగజారింది. ప్రజాస్వామ్యం ఎక్కడుంది అంటే శీర్షాసనం వేసి చూడాలేమో! పాలకవర్గానికి కానీ, ప్రతిపక్షానికి గాని ఎంతసేపూ తమ అధికారము, తమ ప్రతిష్ఠ నిలబెట్టుకోవడానికి తాపత్రయ పడటమే తప్ప ప్రజాపరిపాలనవున్నది. తమ పరిపాలనలో ఎలా స్పందిస్తున్నారు అని తెలుసుకునే ప్రయత్నమే చేయడంలేదు. దుర్యోధనుడు దాయాదులపట్ల అధర్ముడైనా, ప్రజలను కష్టపెట్టినట్లు ఎక్కడాలేదు. అట్లా చేసివుంటే, ప్రజా విప్లవం సంభవించివుండేది. ఎప్పుడో నాశనమయ్యేవాడు. కానీ ఇప్పుడు పరిస్థితుల్లో అధికారం కోసం ఒకరితో ఒకరు పార్టీలు పోట్లాడుకుంటూవుంటే, ప్రజలు నలిగి పోతున్నారు. ధరలు విపరీతంగా పెరిగాయి. ప్రజాజీవనం దుర్భరమైపోతున్నది చదువులు కొనాలి, ఉద్యోగాలు కొనాలి. వీటికై పోటీలు పడాలి- జీవనాన్ని సాగించటానికి మనిషిగా ఎందుకు పుట్టామా అని వేదన చెందాల్సిన పరిస్థితులు ఏర్పడినాయి. ఇది సామాన్య మానవుడి సంగతి. ప్రజలకు ఎప్పుడు విముక్తి? ఎప్పుడు మంచిరోజులో?

పి.ఎస్. రత్నమ్మ, కడప




Editorial Adviser *S RADHAKRISHNA*, Editor *VEERAJI*,
Printed and Published by *S NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd ,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003
Phones Editorial 75667, Business 61247, 61248

# వజ్రసంకల్పం నేపథ్యంలో .....

## చెత్తకుప్పలో దొరికిన చిత్రమైన వజ్రం మూడు చెంచాల 'స్పూన్‌మేకర్'

ఇస్తాంబుల్ లోని తోప్కాపీ మ్యూజియంలో వున్న వజ్రాల్లో ముఖ్యమైనది ఈ 85 8 కేరెట్ల అందమైన వజ్రం ఈ వజ్రం గురించి చిత్రమైన కథ ప్రచారంలో వుంది టర్కీకి చెందిన ఒక బెస్తవాడికి ఈ అమూల్య వజ్రం ఒకచోట చెత్తకుప్పలో దొరికిందట దాని విలువ తెలియని ఆ మూర్ఖుడు దాని అందానికి ముచ్చటపడి ఇంటికి తీసుకెళ్ళి చేపల బుట్టలో దాచుకున్నాడు చివరికి దాన్ని ఓ చెంచాలు తయారుచేసేవాడికి మూడు చెంచాలు తీసుకుని యిచ్చేశాడు అందుకే ఈ వజ్రానికి స్పూన్‌మేకర్ అనే తమాషా పేరు వచ్చిందట చెత్తకుప్పలో దొరికిన స్పూన్‌మేకర్ బహుశా 1882 తర్వాత అదృశ్యమైన రెండో టర్కీ వజ్రం కావచ్చునని కొందరి వూహ

స్పూన్‌మేకర్ గురించి మరో కథ కూడా వుంది అల్బేనియాకు పాలకుడిగా వుండిన అలీ పాషా దీన్ని 1818లో కొన్నాడు అలీ పాషా క్రూరుడైన నియంత అతను ఎవర్నీ లెక్కచెయ్యకుండా స్వతంత్రించడం గమనించి టర్కీ సుల్తాను 1822లో అతన్ని అణచడానికి ఒక పెద్ద సైన్యాన్నే పంపించాడు అప్పుడు జరిగిన యుద్ధంలో అలీపాషా తీవ్రంగా గాయపడి పట్టుబడ్డాడు అతని చివరి కోరిక తన సింహాసనం మీద కూర్చొని మరణించడం సుల్తాను ఆ కోరిక మన్నించాడు జీవితంలో



చివరిసారిగా సింహాసనం మీద కూర్చుంటూనే అలీపాషా తన చిట్టచివరి ఆజ్ఞ జారీ చేశాడు తన కెంతో విలువైన రెండు వస్తువుల్ని మరెవరి చేతుల్లో పడకుండా నాశనం చేయమనడమే ఆ ఆజ్ఞ ఆ రెండు 'వస్తువు'ల్లోనూ మొదటిది తన వజ్రం! రెండవది తన భార్య!

అలెగ్జాండర్ డ్యూమా తన ప్రపంచ ప్రఖ్యాతిచెందిన నవల ది కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో లో ఈ సంఘటనని వర్ణించాడు అందులో అలీపాషా వజ్రాన్ని చూర్ణంచేసి పారేసినట్టుగా వుంది కానీ, ఆనాటి అలీపాషా వజ్రం నాశనమైపోలేదనీ, అదే ఈనాటి స్పూన్‌మేకర్ వజ్రమనీ చెప్పేందుకు దాఖలాలున్నాయి కొంతమంది చరిత్రకారులు అలీపాషా వజ్రమే స్పూన్‌మేకర్' అనే వాదన అంగీకరించడంలేదు ఏమైనా ఎక్కువమంది చరిత్రకారులు ఆ రెండు వజ్రాలూ ఒకటే నంటున్నారు మనమూ అదే విశ్వసిద్దాం

ఇంతకీ అలీపాషా కోశాగారంలో నాశనం కావలసిన వజ్రం చెత్తకుప్పలో కెలా వచ్చిందో అనూహ్యం!

నాగరికతకు చాలా దూరంగా వున్నా నాగరిక ప్రపంచం కంటే సురక్షితమైన ప్రదేశం అది.

ఆడివి!

సూర్యోదయ సూర్యాస్తమయాలు రెండూ అక్కడ కనిపించవు

తలిరాకు జొంపముల సందుల త్రోవల నేలవ్రాలు కిరణరేఖలు తీవ్రమైతే అది మండుటెండ కోమలమైతే అది పండు వెన్నెల పగలుకూ రాత్రికీ వున్న తేడా అంతమాత్రమే అక్కడ

ఇప్పుడది సాయంకాలం

కిరణరేఖలు తమ తీవ్రతను కోల్పోతున్నాయి అడివంతా తిరిగి గూళ్ళకు చేరుకుంటున్న పిట్టలు ఆహ్లాదకరంగా కలకలారావాలు చేస్తున్నాయి

హఠాత్తుగా ఆ కలకలారావాల నడుమ మరో శబ్దం వినిపించ నారంభించింది

(గత సంచిక తరువాయి)

ఘల్ ఘల్ మల్లుమనే గజ్జెల చప్పుడు

నేల మీద పడున్న ఎండుటాకుల మీదుగా సుతిమెత్తని పాదాలు రెండు వడివడిగా నడిచిపోతున్నాయి

పక్షులు ఒక్కక్షణం సందడి మానేసి ఆసక్తి నిండిన గుండ్రని కళ్ళతో ఓ సారి అటువైపు చూసి తిరిగి తమ సంగీత సాధనలో మునిగిపోతున్నాయి

నట్టడివిలో ఒంటరిగా నడుస్తున్నా ఆమె కళ్ళలో భయం కనిపించడం లేదు

ఆ అడవిలోనే పుట్టి పెరిగిన వనకన్యతాను ముంతంత కొప్పులో కొండమల్లెలు తురిమింది ముక్కుకు రెండు వైపులా ముక్కెరలు పెట్టింది జబ్బుకు నాగరక్ష కట్టింది ఆచ్ఛాదన లేని ఎత్తైన రొమ్ముల పైనుంచి పైట చెంగు బిగలాగి నడుము దగ్గర దోపింది అనుకోని ప్రమాదాలు ఎదుర్కోవడానికి వీలుగా పదునుగా నూరిన పిడిబాకు కోకమడి వెనక దాచింది

నడక వేగాన్ని బట్టి చూస్తే ఆమె దేని గురించో చాలా ఆత్రంగా వెళ్తోందని స్పష్టంగా తెలుస్తోంది

ఆ ఆతృత దేనిగురించో చెప్పగలగడం అంత కష్టమేం కాదు అదురుతున్న అధరాలూ పొంగుతున్న పయోధరాలూ చెప్పకనే చెబుతున్నాయి

ఆమె అభిసారిక

చాటుగా ప్రియుడ్ని కలిసేందుకు వెళుతున్న ప్రేయోపచారిక సంకేత స్థలం కూడా ఎక్కువ దూరం వున్నట్టు లేదు

అందుకే ఆ ఆతృత

అందుకే ఆ వడివడి నడక

రానురాను నడక వేగం పెరుగుతోంది

హఠాత్తుగా సన్నని సంగీతం వినిపించింది

పిల్లనగ్రోవి పిలుపు

చప్పున ఆగిపోయి ఆమె తల పైకెత్తి చూసింది

బ్రహ్మాండమైన మర్రిచెట్టు.

కిచకిచ లాడుతూ కొమ్మలు పట్టి వూగుతున్న కోతులు తప్ప మరెవరూ కనిపించలేదు

పిల్లనగ్రోవి పిలుపు వున్నట్టుండి ఆగిపోయింది

ఆమె ఆదుర్దాగా చుట్టూ పరికించి చూడబోయింది అంతలోకే వెనక నుంచి ఎవరో వచ్చి ఆమెను చుట్టేశారు హఠాత్తుగా జరిగిపోయిన ఆ సంఘటనకు చిన్నగా కేక పెడుతూ ఆ వ్యక్తితో సహ

అవనీ సహనం బలిపీఠానికెక్కుతుంటే,
అసుర న్యాయం స్వార్థ రుధిరాన్ని కక్కుతుంటే,
సంచలిస్తుంది అగ్ని ధిక్కార స్వరం !
ప్రజ్వలిస్తుంది వజ్ర సంకల్పం !!

తూలి ఒక్కసారిగా కింద పడిపోయింది ఎండుటాకులు గలగలా శబ్దం చేశాయి

అద్గదీ! జడుసుకుందిరో పిట్ట!' పకపకా నవ్వుతూ గేలి చేశాడతను

ఆమె మొహం ఉక్రోషంతో ఎర్రబడింది

'చ పో! నేనేం జడుసుకోలా!' బెట్టుగా చూసింది

మరి, గుండె ఎందుకిట్టా కొట్టుకుంటూ వుందంట?'' చొరవగా ఆమె గుండె మీద చెయ్యి వేస్తూ చిలిపిగా అడిగాడు

ఉన్నట్టుండి ఆమె చూపుల పైన సిగ్గుతెర కమ్మేసింది వాలిపోతున్న కళ్ళను ప్రయత్నం మీద పైకెత్తుతూ ఆ చేతి మీద చెయ్యి వేసి తనకేసి హత్తుకుంది

'నీ కోసం మావా!''

ఆ మాట అంటూనే అమాంతంగా అతన్ని చుట్టేసింది మరుక్షణం అతని పెదవులు ఆమె పెదవుల పైకి ఆత్రంగా చేరుకున్నాయి లతలా అతన్ని పూర్తిగా అల్లుకుపోయిందామె

ఆ ఇద్దరి కౌగిలిలో కాలం కర్పూరంలా కరిగిపోయింది

ఎప్పుడో చాలా సేపటి తర్వాత వాళ్ళిద్దరూ ఒకరి నుంచి ఒకరు వేరుపడే వేళకు మసక చీకట్లు కమ్ముకుంటున్నాయి

అతను కృతజ్ఞతగా ఆమె రెండు కళ్ళూ ముద్దాడుకున్నాడు

ఆమె కళ్ళు రెపరెపలాడుతూ విచ్చుకున్నాయి

సీరియల్

# నిజసంకల్పం శాతవాహన

అతని నుదుటి పైన అలుముకున్న స్వేద బిందువుల్లో ఒకదాన్ని చూపుడు వేలితో ప్రేమగా రాస్తూ సమ్మోహనకరంగా నవ్వింది

ఏదో చెప్పడానికన్నట్టుగా ఆమె పెదవులు నెమ్మదిగా కదిలాయి

ఆ చెప్పదల్చుకున్నదేదో పెదవి దాటి బయటికి రానేలేదు

భయంకరమైన శబ్దం వినిపించింది!

ఇద్దరూ ఒక్కసారిగా అదిరిపడి లేచి కూర్చున్నారు

మర్రిచెట్టుపై నున్న కోతులు వికృతంగా అరుస్తూ తోకలు పైకెత్తి చెట్ల కొమ్మల మీదుగా దూకుతూ పారిపోతున్నాయి చెట్ల మీద భయంకరమైన కోలాహలం ప్రారంభమైంది కొన్ని వందల, వేల పక్షులు ఒక్కసారిగా రెక్కలల్లాడించుకుంటూ పెద్దగా అరుచుకుంటూ అమాంతం ఆకాశంలోకి లేచి ఆ ప్రదేశం విడిచి ఎగిరిపోతున్నాయి పొదల్లోని చిన్న చిన్న జంతువులు ప్రాణాలు కాపాడుకునేందుకు వెర్రిగా ఎటో పరుగులు తీస్తున్నాయి

క్షణాల మీద పరిస్థితి మారిపోయింది

ఇప్పుడా ప్రదేశం అందమైన అడివి కాదు- అతి ప్రమాదకరమైన ఘోరారణ్యం!

భయంకరమైన ఆ శబ్దం మళ్ళీ వినిపించింది

# వజ్రసంకల్పం

శబ్దం కాదది– గాండ్రింపు!

గుండెలు జలదరింపజేసే పులిగాండ్రింపు!

కళ్ళ ముందు ఒక్కసారిగా మెరుపు మెరిసినట్లైంది

చెట్ల గుబురులోంచి ఓ భయంకరాకారం కుప్పించి అమాంతం గాల్లోకి లేచింది

తప్పించుకోవడానికి ఏమాత్రం అవకాశం లేకపోయింది

కళ్ళు మూసి తెరిచేలోగా వాళ్ళ ముందు ప్రత్యక్షమై నాలుగు కాళ్ళ మీద కదలకుండా నిలబడి నిశ్శబ్దంగా ఒక్క క్షణం కళ్ళలో కళ్ళు పెట్టి చూసిందది

దాని కళ్ళు ప్రమాదకరంగా మెరుస్తున్నాయి

దాని శరీరం నుంచి వస్తున్న దుర్గంధం వాళ్ళ ముక్కుపుటాలకు సోకుతోంది

ఆమె సర్రున కత్తి దూసింది

ఉన్నట్టుండి దాని నోరు గుహలా తెరుచుకుంది

చెవులు చిల్లులు పడేట్టు, గుండెలు అవిసిపోయేట్టు అది చేసిన గాండ్రింపుకు అడివి దద్దరిల్లిపోయింది

ముతకా మగోళ్ళందరూ లెగండి ఈటెలు పట్టండి దివిటీలు ముట్టిచ్చండి డప్పులు కొట్టండి దెబ్బకు పులి లగెత్తాల లెగండి ''

యువతరంలో ఉత్సాహం ఒక్కసారిగా మిన్నుముట్టింది

'లెగండి!'

'లెగండి!'

తలా ఓ దిక్కు పరుగులు తీస్తున్నారు

కేకలతో ఆ ప్రదేశం దద్దరిల్లింది

ఇంతలో ఓ ముసలి తల్లి మొల్లుమంటూ వచ్చింది

'ఒరే నాయనా! మా సిన్నోడు అడివిలోనే వుండాడ్రా!'' గుండెలు బాదుకుంటూ అరిచిందావిడ

క్షణాల మీద చిన్నోడు అడివిలోనే వున్నాడన్న వార్త దావానలంలా గూడెమంతా పాకిపోయింది

అందరి గుండెల్లోనూ ఒకే ప్రశ్న

తాము వెళ్ళేసరికి చిన్నోడు బతికుంటాడా?

* * * *

**ఇంతవరకూ సాగినకథ - 8 : విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో బావి త్రవ్వుతుండగా అపురూపమైన వజ్రం దొరుకుతుంది. అతని దాయాది అయిన వజ్రపాణి దాన్ని కాజేయాలనుకుంటాడు. ఆ వజ్రాన్ని కాపాడుకునేందుకు చేసిన ప్రయత్నంలో విశ్వధరవర్మ కొడుకు రాజేంద్రవర్మ, అతని కుటుంబం వజ్రపాణి కత్తికి ఎర అవుతారు. విశ్వధరవర్మ చిన్నకొడుకు నరేంద్రవర్మపై హత్యానేరం మోపబడి ఉరిశిక్ష పడుతుంది. జైలర్ సత్యం అనుమతితో తన భర్తతో గడిపిన కౌసల్య మగబిడ్డకు జన్మ నిస్తుంది. ఆ బిడ్డకు శక్తిధరవర్మ అని పేరు పెడ్తారు. మనవడు పుట్టిన ఆనందంలో విశ్వధరవర్మ వజ్రపాణి అంతం చూస్తానని బెదిరిస్తాడు.**

ఆ భయంకర శబ్దానికి ఆమె వణికిపోతూ కత్తి జారవిడి చేసింది

ఖడ్గాల్లా వున్న దాని రెండు కోరలు చూస్తూనే ఆమె కళ్ళు తిరిగాయి

స్పృహ తప్పి నిశ్శబ్దంగా అతని చేతుల్లో వాలిపోయింది

పెద్దపులి మరోసారి భయంకరంగా గాండ్రించింది

* * * *

మొదట లీలగా వినిపించిన ఆ భయంకర శబ్దం రెండోసారి స్పష్టంగానూ ఆ తర్వాత మరింత స్పష్టంగానూ వినిపించింది

ఆ గూడెం ప్రజలు వెంటనే అప్రమత్తులైపోయారు పులీ పులీ పులొచ్చిందిరోయ్!

ఒకరికొకరు చెప్పుకుంటూ అరుచుకుంటూ అందరూ కలిసి ఒక్కుమ్మడిగా గూడెం పెద్ద దగ్గరికి పరిగెత్తుకుంటూ పోయారు

వోరూ బయపడమాకండి! పెద్ద గొంతుకతో అరిచి చెప్పాడు గూడెం పెద్ద పెద్దా సిన్నా ముసలీ

అక్కడికి కొద్ది దూరంలో వున్న మరో గూడెంలో మరో అలజడి చెలరేగుతోంది

సిన్నమ్మ సిన్నమ్మ సిన్నమ్మ అడివిలోకెపోయింది'' అరుస్తున్నారెవరో

"ఒర్నాయనో! పులి సిన్నమ్మని సంపేత్తదిరో!'' ఎవరో శోకాలు పెడుతున్నారు

తెగండి ! లెగండి ! సిన్నమ్మ అడివిలో వుందంట! కేకలు

అరుపులు

గందరగోళం

అందర్నీ పీడిస్తున్న ప్రశ్న ఒకటే

అందరూ కదిలి వెళ్ళే వరకూ పులి సిన్నమ్మని వదుల్తుందా?

* * * *

స్పృహ కోల్పోయిన చిన్నమ్మని నెమ్మదిగా నేలమీదికి జార విడిచాడతను వణుకుతున్న చేతుల్తో నేలమీద పడున్న పిడిబాకును జాగ్రత్తగా అందుకున్నాడు అలా వంగుతున్నప్పుడు కూడా అతనికళ్ళు కాలయముడి స్వరూపంలా ఎదురుగా నిలబడివున్న పెద్దపులి వైపే చూస్తున్నాయి

అతని శరీరమంతా చెమటలో స్నానం చేసినట్టుగా తడిసి పోయింది

దాని కళ్ళు వజ్రాల్లా మెరుస్తున్నాయి

ఏ క్షణంలో నైనా అది తన మీదికి దూకవచ్చు

తప్పించుకోగలమన్న ఆశ ఎంతమాత్రమూ పెట్టుకోనవసరం లేదు పులి పంజాతో తనకు చావు తప్పదు తన ఎదురుగా వున్నది సామాన్యమైన పులికాదు మనుష్యుల్ని చంపితినే పులి

నరభక్షకి!

ఇప్పటికే చాలా మంది దాని వాత పడ్డారు

అతను క్షణంలో ఓ నిర్ణయాని కొచ్చాడు

తన ప్రాణాలు పోయినా పర్వాలేదు

తన బొందిలో ప్రాణమున్నంత సేపూ పులి చిన్నమ్మని సమీపించ డానికి వీల్లేదు పులి తననే చంపనీ తనని చంపేశాక ఎటో ఈడ్చుకు పోతుంది తర్వాత చిన్నమ్మ మీద దానికి ఆసక్తి వుండక పోవచ్చు ఇప్పుడదొక్కటే ఆశ

ఉద్వేగంతో అతని గుండెలు ఎగసిపడ నారంభించాయి

కళ్ళు పెద్దవి చేసి దాన్నోసారి పరీక్షగా చూశాడు

మసక చీకట్లో దాని పచ్చని దేహం మీద నల్లని చారలు స్పష్టంగా కనిపిస్తున్నాయి భిన్న కోణాల్లో కనిపిస్తున్న మృత్యు దేవత నీడలవి

అతనికి చిన్నమ్మతో చేసుకున్న బాసలు మనసులో మెదిలాయి

యములాడే నాకాడి కొత్తే యేం జేత్తావు మావా? అడిగిందోసారి చిన్నమ్మ

నిన్నొగ్గేసి నన్నట్టుకెళ్ళమంటానే!'

ఛా పో! వుత్తది!

'సత్తెం చెప్తుండా! నీకోసమై పేణాలైనా యిచ్చేత్తానే పిల్లా!'

అమ్మో! భయం నటిస్తూ తనని చుట్టేసిందామె 'నన్నొగ్గేసి నువ్వు పోతానంటావురా మావా? సస్తే యిద్దరం సావాల! బతికితే యిద్దరం బతకాల!'

అతని కళ్ళ వెంబడి దారాపాతంగా కన్నీళ్ళు జారిపోనారంభించాయి

లేదు

ఇద్దరూ కలిసి బతికే రాత రాయలేదు దేవుడు

చస్తే తనే ముందు చావాలి

చిన్నమ్మ ఎంతకి తెగించి తనని కోరుకుందో తనకు బాగా తెలుసు రెండు గూడేల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది చిన్నమ్మ తనతో తిరిగిందని తెలిస్తే వాళ్ళగూడెం వాళ్ళు ఉప్పుపాతర వేస్తారామెని తెలిసీ తనతో తిరిగింది అలాంటి చిన్నమ్మ కోసం తను ప్రాణాలివ్వడం గొప్ప సంగతి కాదు

ఉన్నట్టుండి వులిక్కి పడ్డాడతను

పులి కదులుతోంది!

చాలా నెమ్మదిగా కదుల్తోంది!

క్రమంగా వెనక్కాళ్ళ మీదికి వంగుతోంది!

అతని కర్థమైంది

ఒక్కక్షణం అంతే!



ఆ తర్వాత పులి కుప్పించి తన మీదికి దూకేస్తుంది

అతను లేచి నిలబడ్డాడు

కడసారిగా చిన్నమ్మ మొహం చూసి తల పైకెత్తాడు

పులి కుప్పించేందుకు సిద్ధంగా వుంది

క్షణమా?

రెండు క్షణాలా?

ఎంతసేపు తనకింకా ఆయుష్షు?

చేతిలో బాకుతో తయారుగా నిలబడ్డాడు

పులి గాండ్రిస్తూ గాల్లోకి లేచింది

* * * * *

దివిటీలు వెలిగించి డప్పులు కొడుతూ కొమ్ములూదుతూ తలా ఒక దారిని పరిగెత్తుకుంటూ వస్తున్న రెండు గూడేలవాళ్ళూ హఠాత్తుగా ఒకరికొకరు ఎదురు పడ్డారు

మరుక్షణం భయంకర మైన నిశ్శబ్దం వ్యాపించింది

ఎక్కడి వాళ్ళక్కడే కొరివి దెయ్యాన్ని చూసినట్టు ఆగిపోయారు

డప్పు లూరుకున్నాయి

కొమ్ములు మూగబోయాయి

ఈటెలు పైకి లేచాయి

ఒక గూడెం వాళ్ళు రెండో గూడెం వాళ్ళని నిప్పులు కురిసే కళ్ళతో చూసుకున్నారు

జై పోలేరమ్మా!

ఒక గూడెం నాయకుడి చేతిలోని గండ్రగొడ్డలి పైకి లేచింది

జై మాంకాళమ్మా!

రెండో గూడెం నాయకుడి చేతిలోని ఈటె గిర్రున తిరిగింది

ఒకరికొకరు బద్ధశత్రువులైన ఆ రెండు గూడేల వాళ్ళూ తాము బయల్దేరిన పని మర్చిపోయారు

కల్లో కూడా ఒకరి నొకరు నరుక్కునేంత తీవ్రమైన వైరమది!

క్షణాల్లో ఎవరికి వాళ్ళు యుద్ధానికి సిద్ధమైపోయారు

అక్కడ ఏర్పడిన ఉత్తేజకరమైన నిశ్శబ్దంలో దూరం నుంచి పులి చేస్తున్న గాండ్రింపు లీలగా వినిపిస్తూనే వుంది

* * * * *

పులి ఒక్క లంఘింపులో వచ్చి మీదపడింది

పడుతూనే పంజా విసిరింది

ఆ దెబ్బకు విసురుగా వెళ్ళి కొన్ని అడుగుల దూరంలో పడ్డాడు చిన్నోడు

పంజా దెబ్బకు ఛాతీ మొత్తం రక్తసిక్తమైపోయింది

చిన్నోడికి బాధ తెలియలేదు

పులి దృష్టి చిన్నమ్మ మీద పడకుండా చేయడమే అతని సంకల్పం

కిందపడుతూనే చివాల్న లేచి నిలబడ్డాడు

చేతిలోని బాకు మీద ఏమాత్రం పట్టు బెసగనివ్వలేదు

పులీ చిన్నోడూ కొద్ది క్షణాలు ఒకరినొకరు తీవ్రంగా చూసుకున్నారు

అది మరోసారి గాండ్రించి ముందరి కాళ్ళ మీద దూకుతూ శరవేగంగా ముందుకు దూసుకొచ్చింది

(ఇంకా ఉంది)

"కలియుగ అభిమన్యుడు"లో శాంతిప్రియ



ఆంధ్ర సచిత్ర వార పత్రిక

రు. 3000లు గెల్చుకోండి!

కథకులారా! కలందూసి సిద్ధం కండు!

కడు రమ్యమైన సరికొత్తరకం కథలపోటీ

వివరాలు పై సంచికలో